# శ్రీ జ్యోతిష విద్యానిధి

## తెలుగులో మొదటిసారిగా
## ఆయుర్గణిత పట్టికలు- ఫలిత జ్యోతిషం,
## నారదసంహిత విషయాలతో


సాహిత్య విద్యా ప్రవీణ, తర్క-వేదాంత ధురీణ
జ్యోతిష - తంత్ర పారీణ

బ్రహ్మశ్రీ **మేడవరపు సంపత్‌కుమార్**

M.A., సంస్కృతం



పబ్లిషర్స్ :

ఫోన్ : 2465253

**గొల్లపూడి వీరాస్వామి సన్**

**పబ్లిషర్స్ అండ్ బుక్ సెల్లర్స్**

**కోటగుమ్మం, రాజమండ్రి- 533 101**




2007 వెల :80-00

# శ్రీజ్యోతిష విద్యానిధి

by
మేడవరపు సంపత్‌కుమార్
4-399 "విశ్వామిత్ర బిల్డింగ్"
తారకరామానగర్, నరసింహరోడ్
జగన్నాథపురం, కాకినాడ - 2

**ప్రధమ ముద్రణ - 2007**

**ముఖచిత్రాలంకరణ :**
**కె.బి. క్రియేషన్స్**
**రాజమండ్రి ., ఫోన్ : 2464707**

**గ్రంథ ముద్రణ :**
**శ్రీ మహేశ్వరి ఆఫ్‌సెట్ ప్రింటర్స్**
**రాజమండ్రి - 533 104., ఫోన్ : 2478594.**

**డిటిపి**
**పద్మనాభ ఆఫ్‌సెట్ ప్రింటర్స్**
**కాకినాడ, ఫోన్ : 2378088**

**ముఖచిత్ర ముద్రణ :**
**ఈశ్వర్ గ్రాఫిక్స్**
**రాజమండ్రి - 533 103., ఫోన్ : 2461532**

# జ్యోతిష శాస్త్ర ఆవిర్భావం

ప్రాచీన కాలములో మానవుల నాగరికత అంతా నదీ తీరప్రాంతాల్లోనే జరిగిందనేది చారిత్రక సత్యం. ఈజిప్టు నాగరికత నైలునది తీరమున, సుమేరియన్లు టైగ్రిస్ యూఫ్రిటస్ నదుల మధ్య భూములందు – (ఇరాకీయులు కూడా ఇచ్చటే) హ్వాంగ్ హో నదివద్ద చైనీయులు – సింధునదీ తీరంలో భారతీయ నాగరికత పరిఢవిల్లాయి.

వ్యవసాయదారులు – వర్తకులూ, ఇతర దేశపు నాగరికతలు – కళలు – శాస్త్రజ్ఞానం మన దేశంలో అభివృద్ధి చెందడానికి, పరస్పర జ్ఞాన వినిమయానికి ఎంతగానో తోడ్పడ్డారు.

నైలునదికి 365రోజుల కొకసారి వరదలు రావడం ఈజిప్టు దేశీయులు గుర్తించారు. ప్రకృతిలో జరిగే మార్పులను 3 ఋతువులుగా వర్గీకరించారు. అది ఇంచుమించు క్రీ॥పూ 3000 సం॥ల క్రితం సంగతి.

మెసపుటోమియాలో (ఇరాక్) క్రీ॥పూ 2000 సం॥లో ఉత్తరాన అస్సీరియన్లు సంచారజాతులుగా దక్షిణ అరేబియా నుండి వలస వచ్చారు. దక్షిణాన ఉండే సుమేరియన్లు తూర్పుతీర ప్రాంతాల నుండి వలస వచ్చారు. వీరిరువురూ కొంత కాలానికి కలసి అస్సీరియన్ల ఆధిపత్యంలో బాబిలోన్ ప్రాంతం 1750 క్రీ॥పూ॥లో రాజధానిగా చేసుకున్నారు.

వ్యవసాయ–శాస్త్ర–సాంకేతిక రంగాలలో బాబిలోనియన్లు చాలా త్వరితంగా అభివృద్ధి సాధించారు. అదే కాలంలో భారతదేశంలో చైనాదేశంలో సమాంతరంగా అభివృద్ధి చెందారు.

భూమిపై పడేనీడను కొలచి సూర్యచంద్రుల గమనం – కాలగణన చేయడం తెలుసుకొన్నారు.

క్రీ॥పూ 8వ శతాబ్దంలో బాబిలోనియన్లు ఖగోళశాస్త్ర – జ్యోతిష శాస్త్ర లెక్కలు, వర్షాగమనములు, గ్రహముల ఆకారములు, రాశుల వివరాలు మట్టి దిబ్బలపై

లిఖించారు. పురాతత్త్వ శాస్త్రవేత్తలు 19వ శతాబ్దిలో జరిపిన త్రవ్వకాలలో ఇవి బయటపడి ఆనాటి వారి విజ్ఞానమును ఈనాటి వారికి తెలిపాయి.

పగలు–రాత్రి సమానంగా ఉండే విషవత్తు దినముల గూర్చి (ఈక్వినాక్స్) వారు వివరంగా వ్రాశారు.

ప్రాచీన గ్రీకు గణితవేత్త హెరోడోటస్ – పైథోగరస్ మొ॥ బాబిలోనియా వెళ్ళి ఎంతో విలువైన విజ్ఞానం సేకరించి వచ్చారు.

ఈ సమయంలోనే జ్యోతిష శాస్త్రం ఖగోళశాస్త్ర నుంచి విడివడి స్వతంత్రంగా ఏర్పడి మానవుడి భవిష్య ఫలితాలు చెప్పే దర్శనంగా ఆవిర్భవించింది.

గ్రహముల గణితమే కాకుండా గ్రహణముల రాక, ఋతువుల పోకడ – భూకంప – ఉల్కాపాతములు క్రమేణా గ్రహ సంహితాభాగంలో చోటు చేసుకున్నాయి.

క్రీ॥పూ 8000 సం॥క్రితం వైదికయుగముగా కొందరు చెబుతున్నారు. వేదాంగములలో జ్యోతిషము ఒకటిగా పేర్కొని దీనిని నేత్రస్థానమని ప్రముఖ స్థానం కల్పించారు. ఆకాలంలో ముఖ్యముగా యజ్ఞములు చేయుటకు శుభముహూర్త కాల నిర్ణయము జ్యోతిషము ద్వారా గణించేవారు.

క్రీ॥పూ 4000 సం॥లలో పురాణ యుగములో రామాయణ భారతములు రచించబడ్డాయి. శుభనక్షత్రములలో జననము, పుత్రకామేష్టి యాగమునకు శుభముహూర్త నిర్ణయము, చాంద్రమాన కాలరీత్యా తిధులు – నక్షత్రములు చెప్పబడ్డాయి.

క్రీ॥పూ 3000 సం॥లలో సింధునాగరికత శిధిలాలు, అందులో భాగమైన హరప్పా – మొహంజొదారు కాలం నాటి కళా విజ్ఞానాలు బ్రహ్మీలిపులు వెలుగు చూశాయి. (ఆఫ్ఘనిస్తాన్ దేశము) గాంధారమునకు చెందిన వలస జాతివారు గంగా తీరం వరకు విస్తరించి వచ్చారు.

క్రీ॥పూ 600 సం॥లో సిద్ధార్దుడు జన్మించాడు. ఆనాటి ఆస్థాన జ్యోతిష్యుడు అసితుడు సిద్ధార్ధుని జాతకం పరిశీలించి, ఈ బాలుడు భవిష్యత్‌లో చక్రవర్తిగాని

గొప్ప సన్యాసిగాని అవుతాడని చెప్పాడు. బుద్ధుని కాలానికే జ్యోతిష శాస్త్రం బాగా వ్యాప్తిలో ఉంది.

క్రీ॥పూ 100 సం॥లలో ఉజ్జయిని జ్యోతిష శాస్త్రంలో గొప్ప ఖ్యాతి గణించింది. మధ్యప్రదేశ్‌లోని నేటి ఉజ్జయినియే నాడు అక్షాంశ – రేఖాంశములకు కొలమానంగా పేర్కొనబడింది.

క్రీ॥శ 140 సం॥ నాటికి, అలెగ్జాండ్రియాకు చెందిన టోలమీ అనే గణిత శాస్త్రవేత్త ఖగోళ శాస్త్ర విజ్ఞాన సర్వస్వం ఆల్మాగెస్ట్ రచించాడు. అలా పశ్చిమదేశాలకు వ్యాపించిన ఈ భారతీయ విద్య మరల శకుల కాలంలో మనదేశంలో విస్తృతంగా వ్యాప్తి పొందింది.

క్రీ॥పూ 1వ శతాబ్దిలో గ్రీకు వారి జ్యోతిష శాస్త్ర పురాణం, మన భారతీయ జ్యోతిష శాస్త్రంపై ప్రభావం చూపాయి. గ్రహములు, రాశులు, గ్రీకు దేవతలనుంచే గ్రహించబడ్డాయి. ఆ పేర్లు కూడా గ్రీకు భాషనుంచే స్వీకరించి సంస్కృతీకరించ బడ్డాయి.

క్రీ॥శ 400లో పంచ సిద్ధాంతములు రూపొందినాయి. అవి 1–పౌలిశ 2–రోమక 3–వశిష్ఠ 4–సూర్యసిద్ధాంత 5–పైతామహ సిద్ధాంతములు.

బాబిలోనియన్ల చంద్రమాన గణితము ననుసరించి సౌర–చాంద్ర పంచాంగము రూపొందించబడినది. గ్రీకుల రాశులు భారతీయ చాంద్రమానములో తిథి–నక్షత్ర పరిమాణముల కనుగుణముగా ఐకమత్యం సాధించాయి.

క్రీ॥శ 5–6 శతాబ్దములు. ప్రసిద్ధ భారతీయ జ్యోతిష శాస్త్రవేత్తలనందించాయి. వారిలో మొదటివాడు ఆర్యభటుడు (క్రీ॥శ 476–523)

ఈనాడు మనము ఉపయోగిస్తున్న సంఖ్యామానము, దశాంశ పద్ధతి మన భారతదేశమునుంచే పాశ్చాత్యదేశములకు వ్యాపించినది. ఇస్లాము యూరప్ దేశములను క్రీ॥శ 1100లో చేరినది.

క్రీ॥శ 5వ శతాబ్దికి చెందిన పరాశరుడు మొట్టమొదటిసారిగా విపులముగా "హోరాశాస్త్ర"మను జ్యోతిష శాస్త్రమును రచించాడు. తదనంతరము వరాహమిహిరా చార్యులు క్రీ॥శ॥ 505–587 ఎంతో ప్రఖ్యాతిగాంచాడు. టోలమీ ఏ విధముగా "హిపార్చస్" నుంచి సేకరించిన జ్ఞానమును శాస్త్ర బద్ధముగావించాడో, అదే విధముగా వరాహమిహిరాచార్యులు ఆనాటికి లభ్యమయిన ఖగోళ–జ్యోతిష శాస్త్ర విజ్ఞానమును శాస్త్ర బద్ధముగా రూపొందించి, బృహత్సంహిత – బృహజ్జాతకము వంటి ప్రామాణిక గ్రంధములు రచించాడు.

క్రీ॥శ 6వ శతాబ్దిలోని "కళ్యాణ వర్మ" వరాహమిహిరుల బృహజ్జాతకము ననుసరించే మరింత విపులముగా "సారావళి" రచించాడు. 16వ శతాబ్దిలో మంత్రేశ్వరుడు ఫలదీపిక రచించాడు.

క్రీ॥శ॥ 1200 నుండి 1757 వరకు సాగిన ముస్లిం పరిపాలనలో కేవలం చంద్రమానాధారముగా రూపొందిన "హిజిరీ" పంచాంగము అనుసరింపబడేది. హిందువులు తమ మతసంబంధ విషయములు నెరవేర్చుకొనుటకు సౌర–చాంద్రమానా ధారముగా పంచాంగములు రూపొందించుకున్నారు. ముస్లింసేనలు హిందువులు రూపొందించి నిర్మించిన వేధశాలలు నాశనం చేశారు. జ్యోతిషశాస్త్రవేత్తలు భిన్న భిన్న ప్రాంతములలో ఉండి, వివిధ చారిత్రిక – సాంస్కృతిక సంప్రదాయానుసారముగా వారి వారి పంచాంగములు రూపొందించుకునేవారు. అందుచేతనే ఉత్తర భారతదేశ మందు విక్రమ శకము, దక్షిణభారతదేశమందు శాలివాహనశకము, సంయుక్తముగా కలిశకము అనుసరించేవారు.

క్రీ॥శ॥ 1757లో ఆంగ్లేయులు వచ్చిన తరువాత, రాజకీయ వ్యవహారములు నిర్వహించుటకు, ముస్లిం పంచాంగముల స్థానములో "గ్రెగొరియన్" క్యాలండర్ చేరింది. బ్రిటిషు క్యాలండర్ రీత్యా సంవత్సరమునకు 365రోజుల 6గంటలు. ఇదీ భూమి ఒకసారి సూర్యుని చుట్టూ తిరుగుటకు పట్టుకాలము. 6గంటల భేదము సవరించుటకు 4సం॥ల కొకసారి 29రోజుల ఫిబ్రవరిని లీపు సం॥రముగా ప్రతిపాదించారు.

క్రీ॥శ॥ 1947లో భారతదేశం స్వాతంత్ర్యం పొందిన తరువాత, దేశములలో వివిధ సిద్ధాంతములతో విభిన్న పంచాముగములు ప్రచారములో నుండుట వలన, ముఖ్యమైన పండుగలు – శెలవులు ప్రభుత్వము ప్రకటించుటకు, అందరికీ ఆమోదయోగ్యమైన ఒక పంచాంగ విధానము నిర్ణయించుటకు 1952లో "కేలండర్ రిఫార్మింగ్ కమిటీ" ఏర్పాటుచేసారు. వీరి నివేదిక 1955లో ప్రకటింపబడినది.

పంచాంగములో ముఖ్యమైన వివాదాస్పద విషయము అయనాంశ. గణితరీత్యా వచ్చిన గ్రహస్థానమునకు – వాస్తవములో ఉన్న గ్రహ స్థానమునకు గల భేదమే అయనాంశగా చెప్పవచ్చును. ఇది అనేక విధములుగా ఉండెడిది. కమిటీ వారు ఈ అయనాంశ నిర్ణయ విషయములలో అనేక సమస్యల నెదుర్కొని, చివరకు లాహిరీ అయనాంశను అనుసరించుటకు, ప్రతీ సం॥ "ఇండియన్ ఎఫిమెరీస్" సౌర–చాంద్రమానానుసారముగా వెలువరించుటకు నిశ్చయించారు.

ఈ జాతీయ పంచాంగము 1956 మార్చి 21 నుంచి అమలులోనికి వచ్చునట్లు, ఆ సం॥ లాహిరీ అయనాంశ '$23^{0}.15$' డిగ్రీలుగా నిర్ణయించారు. వివిధ ప్రాంతములలో భిన్న సంప్రదాయములతో వివిధ పంచాంగములు వెలువడుతూ ఉన్నా, ఇండియా ఎఫిమెరీస్ – గ్రహముల స్థితిని సూర్యోదయ కాలమునకు ఉ.5.30 ఇస్తున్నారు. 6 ఋతువులు వివరిస్తూ ఉజ్జయినీ కాలము ప్రామాణికముగా మధ్యస్థ సూచికగా పేర్కొన్నారు. మన సంప్రదాయానుసారముగా ఘడియ – విఘడియలలో కూడా సమయమును సూచించుచూ ఇండియన్ ఎఫిమెరీస్ వైదిక సంప్రదాయ ఔన్నత్యమును మరల సాధించినది.

మద్రాసుకు చెందిన కృష్ణమూర్తిగారు 1969 దశకంలో "సబ్‌లార్డ్" పద్ధతి కనుగొని, కె.పి.పద్దతి అను పేర ఫలిత జ్యోతిషంలో నూతన పంథా ఆవిష్కరించారు. దేశ విదేశాలలో వీరి కె.పి. పద్ధతి ఎంతో ప్రాచుర్యం పొందింది.

నా గత రచనలవలెనే దీనినీ ఆదరించి అందరూ "జ్ఞానలబ్ధి" పొందాలని ఆశిస్తున్నాను.

21.5.2006 భవదీయుడు
కాకినాడ – 2 **మేడవరపు సంపత్‌కుమార్**

# విషయ సూచిక


| | | |
|---|---|---|
| 1. | జ్యోతిష శాస్త్ర ఆవిర్భావం | 3 |
| 2. | నక్షత్రములు - రాశులు | 11 |
| 3. | పాప గ్రహములు | 13 |
| 4. | గ్రహములకు ఉచ్చ-నీచములు | 15 |
| 5. | షడ్వర్గసాధన | 16 |
| 6. | జాతక చిహ్నములు | 17 |
| 7. | అరిష్టాధ్యాయము | 18 |
| 8. | పిత్రాద్యరిష్టము | 20 |
| 9. | అరిష్ట భంగములు | 21 |
| 10. | భావములు - కారకులు | 22 |
| 11. | గ్రహ కారకత్వములు | 25 |
| 12. | కేంద్ర - కోణ స్థానములు | 28 |
| 13. | యోగములు | 30 |
| 14. | అష్టోత్తరీ దశా విధానము | 34 |
| 15. | నక్షత్ర ఫలములు | 35 |
| 16. | రాశి ఫలితములు | 43 |
| 17. | సూర్యుడు 12 భావములలో నున్న ఫలితములు | 52 |
| 18. | చంద్రుడు 12 భావములలో నున్న ఫలితములు | 58 |
| 19. | కుజుడు 12 భావములలో నున్న ఫలితములు | 62 |
| 20. | బుధుడు 12 భావములలో నున్న ఫలితములు | 67 |
| 21. | గురుడు 12 భావములలో నున్న ఫలితములు | 72 |
| 22. | శుక్రుడు 12 భావములలో నున్న ఫలితములు | 77 |
| 23. | శని 12 భావములలో నున్న ఫలితములు | 81 |
| 24. | తనుభావం | 85 |
| 25. | ధన భావం | 86 |
| 26. | భ్రాతృభావం | 88 |
| 27. | మాతృభావం | 89 |
| 28. | పుత్ర భావం | 91 |
| 29. | విశేషములు | 92 |
| 30. | శత్రుభావం | 100 |
| 31. | కళత్రభావం | 102 |
| 32. | ఆయుర్భావం | 103 |
| 33. | రాజీవ్‌గాంధి, ఉదాహరణ జాతకం | 108 |
| 34. | పితృభావం | 111 |
| 35. | దశమభావం | 112 |
| 36. | లాభ భావం | 150 |
| 37. | వ్యయభావం | 150 |
| 38. | వర్గోత్తమాంశ | 151 |
| 39. | జ్యోతిషశాస్త్రము తప్పుటకు 5 కారణములు | 152 |
| 40. | దరిద్రయోగములు | 152 |
| 41. | షడ్జన్మ నక్షత్రములు | 153 |
| 42. | అనుభవ జ్యోతిష - నాడీ సూత్రములు | 155 |
| 43. | అష్టకవర్గు | 166 |
| 44. | త్రికోణ శోధన | 173 |
| 45. | ఏకాధిపత్య శోధన | 176 |
| 46. | స్త్రీ జాతకం | 177 |
| 47. | షోడశవర్గు | 178 |
| 48. | నారద సంహిత | 189-214 |

శ్రీరస్తు

# శ్రీ జ్యోతిష విద్యానిధి

శ్లో॥ అంతరాయ తిమిరోపశాంతయే
శాంతపావన మచింత్య వైభవం।
తన్నరం వపుషి కుంజరం ముఖే
మన్మహే కిమపి తుందిలం మహః॥

## నవగ్రహ స్తుతి

శ్లో ॥ ఆదిత్యాయచ సోమాయ మంగళాయ బుధాయచ
గురుశుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవే నమః॥

## సూర్య స్తుతి

శ్లో॥ బ్రహ్మాండ సంపుట కళేవర మధ్యవర్తి
చైతన్య పిండమివ మండలమస్తియస్య।
ఆలోకితోపి దురితాని నిహంతి యస్తం
మార్తాండమాది పురుషం ప్రణమామి నిత్యం॥

శ్లో॥ వేదాహియజ్ఞార్థ మభిప్రవృత్తాః
కాలానుపూర్వ్యా విహితాశ్చ యజ్ఞాః।
తస్మాదిదం కాలవిధాన శాస్త్రం
యో జ్యోతిషం వేద సవేద యజ్ఞాన్ ॥

-వేదాంగ జ్యోతిషం

**తా॥** వేదములు యజ్ఞము కొరకు చెప్పబడినవి. యజ్ఞములు కాలము ననుసరించి ఆయా ఋతువులందు, తిథులయందు చేయవలయును. అందుకే ఈ జ్యోతిష శాస్త్రము కాలమును గూర్చి తెలియజేయును.

శ్లో॥ ప్రణమ్యశిరసాకాల మభివాద్య సరస్వతీం।
కాలజ్ఞానం ప్రవక్ష్యామి లగధస్య మహాత్మనః॥

-ఋగ్వేద జ్యోతిషం ।వశ్లోకం

**తా॥** కాలమునకు, సరస్వతికి నమస్కరించి లగధ మహర్షి రచించిన కాల జ్ఞానమును చెప్పుచున్నాను.

వేదాంగ జ్యోతిషములు ఋగ్యజుస్సామా వేదములకు కలవు. ఋగ్జ్యోతిష గ్రంథములో 7 ఖండములు 36 శ్లోకములు ఎన్నాయి. యజుర్వేద జ్యోతిషంలో 39 శ్లోకాలున్నాయి. అధర్వ జ్యోతిషంలో 162 శ్లోకాలున్నాయి. అధర్వ జ్యోతిషములో 'చంద్రబలం' విశిష్టత ఇట్లు చెప్పబడినది.

**శ్లో॥ తిధిరేక గుణః ప్రోక్తా నక్షత్రంచ చతుర్గుణం**
**వారాశ్చాష్టగుణాప్రోక్తా కరణం షోడశాన్వితం॥**
**ద్వాత్రిశతి స్తధాయోగః తారాషష్టి సమన్వితా**
**చంద్రః శతగుణః ప్రోకాః తస్మాచ్చంద్రబలాబలమ్॥**

**తా॥** తిధి బలము 1 గుణము, నక్షత్రము 4 గుణములు వారము 8 గుణములు, కరణము 16 గుణములు, యోగము 32 గుణములు, తారాబలము 60 గుణములు బలము అయితే చంద్రబలము 100 గుణముల బలము కలది. అన్ని విషయము లందును 'చంద్రబలము' ముఖ్యముగా గమనించవలయును.

ఈ జ్యోతిష శాస్త్రము సిద్ధాంత – జాతక – ముహూర్త భాగములతో స్కంధ త్రయముగా నున్నది.

"చతుర్లక్షంతు జ్యోతిషం" అని ప్రాచీనులు చెప్పారు అనగా జ్యోతిష శాస్త్రము నాలుగు లక్షల శ్లోకములలో విస్తరించియున్నది.

ఆరు వేదాంగములలో జ్యోతిష శాస్త్రము నేత్ర స్థానమగుచున్నది. సకల ఇంద్రియములలో నేత్రములు ఎంత ప్రధానమైనవో, జ్ఞాన లబ్ధికి జ్యోతిష శాస్త్రము అంత ప్రధానమైనది. ఇది మానవాళికి అత్యంతోపకారకమగుచున్నది. ప్రత్యక్ష నిదర్శనమై సమస్యగవ గాహనచేత బ్రహ్మజ్ఞానప్రాప్తికి హేతువగుచున్నది. సాధారణమానవులకు శుభా శుభజ్ఞానము కలుగజేయుచున్నది.

# నక్షత్రములు - రాశులు

| | | | | |
|---|---|---|---|---|
| అశ్విని 4 | భరణి 4 | కృత్తిక 1 పాదము | - | మేషరాశి |
| కృత్తిక 3 | రోహిణి 4 | మృగశిర 2 పాదములు | - | వృషభరాశి |
| మృగశిర 2 | ఆర్ద్ర 4 | పునర్వసు 3పాదములు | - | మిధునరాశి |
| పునర్వసు 1 | పుష్యమి 4 | ఆశ్లేష 4 | - | కర్కాటరాశి |
| మఖ 4 | పుబ్బ 4 | ఉత్తర 1 పాదములు | - | సింహరాశి |
| ఉత్తర 3 | హస్త 4 | చిత్త 2 పాదములు | - | కన్యారాశి |
| చిత్త 2 | స్వాతి 4 | విశాఖ 3 పాదములు | - | తులారాశి |
| విశాఖ 1 | అనురాధ 4 | జ్యేష్ఠ 4 పాదములు | - | వృశ్చికరాశి |
| మూల 4 | పూర్వాషాడ 4 | ఉత్తరాషాఢ 1 పాదము | - | ధనురాశి |
| ఉ।షా 3 | శ్రవణం 4 | ధనిష్ఠ 2 పాదములు | - | మకరరాశి |
| ధనిష్ఠ 2 | శతభిషం 4 | పూర్వాభాద్ర 3 పాదములు | - | కుంభరాశి |
| పూ॥భా। | ఉత్తరాభాద్ర4 | రేవతి 4 పాదములు | - | మీనరాశి |

## నక్షత్రములు - రాశులు



వీరిలో, బింబ గ్రహములు – సూర్యుడు, చంద్రుడు, తారా గ్రహములు – కుజ, బుధ, గురు, శుక్రులు, ఛాయా గ్రహములు – రాహు, కేతువులు.

రాహు – కేతువులకు ప్రత్యేకించి రాశులు లేవు. ఎన్నడూ సమసప్తకములోనే ఉందురు. అనగా పరస్పరము ఏడవ స్థానములో నుందురు. వీరిది వక్రగమనము. సదా వెనుకకు ప్రయాణం చేస్తారు.

ఈపైన పేర్కొన్న 12 రాశులలో సరాసరిగా 2 గం॥చొప్పున, పగలు – రాత్రి ఏర్పడి 24 గం॥ ఒక రోజు అగుచున్నది.

కొంచెం ఇంచుమించుగా లగ్న ప్రయాణములు ఒక ప్రాంతమునకు ఎప్పుడూ ఒకే విధముగా నుండును.

## ఉదా – రాజమండ్రికి లగ్న ప్రయాణములు

| రాశులు | గం. ని॥ | రాశులు | గం - ని |
|---|---|---|---|
| మేషం | 1.45 | తుల | 2.10 |
| వృషభం | 2.00 | వృశ్చికం | 2.14 |
| మిధునం | 2.12 | ధనుస్సు | 2.07 |
| కర్కాటకం | 2.012 | మకరం | 1.52 |
| సింహం | 2.07 | కుంభం | 1.39 |
| కన్య | 2.06 | మీనం | 1.36 |

ఈ 12 లగ్నముల యొక్క ప్రమాణము 24 గం॥ అగును. సూర్యుడు ఏ లగ్నములో నుండునో ఆ లగ్నము ప్రతీ దినము మొదటి లగ్నమగును. అందుచేతనే ఉదయ లగ్నమందురు. ఇది పంచాంగము చూచిన తెలియును.

## శుభ గ్రహములు

1. గురుడు
2. పూర్ణ చంద్రుడు
3. శుక్రుడు
4 . బుధుడు (శుభులతో కలసియుండ వలయును. పాపులతో కలసిన పాపియగును)

# పాప గ్రహములు

1. సూర్యుడు 2. కుజుడు 3. శని 4. రాహువు
5. కేతువు 6. క్షీణచంద్రుడు 7. పాపులతో కలిసిన బుధుడు

గురు–శుక్రులు బ్రాహ్మణ జాతివారు. రవి–కుజులు రాజులు, చంద్ర–బుధులు వైశ్యులు, శని–శూద్రుడు, రాహువు – చండాలుడు, కేతువు – మ్లేచ్ఛుడు (విదేశీయుడు)

రవి – కుజ – గురులు – పురుష గ్రహములు
చంద్ర – శుక్ర – రాహువులు – స్త్రీ గ్రహములు
శని – బుధ – కేతువులు – నపుంసక గ్రహములు

| | | |
|---|---|---|
| రవి – కుజులు | – | ఎరుపురంగు |
| గురుడు | – | పసుపురంగు |
| శని | – | నలుపు |
| శుక్రుడు | – | తెలుపు, నీలం |
| రాహువు | – | బూడిద రంగు |
| కేతువు | – | మిశ్రవర్ణం (3 రంగుల కలయిక) |

గురు–శుక్ర–చంద్ర–బుధులు–సత్వగుణం
రవి – కుజ – రజోగుణం
శని – రాహు – కేతువులు – తమోగుణం

**శ్లో॥ పశ్యంతి సప్తమం సర్వే శనిజీవ కుజాపునః**
**విశేషతశ్చ త్రిదశ త్రికోణ చతురస్రగాన్॥**

**తా॥** అన్ని గ్రహములు తామున్న రాశినుండి ఏడవ రాశిని చూచెదరు. శని, 3–10 స్థానములను, గురుడు 5–9 స్థానములను, కుజుడు 4–8 స్థానములను,

విశేష దృష్టితో చూచెదరు. విశేష దృష్టి అత్యంత బలవత్తరము. వక్రించిన గ్రహముయొక్క దృష్టికి ఫలితము లేదు.

## మిత్ర - శతృత్వము

ప్రతీ లగ్నమునకు, లగ్న – పంచమ – నవములు ఆ భావాధిపతులు పరస్పర మిత్రులగుదురు. ఉదా– మేషలగ్నమునకు లగ్నాధిపతి కుజుడు, పంచమాధిపతి – సూర్యుడు, నవమాధిపతి – గురుడు పరస్పర మిత్రులు

దేవతలకు గురువు బృహస్పతి, రాక్షసులకు గురువు శుక్రుడు, వీరు పరస్పరము శతృవులు జ్యోతిష శాస్త్రమునందు నవగ్రహములు 2 వర్గములుగా నున్నవి.

| గురు వర్గము | శుక్రవర్గము |
|---|---|
| సూర్యుడు | బుధుడు |
| చంద్రుడు | శని |
| కుజుడు | రాహువు |
| కేతువు | |

బుధ–చంద్రుల విషయములో వారున్న స్థానమును బట్టి, వారితో కలసిన గ్రహములను బట్టి శతృత్వము మారును. చంద్రుడు పూర్ణత్వ – క్షీణత్వములను బట్టి పాపత్వము పొందును.

## తాత్కాలిక మిత్ర - శతృవులు

ప్రతీ గ్రహము తానున్న రాశిలగాయితు 2–3–4–10–11–12 స్థానము లందున్న గ్రహములతో తాత్కాలిక మిత్రత్వమును పొందును.

1–5–6–7–8–9 స్థానములందున్న గ్రహములతో తాత్కాలిక శతృత్వమును పొందును.

# గ్రహములకు ఉచ్ఛ - నీచస్థానములు

| ఉచ్ఛ | | | | నీచ |
|---|---|---|---|---|
| సూర్యుడు | - | మేషం $10^0$ | - | తుల $10^0$ |
| చంద్రుడు | - | వృషభం $2^0$ | - | వృశ్చికం $3^0$ |
| కుజుడు | - | మకరం $28^0$ | - | కర్కాటకం $28^0$ |
| బుధుడు | - | కన్య $15^0$ | - | మీనం $15^0$ |
| గురుడు | - | కర్కాటకం $5^0$ | - | మకరం $5^0$ |
| శుక్రుడు | - | మీనం $27^0$ | - | కన్య $27^0$ |
| శని | - | తుల $20^0$ | - | మేషం $20^0$ |
| రాహువు | - | వృషభం | - | వృశ్చికం |
| కేతువు | - | వృశ్చికం | - | వృషభం |

ఒక రాశికి 30 డిగ్రీలు లేదా భాగలు ఉండును. 12 రాశులకు $360^0$ డిగ్రీలగును. దీనినే భచక్రమందురు. ఒక వృత్తమునకు $360^0$ ఉండును.

## మూల త్రికోణములు

మూల త్రికోణమనగా స్వక్షేత్ర స్థానములలో బలవత్తరమైనది.



సూర్యుడు సింహరాశియందు 20 భాగల వరకు మూల త్రికోణము, మిగిలిన పది భాగలు స్వక్షేత్రము చంద్రునకు వృషభరాశియందు 3 భాగల వరకు ఉచ్చ మిగిలిన భాగలు మూల త్రికోణము. కుజునకు మేషమందు 12 భాగల వరకు మూలత్రికోణము తక్కిన 18 భాగలు స్వక్షేత్రము. బుధునకు కన్యారాశియందు 15 భాగల వరకు ఉచ్చ మిగిలిన 5భాగల వరకు మూల త్రికోణము. చివరి 10 భాగలు స్వక్షేత్రము.

గురునకు ధనురాశియందు 10 భాగల వరకు మూలత్రికోణము. మిగిలిన 20 భాగలు స్వక్షేత్రము. శుక్రునకు తులయందు 15భాగలు మూలత్రికోణము. మిగలిన 15 భాగలు స్వక్షేత్రము. శనికి కుంభమందు 2 భాగలు మూలత్రికోణము మిగిలిన భాగలు స్వక్షేత్రము. రాహువునకు సింహరాశి మూలత్రికోణము. కేతువునకు కుంభము మూలత్రికోణము.

## షడ్వర్గ సాధన

**శ్లో॥ హోరారాశిదలం సమే ప్రధమతః చంద్రస్య భానౌ రతౌ**
**వ్యత్యాసాదసమే దృకాణ పతయః స్యాదంక భావాధిపాః।**
**మేషాదాదిమతే వృషేతు మకరాదనుగమే**
**ఘటాదిందుచే కర్క దేవ**
**నవాంశకా నిగదితాః స్యుర్ద్వాద్వాదశాంశాః ఖఖాత్ ॥**

**జీవనాధుని భావకుతూహలం**

**తా॥** రాశిలో $30^0$ లుండును. ఇందులో సగభాగము హోర అనబడును. బేసిరాశికి చంద్రరవులు సమన భాగములకు అధిపతులు. సరిరాశికి సూర్య–చంద్రులు అధిపతులు (2) రాశిలో 3 సమభాగములు ద్రేక్కాణ మనబడును. 9సమభాగములు నవాంశ అనబడును. రాశిలో 12 సమభాగములు ద్వాదశాంశ.

**శ్లో॥ పంచ పంచాష్ట హౌలాక్షాః**
**వింశాంశ విషమే క్రమాత్।**
**భౌమ భానుజ జీవేశ**
**శుక్రాణా మృత్ క్రమాత్ సమే॥**

**తా॥** రాశిలో 30 సమభాగములు త్రింశాశ అనబడును. వాటిని ఈ క్రమములో లెక్కించవలయును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| **బేసి రాశి** | కుజ | శని | గురు | బుధ | శుక్ర |
| | 5 | 5 | 8 | 7 | 5 |
| **సరి రాశి** | శుక్ర | బుధ | గురు | శని | కుజ |
| | 5 | 7 | 8 | 5 | 5 |

**శ్లో॥ చరస్థిరాది స్వభావాః క్రూరాక్రూరావజాదితః।**
**నరనారోక్రమాదేవ విషమాఖ్యసమావపి॥**

**తా॥** రాశులు మేషాదిగా చర–స్థిర–ద్విస్వభావములు మేషాదిగా క్రూర – సౌమ్యములు . పురుష – స్త్రీ స్వభావం గలవి. అనగా బేసిరాశులు క్రూరమైనవి – పురుష రాశులు అగును. సరిరాశులు సౌమ్యమైనవి – స్త్రీరాశులు అగును.

వీటి యందు జననమైన వారికి ఆయా స్వభావములు కలుగును.

**శ్లో॥ మిధునం ధన్వి విపూర్వార్థం**
**తులాకన్యా ఘటీనరాః।**
**చరుః పాదా ధనుః సింహ**
**వృషమేషా మృగాదిమః॥**

**తా॥** మిధునము, ధనుస్సులో ప్రథమార్థము, కన్య, తుల రాశులు మానవరాశులు. ధనుస్సులో ద్వితీయార్థము, మేష, వృషభ, సింహరాశులు, మకరంలో ప్రథమార్థము చతుష్పాద రాశులు.

# జాతక చిహ్నములు

**శ్లో॥ జనుషి లగ్నగతో వసుధాసుతో**
**మదనగోపి గురుః కవిరేవవా।**
**భవతితస్య శిరోవ్రణ మండితం**
**నిగదితం యవనేన మహాత్మనా ॥ – జీవనాథుడు**

**తా॥** యవనాచార్య సిద్ధాంత రీత్యా లగ్నమందు కుజుడుగాని, 7వ స్థానములో గురుడు గాని, శుక్రుడు గాని యున్నచో జాతకుని శిరస్సుపై పుచ్చుమచ్చయుండును. లేదా కురుపుగాని ఏర్పడును.

లగ్నమందు శుక్రుడుగాని, అష్టమమందు రాహువుగాని యున్నచో జాతకుని తలపై లేదా ఎడమ చెవిపై పుట్టు మచ్చయుండును.

లగ్నమందు గురుడు, సప్తమములో రాహువు లేదా పాపయుత శుక్రుడు 8లోఉన్న జాతకుని ఎడమ భుజముపై పుట్టుమచ్చయుండును.

లగ్నమందు శని గాని, చతుర్థములో శుక్రుడుగాని యున్న అరికాలియందు లేదా ఎడమపాదముపై పట్టుమచ్చయుండును.

ద్వితీయములో శని గురులున్నా, తృతీయములో రాహువు ఉన్నా జాతకుడు సోదరుల నుండి సుఖము పొందలేదు.

# అరిష్టాధ్యాయం

**శ్లో ॥ తుహిన కిరణ హోరికా చ సంధ్యా**
**భ చరమగాః ఖలఖేచరా జనేచేత్।**
**మృతిరధ రజనీశ పాపఖేటైః**
**అఖిల చతుష్టయగైర్వినాశమేతి॥**

**తా॥** బాలకునికి ముందుగా అరిష్టములు ఉన్నవా? లేవా? అని పరిశీలించ వలయును. శాంతులున్నచో వైదిక-తాంత్రిక శాస్త్ర ప్రకారము జరిపించాలి.

సంధ్యాకాలమందు లగ్నమందు చంద్రుడుండి పాపరాశి యొక్క అంత్య నవాంశను పొందినచో బాలుడు జీవించడు. పాపయుత చంద్రుడు, కేంద్రములందు పాపులు ఉన్ననూ బాలరిష్టము కలుగును.

శ్లో ॥ అశుభేషు శుభేషు చక్రపూర్వా
పరభాగేషు గతేషు కీటలగ్నే।
విరతిం సముపైతి బాలకోయం
ఖలఖే త్ైరపి కామినీ తనుస్థైః॥

**తా॥** లగ్నం నుండి సప్తమం వరకు చక్రపూర్వార్థం అనబడును. 8 నుండి 12స్థానం వరకు పరార్థం అనబడును. పూర్వార్థంలో పాపగ్రహాలు, పరార్థంలో శుభగ్రహాలు ఉండి కర్కాటక, వృశ్చిక లగ్నమందు జననమైనచో జాతకుడు జీవించడు. సరిలగ్నములు మంచివికావు.

పాపయుత చంద్రుడు 1-7-8 భావములందు ఉండి శుభదృష్టి లేక, పాపగ్రహ దృష్టి వున్నచో బాలుడు జీవించడు.

స్థిర లగ్నంలో 2 పాపగ్రహాలు, చంద్రుడు శుభహీనుడైనచో బాలారిష్టము.

స్థిర రాశులలో పాపులు, కేంద్రములో శుభులూ లేనిచో బాలారిష్టం.

చంద్రుడు 6-8లో పాపగ్రహములతో కలసియున్నచో వెంటనే మృత్యువు కలుగును. శుభగ్రహములతో కలసిన 8 సం॥రాలు జీవించును. శుభ-పాప గ్రహద్వయముతో కలిసిన 6సం॥రాలు జీవించును.

క్షీణచంద్రుడు లగ్నమందు, 8లోనూ, మరియు కేంద్రములలో పాప గ్రహములున్న వెంటనే మరణించును. చంద్రుడు పాపగ్రహముల మధ్య నుండి, 7, 8లో పాపగ్రహములున్నచో శిశువు మాతాసహితముగా మరణించును.

లగ్నచంద్రునిపై, సప్తమంలోని పాపగ్రహ దృష్టి ఉన్న బాలారిష్టము కలుగును.

గ్రహణ సమయమున, లేదా చంద్ర రాహువులు కలసి పాపులతో కలసినపుడు అది లగ్నమై 8లో కుజుడున్న మాతాశిశువులిద్దరూ మరణింతురు. ఈ యోగములో

సూర్యుడు కూడా లగ్నమందున్నచో శస్త్రమువల్ల అనగా ఆపరేషను వలన గాని మృతి కలుగును.

చంద్రుడు పాపగ్రహయుక్తుడై 1-5-9-7-8-12 స్థానములందుండి, శుభగ్రహ దృష్టి లేనిచో మరణము కలుగును.

## పిత్రాద్యరిష్టం

**శ్లో ॥ ఆదిత్యాద్దశమే పాపః పీడితో దశమాధిపః।**
**తదాపితుర్మహాకష్టం నిధనంవేతి కీర్తనమ్॥**

**తా॥** సూర్యునికి 10లో పాపగ్రహముండి, దశమాధిపతి పాపయుతి పొందినచో తండ్రికి అరిష్టము కలుగును.

చంద్రుడు పాపగ్రహముల మధ్య ఉండి, చంద్రునికి 4-7లో పాపులున్నచో తల్లికి అరిష్టము కలుగును.

కుజుడున్న రాశికి 3లో పాపగ్రహములున్నచో జాతకుని సోదరులకు అరిష్టం. ఇది ప్రాచీన జ్యోతిష శాస్త్రవేత్త అయిన "మణిత్థు"ని సిద్ధాంతము.

బుధునికి 6వస్థానములో పాపులుండి, బుధునికి పాపగ్రహ సంబంధములున్న జాతకుని మేనమామకు అరిష్టం.

గురునికి 5లో సూర్య – కుజ – శని – రాహువులుండి, ఆస్థానాధిపతికి పాప గ్రహ సంబంధమున్నచో అట్టి జాతకునకు సంతానము కలుగును.

శుక్రునికి 7లో కుజుడు పాపగ్రహయుతుడైన భార్యావియోగం కలుగును. శనికి 8లో బలమైన పాపగ్రహములున్నచో అల్పాయువు కలుగును.

# అరిష్టభంగములు

–చంద్రుడు బలవంతుడైననూ, 11లో సూర్యుడున్ననూ, గురు–శుక్రుల దృష్టియున్ననూ, చంద్రునికి 8లో శుభగ్రహములున్ననూ, లగ్నాధిపతి బలవంతుడై శోభయుతుడైననూ అరిష్టములను పోగొట్టును.

గురుడు అంశలో ఉచ్ఛస్థితి పొందిననూ రాహువు 3–6–11లో ఉండి శుభగ్రహ దృష్టి పొందినా పురుష గ్రహములు సూర్య– కుజ– గురువులు బేసిరాశిలో యున్ననూ అరిష్టములు భంగమగును. ఆయుర్దాయము కలుగును.

## దశలు

మానవుని ఆయు: ప్రయాణము 120 సం॥లు ఈ క్రింది నక్షత్రములలో జన్మించిన వారికి, ఆ దశ ప్రారంభదశ అగును. ఆ నక్షత్ర శేష ప్రమాణమును బట్టి ప్రారంభదశా శేషముండును. ఇది భాగలలో అనగా డిగ్రీలలో సులభముగా గణింపవచ్చును. అనంతరము దశలు వరుసగా జరుగును.

| | | | | |
|---|---|---|---|---|
| కృత్తిక | ఉత్తర | ఉ॥షా | రవిదశ | 6సం॥ |
| రోహిణి | హస్త | శ్రవణం | చంద్రదశ | 10సం॥ |
| మృగశిర | చిత్త | ధనిష్ట | కుజదశ | 7సం॥ |
| ఆర్ద్ర | స్వాతి | శతభిషం | రాహుదశ | 18సం॥ |
| పునర్వసు | విశాఖ | పూ॥భాద్ర | గురుదశ | 16 సం॥ |
| పుష్యమి | అనురాధ | ఉ॥భాద్ర | శనిదశ | 19 సం॥ |
| ఆశ్లేష | జ్యేష్ట | రేవతి | బుధదశ | 17సం॥ |
| మఖ | మూల | అశ్విని | కేతుదశ | 7సం॥ |
| పుబ్బ | పూ॥షాఢ | భరణి | శుక్రదశ | 20సం॥ |

# 12 భావములు - కారకులు

| | | | |
|---|---|---|---|
| (1) | లగ్నము | – | శరీరం, మనస్సు |
| | తనుభావం | – | సూర్యుడు |
| (2) | ధనభావం | – | గురుడు |
| (3) | సోదరభావం | – | కుజుడు |
| (4) | మాతృభావం | – | చంద్రుడు |
| (5) | సంతానభావం | – | గురుడు |
| (6) | శతృభావం | – | కుజుడు |
| (7) | కళత్రభావం | – | శుక్రుడు |
| (8) | ఆయుర్భావం | – | శని |
| (9) | పితృభావం | – | సూర్యుడు |
| (10) | వృత్తిభావం | – | శని |
| (11) | లాభం (లౌక్యం) | – | శని, రాహువు |
| (12) | వ్యయం (మోక్షం) | – | కేతువు |

1. **తనుభావము :-** దీనినే లగ్నభావమందురు. ఈ లగ్నము వలన శరీర ఆకృతి, మనో స్వభావము –సుఖము–కష్టము –ముసలితనము – జ్ఞానము – జన్మభూమి – కీర్తి – స్వప్నము –బలము–ఉత్తర కాలఫలము – రాజనీతి – ఆయుర్దాయము – శాంతి – కేశములు –జూదము – పౌరుషం – చర్మము – నిద్ర, దొంగతనము –తిరస్కార స్వభావము–ఆరోగ్యము–వైరాగ్యము, స్వభావం – జీవకార్యములందు ప్రవర్తించుట–అప్రతిష్ఠ–అపవాదు–ఈ గుణములు లగ్నము నుండి తెలియును.

2. **ధనభావము :-** వాక్కు–ధనము – స్నేహము – భోజనము రుచులు – నాలుక సత్యనిష్ఠ – కుడికన్ను – వస్త్రము –రాగి–మణులు – ముత్యములు – కోపము – వంచన – కుటుంబ సంబంధ వ్యాపారము – క్రయవిక్రయములు – సరస సంభాషణ చతురత – దానగుణము – ప్రయత్నము – ఉపకార బుద్ధి – వెండి – ధాన్యము – వినయము – మనోధైర్యం – రాక పోకలు – పశుసంపద – మొదలగు విషయములు ద్వితీయ భావము వలన తెలియును.

3. **తృతీయ భావము :-** సోదర సోదరీలు (చిన్నవారు) ధైర్యము – ఉదారబుద్ధి – యుద్ధము – చెవులు – పాదములు – మార్గము – భూమి – చిత్తభ్రమ – సమర్ధత – దేవాలయం – సేవకులు – బంధువులు – చలనము – కంఠము – చెడు పదార్థములు తినుట – పంపకము – అలంకారములు – సుగుణములు – వినోదము – బలము – లాభము – శరీరము దృఢముగా నుండుట – గొప్ప వంశము నందు పుట్టుట – తండ్రియుందు ప్రదేశము – స్వల్ప వాహనము – తీర్ధయాత్ర – ధర్మనిష్ఠ మొదలగు విషయములు తెలుసుకొనవచ్చును.

4. **చతుర్ధభావము :-** తల్లి – మంచి వాహనము – స్థిర నివాసము – భవంతులు – శరీర సౌఖ్యము – తలంటు పోసుకొనుట – పాలు – కీర్తి – అసత్యము – చెమట పట్టుట – సంపాదన – తోటలు – బోరింగులు – దేవతా ప్రతిష్ఠ – ధనమును భూమియందు దాచుట – స్థాన భ్రష్టత – తండ్రి – ధనము – సురాపానము – మనస్సంతోషము – పాము పుట్ట – పశుసంపద – గుర్రము – ఏనుగు – పైరు పంటలు మొ॥ తెలుసుకొనవచ్చును.

5. **పంచమ భావము :-** సంతానము – బుద్ధి – మంత్రోపాసన – తెలివి – మంచి స్వభావము – శుభలేఖలు –అనేక కోరికలు – చక్కగా ఆలోచించుట – భార్య వలన భాగ్యము కలుగుట –వేశ్యాస్త్రీ సంభోగం – ఉత్తరములు – సౌందర్యముగా వ్రాయుట – గ్రంధ రచన – దేవతానుగ్రహము – మృదంగ వాద్యము – మంత్రి పదవులు – సభా నిర్వహణ మొ॥ తెలుసుకొనవచ్చును.

6. **షష్ఠ భావము :-** ఋణములు – రోగములు – శత్రువులు – మేనమామ – యుద్ధము – శ్లేష్మము – కురుపులు – మనోవ్యాధి – మసూచి వంటి భయంకర రోగములు – మోసము – వ్యసనములు – కళ్ళ రోగములు – ముష్టి ఎత్తుట – కారాగృహవాసము – అన్నదమ్ములతో తగాదాలు – మొదలగు విషయములు తెలుసుకొనవచ్చును.

7. **సప్తమ భావము :-** వివాహము – భార్యా వియోగము – జ్ఞాపక శక్తి తగ్గుట – పప్పునేయి కలసిన మృష్టాన్న భోజనము – దొంగతనము – భాగస్వామ్యము – మారకము ప్రతిపక్షము – మొ॥ విషయములు తెలుసుకొనవచ్చును.

8. **అష్టమ భావము :-** ఆయుర్దాయము – సౌఖ్యము – వారసత్వరీత్యా వచ్చు ధనము – ఇన్సూరెన్సు – మరణము –కలహము – సోదర విరోధం – భార్యా రోగము –శతృపీడ –శిక్షలు–భయం –క్షయరోగము–ఎయిడ్స్– పాపమార్గములో ధనము సంపాదించుట –శస్త్ర చికిత్స–అవయవములు తొలగించుట – అధిక దు:ఖము – అభిచారములు చేయుట – భయంకరమైన కధారచనలు చేయుట – మొ॥ విషయములు తెలుసుకొనవచ్చును.

9. **నవమభావము :-** పూర్వపుణ్యము – తండ్రి – దూరప్రయాణము – పోస్టు గ్రాడ్యుయేషన్ – భక్తి – చికిత్స – మనశ్శుద్ధి – వైభవం–నీతి–అభిషేకము – సజ్జన సాంగత్యము – తండ్రిరీత్యా ధనము లభించుట–అష్టైశ్వర్యములు– గుర్రము – పదవీయోగము – ఉద్యోగము పోవుట – దేవతా ప్రతిష్ఠలు–యాగములు చేయుట – ధనము దాచుట మొ॥ విషయములు తెలుసుకొనవచ్చును.

10. **దశమ భావము :-** సన్మానము – ఉద్యోగము – జీవనము కీర్తి – మల్లయుద్ధము – మంత్రిపదవులు–దేవతలను దర్శించుట – ముద్రాధికారము – ఆజ్ఞాపించుట – మొ॥ విషయములు తెలుసుకొనవచ్చును.

11. **లాభ భావము :-** అన్ని కోరికు నెరవేరుట, లాభము – దేవతారాధన – సత్త్వగుణం – బంగారము – ధనము సంపాదించుట – సర్వకార్యసిద్ధి – తాత ముత్తాతల ధనము – మోకాలు – ప్రభుత్వ ధనము – మామగారి వల్ల లాభము – పిక్కలు – కళలయందు నేర్పు మొ॥ విషయములు తెలుసుకొనవచ్చును.

12. **ద్వాదశ భావము :-** నష్టము–మరణము–శిరోభారము–వాతరోగము–యతి పదవి –అన్ని విధముల అవమానము–ఆలస్యము–త్రిప్పుట–అలసట –స్థానచలనము – మరణానంతర జీతాత్మ స్థితి–ఆశాభంగము–కుటుంబ చింత–ఉద్యోగము పోవుట–కారాగారము–భార్యాహాని–డబ్బు ఖర్చు – మోక్షము మొ॥ విషయములు తెలుసుకొనవచ్చును.

# గ్రహకారకత్వములు

1. **సూర్యుడు :-** ఆత్మ – కోట – బలము – జ్వరము – అగ్ని – శైవోపాసన – ప్రభుత్వోద్యోగము – తండ్రి – రుచి–జ్ఞానోదయం –ఎముక – గడ్డి – కడుపులో జీర్ణశక్తి – ఉత్సాహము – కొండలందు తిరుగుట – వ్యవహారము – పైత్యము – గుండ్రని వస్తువులు – నేత్ర రోగము – మనశ్శుద్ధి – ఉన్నత పదవి – ఆరోగ్యం – గుజరాత్ ప్రాంతము – అలంకారములు – కెంపు – పొట్టితనము – తూర్పుదిశ – రాగి – రక్తము –శిల–పాషాణములు – ప్రవర్తన – నదీతీరం – మధ్యాహ్నమందు బలము – రక్త చందనం – ఆకాశము వంక చూచుట – భయము – అడవికి వెళ్ళుట – లావుగా ఉన్న తాళ్లు – దారములు – మొ॥ వాటిపై ఆధిపత్యము కలిగియుండును.

2. **చంద్రుడు :-** మనస్సు – తల్లి – పువ్వులు – సుగంధము – బ్రాహ్మణులు – ఆలస్యము – మరచిపోవుట – మూర్ఛ – జలగండము – పులుపు – ద్రవ పదార్థములు – పాలు – వెండి –ముత్యము – గుండె – చెరకు–మొలతాడు – కంచు – శరత్ ఋతువు – మనోవేగము–రాత్రి బలము–మనిషి – పడమర దిక్కునం దిష్టము – నడివయస్సు – చలిజ్వరం – తెలుపురంగు – స్త్రీ దేవతారాధన – లలితా – గౌరీభక్తి –హాస్యచతురత –బాహుపీడ – రాజలాంఛనములు – గొడుగు – వింజామరలు – మంచి ముఖము – చేపలు – జలచరములు – పాములు – పట్టుబట్టలు – మెత్తని వస్త్రములు మొ॥ వాటిని ఆధిపత్యము వహించి తన శుభత్వ యోగరీత్యా శుభములు కలుగుజేయును.

3. **కుజుడు :-** సోదర సోదరీలు – పరాక్రమము – న్యాయవాది – శస్త్ర చికిత్స కుడు – భూములు – గృహ నిర్మాణములు – విడి భాగములు – కాంట్రాక్టులు – చిట్‌ఫండ్ – బ్యాంకు ఋణములు – కోర్టు గొడవలు – యంత్రములు – ధనుర్విద్య – క్రీడలు – ఔదార్యము – శతృవులు – మఠాధిపత్యం – మూర్ఖత్వము – పట్టుదల – కోపము – పిసినారితనము – కురుపులు – రక్తస్రావము –

సీసము – కత్తి – కంసాలి – సుబ్రహ్మణ్యస్వామి – యువకుడు – దక్షిణదిశ – చేదు – మాంసాహారం – ఇతరులను తిట్టడం – శతృజయం – రాత్రి చివరి యందు బలం – హేమంత గ్రీష్మ ఋతువులు – గాంభీర్యం – పురుషుడు – శీలం – బ్రహ్మ –అరణ్య సంచారం – గ్రామాధిపత్యం – రెవిన్యూ శాఖ – విచిత్ర వస్త్రములు – ప్రభుత్వోద్యోగం – ఇంజనీర్ – కంప్యూటర్ విజ్ఞానము – విచిత్ర వస్త్రములు –కామ క్రోధములు–ఇల్లు –సేనాధిపత్యం – ఆయుధములు – స్వతంత్రత – చిత్త విభ్రమం – మూత్ర కృచ్ఛరోగములు – మొదలగు కుజుని కారకములుగా గ్రహించవలయును.

4. **బుధుడు :-** విద్య – నిఘంటువు – కోశాగారము – గణితజ్ఞానము – వాక్కు – చిత్రకారుడు – హాస్యచతురత – మేనమామ – వ్యాపారం – దేవాలయం – జ్యోతిషం – తీర్థయాత్ర – వక్తృత్వం – సౌమ్యమైన మాటలు – వేదాంతము – తల్లితండ్రి – పీడకలలు – ఉత్తర ముఖం – చర్మరోగములు – భవనం – వైద్యం – కంఠం – అభిచార కర్మ – వెనుక చూపు – గతం గూర్చి ఎక్కువుగా ఆలోచించడం – వినయం – భక్తి – హేమంతం – గోత్రశుద్ధి – విష్ణూపాసన – శూద్రజాతి – పక్షులు – అధర్వణ వేదం – తోటలు – రత్న పరీక్ష – మంత్ర తంత్ర యంత్ర జ్ఞానము – వాయవ్యం – ప్రాత:కాలమందు బలము – భవన నిర్మాణ కుశలత – ఆకుపచ్చరంగు – మరకత మణి – కషాయరంగు – మొదలగునవి బుధుని కారకత్వముగా గ్రహించవలయును.

5. **గురుడు :-** బ్రాహ్మణుల శివోపాసన – గురువు – మీమాంసా శాస్త్రము – పెద్ద శరీరము – కీర్తి – తర్కం జ్యోతిషం – పుత్రులు – పౌత్రులు – పచ్చకామెర్ల వ్యాధి తండ్రి తండ్రి – దానం – తపస్సు – యజ్ఞయాగాది కర్మలు ఉత్తరదిశ – పుష్యరాగం – మేధస్సు – వాక్చాతుర్యం – వేదాంతం – అన్న – రాజసన్మానం – ఉన్నత పదవులు – ప్రొఫెసర్లు – ఫిజీషియన్లు – న్యాయమూర్తులు – వృద్ధాప్యము – మంత్రోపాసన –మోకాలు – ప్రజ్ఞ – పసుపురంగు – పదవులు – తీపి పదార్థములు – ఇతరుల మనసు తెలుసుకొను జ్ఞానము (పరేంగితం)

– బంగారం – నియమనిష్టలు – వేదములు – ఋగ్వేదం తంత్రములు – పల్లకీ ఎక్కుట ఉన్నత వాహనయోగములు – మెత్తని పరుపులు – మొ॥ గురుగ్రహము యొక్క అధీనములో నుండును.

6. **శుక్రుడు :-** స్త్రీలు – భార్య – స్త్రీ దేవతోపాసన–రాబడి – బ్రాహ్మణులు – తెల్లటి భార్య – శరీర సౌఖ్యం – నేత్రములు –సంగీతము – నృత్యము – వాద్యము – గీతము – సంభోగం – సుగంధం –సుమనస్సు – సంతోషం – సంపత్ – సమృద్ధి – సౌందర్యం – సౌకుమార్యం –సౌమ్యం – సత్యనిష్ఠ – పులుపు – కీర్తి – యౌవనం – ప్రయాణం – గర్వం –వజ్రం – యజుర్వేదం – క్రయా విక్రయములు – ద్రవపదార్థములు – మద్యము – మాతంగం – మధ్యవయస్సు – మదన ప్రాధాన్యత – మృదురతి – కవిత్వం – కళానైపుణ్యం – అందమైన నడక – ఉంగరాల జుట్టు – గురదాలు (కిడ్నీలు) – తూర్పువైపు ముఖం – రేతస్సు –జలకేళి – పెట్రోలు – రిఫైన్డ్ నూనెలు – భరతశాస్త్రం – తెలుపు వస్త్రములందు ఇష్టము – ప్రభుత్వ పదవులు –లలితోపాసన – మూత్ర కోశము – మధ్యాహ్నము – గుహ్యాంగములు – రహస్యం మొ॥ శుక్ర గ్రహము యొక్క అధీనములో నుండును.

7. **శని :-** ఆయుర్దాయము – జీవనము – వికార శరీరము – చివరి కులమువారు – అనాచారము – పక్షులు – గాడిద – నలుపు – ఇంద్రనీలమణి – పౌరుషం లేకపోవుట – సాయంకాలబలము – అబద్ధములు చెప్పుట – పరపురుషునికి పుట్టినవాడు –దుష్టులతో సహవాసము – ఇతర కుల విద్యలు నేర్చుట– క్రిందికి చూచుట – కుంటితనము –యుద్ధము– రాళ్ళు – ముళ్ళు – విషకీటకములుండు ప్రదేశములందు సంచరించుట – కిరాతులు – మృత్యువును గూర్చి ఎల్లప్పుడూ ఆలోచించుట – మృత్యుదేవతోపాసన – నక్కలు – వేళ్ళు – కఠినమైన మనస్సు – పెద్దప్రేగులు – దెబ్బలాటలు – ఆలస్యము – 3 విధములైన అగ్నులు (ఆహవనీయ – గార్హపత్య – దక్షిణాగ్నులు) మొ॥నవి శని గ్రహ కారకత్వములగుచున్నవి.

8. **రాహువు :-** లౌక్యము – ఇహలోక సుఖములు – మోసము చేయుట – మోసగింపబడుట – విదేశీయానము – నీచస్త్రీ సంగమము – కలహము – జూదము – గుల్మరోగము – అబద్ధము – కేన్సరు – నైరుతి దిక్కు నందు ఇష్టము – శ్లేష్మబాధ – పెద్ద పెద్ద సర్పములు – దూర ప్రయాణములు – తల్లి – తాత – ఊపిరితిత్తుల వ్యాధి – వనదుర్గోపాసన – దుర్జన స్నేహము – అరబ్బీ ఉర్దూభాషా లేఖనం – గోమేధికము – రోగనిర్ధారణ సరిగా జరుగకపోవుట – రోగము ఒకటి మందొకటి అగుట – పశురతి (సోడోమి) – ఇంద్ర జాలము –రాత్రిభాగము –పాపస్త్రీ–సర్వవిద్య –ఎడమచేయి వాటము–ఛత్ర చామరములు – కొండలు గుట్టలు తిరుగుట – మొ॥ రాహు ఆధిపత్యములో నుండును.

9. **కేతువు :-** తంత్ర విద్యలు – వినాయక చండీ ఉపాసనలు – ఈశ్వరభక్తి – వైద్యము – గ్రద్ధ – సకలైశ్వర్యములు – షేర్లు –లాటరీలు – గుర్రపు పందెములు – సినిమా రంగములో సాంకేతిక శాఖలు –భూతవైద్యం – క్షయ – గంగా స్నానము – మహాతపస్సు – కోయ వాళ్ళతో స్నేహం – మంత్రశాస్త్రము – వేదాంత జ్ఞానము – ముళ్ళు – పక్షులు – మౌనవ్రతం – శతృబాధ – ఉదర కోశ వ్యాధులు – స్వల్పాహారము – తండ్రి తండ్రి – ఆకలి స్ఫోటకాది వ్యాధులు – కృతజ్ఞత – శూద్రగోష్ఠి – జెండా – కోడి – సుబ్రహ్మణ్యారాధన – మోక్షము కేతువు వలన కలుగును.

# కేంద్ర కోణ స్థానములు

జన్మలగ్నము నుంచి 1–4–7–10 స్థానములు కేంద్రములు అనబడును.

## త్రికోణములు

జన్మలగ్నము నుంచి 1–5–9 కోణ స్థానములనబడును

## శుభ స్థానములు

లగ్నము నుంచి 1-2-4-5-7-9-10-11 స్థానములు మంచివి

## పాప స్థానములు

లగ్నము నుంచి 3-6-8-12 స్థానములు  చెడు కలిగించును.

## పాపస్థానములు

లగ్నము నుంచి 2-7 మారకస్థానములు. వీటిలో 2వ స్థానము ప్రబల మారకము.

## నైసర్గిక శుభులు

అనగా సహజముగా శుభులు, గురు-శుక్ర-పూర్ణ చంద్రులు. మిగిలిన వారు నైసర్గిక పాపులు

## ఆధిపత్య శుభులు

లగ్నమునుండి 1-5-9 స్థానములకు అధిపతులు ఎవరైననూ ఆ లగ్నమునకు శుభఫలితమునే ఇస్తారు. నైసర్గిక పాపులు అనగా రవి-కుజ-శని-రాహు-కేతువులు, క్షీణచంద్రుడు, కేంద్రాధిపతులైనచో అనగా 1-4-7-10 స్థానములకు అధిపతులైనచో ఆధిపత్య శుభులగుదురు.

వృశ్చికలగ్నమునకు శని 3-4 స్థానములకు ఆధిపత్య శుభడగుచున్నాడు. 4 కేంద్ర స్థానము గావున ఇది సంభవించినది.

## ఆధిపత్య పాపులు

నైసర్గిక శుభులైన గు-శుక్ర-పూర్ణచంద్రులు 1-4-7-10 స్థానములకు, అధిపతులైనచో, వీరు ఆధిపత్య పాపులగుదురు.

మిధునలగ్నమునకు 7-10 కేంద్ర స్థానముల ఆధిపత్యం పొందిన నైసర్గిక శుభుడైన గురుడు, ఆధిపత్యపాపి అగుచున్నాడు. దీనినే కేంద్రాధిపత్య దోషము అందురు. ఇది గురు-శుక్రులకు ఎక్కువగా నుండును. కేంద్రాధిపత్య దోషం పట్టిన గురు-శుక్రులు, సప్తమ స్థానములో నున్న మారకము చేయుదురు. అది స్వక్షేత్రమైనచో విశేష బాధ కలుగును.

# యోగములు

యోగములు అనేకములున్నవి. వీటిలో అతి ముఖ్యమైనవి. అనుభవమునందు సరిపోవునని సుమారు 20-30 ఉండును. వీరిలో మరల శుభఫలితముల నిచ్చునవి, సులభముగా తెలియదగినవి, ప్రాచుర్యములో ఉన్నవి, ముఖ్యమైనవి 5 కలవు.

## 1. గజకేసరి యోగము

గురు చంద్రులు కలసి ఒకేరాశిలోనున్ననూ, పరస్పరము 1-4-7-10 స్థానములందున్ననూ జాతకునకు గజకేసరి యోగము ఏర్పడును. గజ-కేసరులనగా ఏనుగు-సింహము అని అర్థం గజరాజ-మృగరాజులేకమైనచో ఆధిపత్య సౌఖ్యములకు లోటు ఉండదు. అంత విశిష్టయోగమని చెప్పుటయే దీని అంతరార్థము.

ఈ యోగము వలన ధనము - కీర్తి కలుగును. గురు-చంద్రులిరువురూ ఒకే డిగ్రీలో ఒకేరాశియందున్నచో, జాతకుడు ఎటువంటి పరిస్థితులలో జన్మించిననూ తప్పక కోటీశ్వరుడగును. ఇది నిశ్చయం, అనుభవ సిద్ధం. మరణానంతరం కూడా ఆ జాతకుని కీర్తిచంద్రికలు వెలుగుతూనే ఉంటాయి.

**ఉదా: N.T.R. జననం - 1923.5.28**
**సా॥ 4.43 ని॥ 81.12 ఇ,**
**16.15 ఎన్**




**మరొక ఉదాహరణ - ఒక సామాన్య వ్యక్తి**




ఈ జాతకము నందు కూడా గురు చంద్రు లిరువురూ ఒకే రాశిలో ఒకే డిగ్రీయందున్నారు. ఆ రాశ్యాధిపతి అయిన శనితో కలసి సప్తమ కేంద్రంలో శని స్వక్షేత్రంలో ఉన్నారు. ఈ జాతకుడు సామాన్య రైతుకుటుంబము జన్మించి, చదువు అంతగా లేకపోయిననూ, పెట్రోలు బంకులకు అధిపతి అయి కోటీశ్వరుడైనాడు పట్టిందల్లా బంగారమే. శని నూనెకు కారకుడు కావడం వల్ల ఆయిల్ బాగా యోగించినది.

# విపరీత రాజయోగము

6-8-12 స్థానాధిపతులు పరస్పర పరివర్తన కలిగిననూ, ఏ ఒకరైనా మరొకరి స్థానములో నున్ననూ, ఆ దశాంతర్దశలలో విపరీత రాజయోగము కలుగును. చెడువలన కూడా మంచి జరుగును.




ఇచట 6-8 అధిపతులు పరివర్తన చెందిరి. కుజదశలో కోర్టు ద్వారా ఆస్తి లభించినది. ఇది దీర్ఘాయువును కూడా ఇచ్చును. సుమారు 72 సం॥రాలు ఈ జాతకుడు జీవించును.

# చంద్ర మంగళయోగము

చంద్ర కుజులు పరస్పరము 1-4-7-10 స్థానములందున్ననూ, కలసియున్ననూ చంద్రమంగళయోగ మేర్పడును.

కు ల
(8) కు చ

ఈ జాతకునకు కుజదశ యోగించినది. కుజ-చంద్ర దశలు విశేష ధనవృద్ధి. పీఠిక మీద, దశలతో పనిలేకుండా జీవితమునందు యోగమిచ్చు శుభయోగములలో ఇది ఒకటి.

## అధి యోగము

చంద్రరాశి నుండి 6-7-8 స్థానములలో ఎక్కడైనా బుధ-గురు-శుక్రులున్నచో "అధియోగము" కలుగును. 6-7-8 స్థానములందు పైన చెప్పిన గ్రహములలో ఏ ఒక్కరు ఉన్ననూ, జాతకుడు సుఖము - కీర్తి పొందును. 2 స్థానములందు 2 గ్రహములున్న ఉన్నత పదవి లేదా మంచి ఉద్యోగము పొందును. 3 స్థానములందు 3గ్రహములున్న విశేషయోగము, వైభవం, ఆయుర్ధాయము, కీర్తి కలుగును.




## బుధాదిత్యయోగము

సూర్య, బుధులు, మిధున-కన్యలయందుగాని, మేష-సింహములందుకాని, కలసియున్నచో ఈ యోగము కలుగును. విద్య-వ్యాపారము-కళారంగములందు, సాంకేతిక విద్యలయందు అనగా ఇంజనీరింగ్ రంగములందు రాణించును.




పైన పేర్కొన 5 యోగములు చాలా చాలా ముఖ్యమైన యోగములు. జాతకములో పై వాటిలో ఏ ఒక్క యోగమున్నా జీవితం చాలా సుఖంగా గడుస్తుంది. ఇవేగాక ఇంకా 300వరకూ యోగములు, కొన్ని యోగ భంగములు కలవు. ముఖ్యంగా ఇవి తప్పక పరిశీలించితే మంచిది.

# అష్టోత్తరీ దశా విధానము

భారతదేశమంతటా చాలా ఎక్కువగా వింశోత్తరీ విధానమే (120 సం॥లు పరమాయుర్దాము) అమలులోనున్నది. పరాశరుడు దీనినే అనుసరించెను.

అయిననూ కొన్ని ప్రాంతములందు అష్టోత్తరీ దశావిధానము ద్వారా ఫలితములు చెప్పు పండితులు కలరు. దీనిని అనుసరించి కూడా చక్కని ఫలితములు చెప్పవచ్చు. ఈ విధానములో మానవుని ఆయు: ప్రమాణము 108 సం॥లు మాత్రమే.

ఇందు కేవలం 8 దశలు మాత్రమే ఉండును. ఇందు కేతు దశలేదు. నిర్ణీత నక్షత్రముల ననుసరించి దశలు ప్రారంభమగును.

| వరుస | నక్షత్రములు | దశాధిపతులు | సం॥లు |
|---|---|---|---|
| 1. | ఆర్ద్ర – పునర్వసు | | |
| | పుష్యమి – ఆశ్లేష | రవి | 6 |
| 2. | మఖ–పుబ్బ–ఉత్తర | చంద్ర | 15 |
| 3. | హస్త–చిత్త–స్వాతి | | |
| | విశాఖ | కుజ | 8 |
| 4. | అనురాధ–జ్యేష్ఠ | | |
| | మూల | బుధ | 17 |
| 5. | పూర్వాషాఢ–ఉత్తరాషాఢ | | |
| | అభిజిత్, శ్రవణం | శని | 10 |
| 6. | ధనిష్ఠ – శతభిషం | | |
| | పూర్వాభాద్ర | గురు | 19 |
| 7. | ఉత్తరాభాద్ర రేవతి | | |
| | అశ్విని – భరణి | రాహు | 12 |
| 8. | కృత్తిక–రోహిణి–మృగశిర | శుక్ర | 21 |

వింశోత్తరీ విధానములో దశాశేషము ఆ నక్షత్రదినప్రమాణము, జననకాల సమయము నాధారము చేసుకొని యుండును.

ఈ అష్టోత్తరీ విధానములో రవి దశలో 4 నక్షత్రములున్నవి, ప్రతీ నక్షత్రము నాలుగవ వంతు దశాశేషముండును.

ఉదా– శ్రవణం నక్షత్రంలో ఒక జాతకుడు జన్మించినపుడు ప్రారంభదశ శని – 10 సం॥లు ఇందులో పూర్వాషాఢ – ఉత్తరాషాఢ – అభిజిత్ – శ్రవణం అని చివర 4వది శ్రవణం అగుటచేత 4వ వంతు మాత్రమే దశాశేషము 2 సం. 6 మాసములుండును.

ధనిష్ఠా నక్షత్ర జాతకునకు ప్రారంభదశ గురుడు 19 సం॥లు పూర్తిగా నుండును. అనంతరము రాహు–శుక్ర–రవి–చంద్ర దశలు నడచును.

# నక్షత్ర ఫలములు

**1. అశ్విని :**

శ్లో॥ **సదైవ దేవాభ్యుదితో వినీతః**
**సత్త్వాన్వితః ప్రాప్త సమస్త సంపత్।**
**యోషావిభూషాత్మజ భూరితోషః**
**స్యాదశ్వినీ జన్మని మానవస్య॥** -జ్యోతిష సిద్ధాంత సారము

**తా॥** అశ్వనీ నక్షత్రమందు పుట్టిన వారు వినయం గలవారు – దైవభక్తులు – సత్త్వగుణం కలిగినవారు – అనేక సంపదలు పొందువారు – అలంకారములు సంతోషము పొందువారు అగుదురు.

**2. భరణి :**

శ్లో॥ **సదాపకీర్తిః హి మహాపవాదః**
**నానా వినోదైశ్చ వినీత కాలః**
**జలేవిలాసీ చపలఃఖలు స్యాత్**
**ప్రాణిప్రణీతో భరణీషు జాతః ॥**

**తా॥** అపకీర్తి పొందువారు – అనేక కష్టములు పొందువారు – అనేక విధముల వినోదములు అనుభవించువారు – వ్యసనపరులు – చపల చిత్తులు – జల ప్రయాణము లందు ఇష్టము కలవారు అగుదురు.

**3. కృత్తిక :**

**శ్లో॥ క్షుధాధిక: సత్యధనైర్విహీనః**
**వృధాటనోత్పన్న మతిః కృతఘ్నః।**
**కఠోరవాక్ చాహిత కర్మకృత్ స్యాత్**
**చేత్ కృత్తికాయం మనుజః ప్రసూతః॥**

**తా॥** ఆకలి ఎక్కువ కలవాడు – సత్య – ధనములు లేనివాడు – వృధాగా తిరుగువాడు – కృతజ్ఞత లేనివాడు – కఠోరచిత్తుడు – గూఢముగా పాపములు చేయువాడు అగును.

**4. రోహిణి :**

**శ్లో॥ స్యాద్ధర్మ కార్యే కుశలః కులీనః**
**సుచారుదేహో విలసత్కలేబరః**
**స్మరాగ్నినాకులితా ఖిలాశయో**
**యోరోహిణీజః సధనీ సమానీ॥**

**తా॥** ధర్మ కార్యములు చేయుట యందు నేర్పరి అందమైన శరీరము కలవాడు – శృంగార భావములు మిక్కిలిగా కలవాడు – అభిమానవంతుడు – ధనవంతుడు అగును.

**5. మృగశిర**

**శ్లో॥ శరాసనాభ్యాస రతో వినీతః**
**సదానురక్తో గుణినాంగుణేషు ।**
**భక్తానుపస్నేహ భరేణ పూర్ణః**
**సన్మార్గవర్తీ మృగజన్మ భాగీ॥**

**తా॥** ఏకాగ్రత – సాంకేతిక విద్య – మంచి గుణములందు అభిమానము – స్నేహశీలత సన్మార్గ ప్రవర్తన – వినయము కలుగును.

**6. ఆర్ద్ర :**

**శ్లో॥ క్షుధాధికో లక్ష్మ శరీర కాంతిః**
**కలిప్రియః కోపయుతో వినీతః ।**
**ప్రసూతికాలేచ భవేత్ కిలార్ద్రా**
**నచార్ద్రచేతాః శరణాగతే పి॥**

**తా॥** ఆకలి ఎక్కువ - మంచి దేహకాంతి - చెడుపనుల యందు ఇష్టము - కోప స్వభావము - వినయము - కఠినమైనను - ప్రతీకార వాంఛ కలగును.

**7. పునర్వసు :**

**శ్లో॥ ప్రభూత మిత్రః కృతశాస్త్ర యత్నః**
**సద్రత్నకామీ వరభూషణాఢ్యః ।**
**దాతాప్రతాపీ వసుధాధిప శ్రీః**
**పునర్వసౌయస్య భవేత్ప్రసూతిః ॥**

**తా॥** ఎక్కువమంది స్నేహితులు కలవారు - పనులు - విద్యయందు నేర్పరి - మంచి వస్తువులను కోరువారు - అలంకారములందిష్టము, దాన గుణము - ధైర్యము కలవారు - మంచి ఉద్యోగము చేయువారు అగుదురు.

**8. పుష్యమి :**

**శ్లో॥ ప్రసన్న గాత్రః పితృమాతృభక్తః**
**స్వధర్మయుక్తో వినయాభియుక్తాః ।**
**భవేన్మనుష్యఃఖలు పుణ్యజన్మా**
**సమ్మానచామీకర వాహనాఢ్యః ॥**

**తా॥** చక్కటి శరీర సౌష్టవము - తల్లిదండ్రుల యందు భక్తి - తను చేయు పనియందు శ్రద్ధ ఉత్సాహము - వినయము - పేరు ప్రతిష్ఠలు - వాహన సౌఖ్యము కలుగును.

## 9. ఆశ్లేష

శ్లో॥ వృధాటనః స్యాదతి దుష్టచేతః
కష్టప్రదస్యాపి వృధా జనానాం।
సర్వేసదర్పోహి శఠార్పితార్థః
కందర్ప సంతప్త మనా మనుష్యః॥

**తా॥** అనవసరముగా తిరుగుట – చెడుమనస్సు – అసూయ – కష్టజీవితము – గర్వము – మొండితనము – కామవాంఛ అధికము కలుగును.

## 10. మఖ

శ్లో॥ కఠోరచిత్తః పితృమాతృభక్తః
తీవ్ర స్వభావః అనవద్య విద్యః ।
చేజ్జన్మభంయస్య మఘానఘః స్యా
–న్మతి సదారాతి వినాశ దక్షా॥

**తా॥** కఠినమైన మనస్సు – తల్లిదండ్రులందు భక్తి – కోపము – మంచి విద్యాయోగము – శతృవిజయము కలుగును.

## 11. పుబ్బ

శ్లో॥ శూరస్త్యాగీ సాహసీ భూమిభర్తా
కోపాక్రాంతః స్యాచ్ఛిరాలో తిదక్షః।
ధూర్తః క్రూరోఽత్యంత వాతాధికఃప్రాక్
ఫల్గున్యశ్చేజ్జన్మ కాలేచ యస్య॥

**తా॥** ధైర్యము – త్యాగగుణము – మంచి ఉద్యోగము – కోపము – కార్య కౌశల్యము – వాత గుణము – తన పనులు నెరవేర్చుకొనుటకు వినయము నటించుట – క్రూర స్వభావము కలుగును.

## 12. ఉత్తర ఫల్గుని

శ్లో॥ దాతా దయాళుః స్వజనే సుశీలః
విశాలకీర్తిః సుమతి ప్రధానః ।
ధీరోనరో త్యంత మృదుస్వభావః
స్యాదుత్తరా ఫల్గునికా ప్రసూతిః ॥

**తా॥** దానగుణము – దయ – తనవారి యందు ప్రేమ – గొప్పకీర్తి – తెలివి – ధైర్యము – అత్యంత మృదుస్వభావము కలుగును.

### 13. హస్త

**శ్లో॥ దాతాయశస్వీ సుతరాం మనస్వీ**
**భూదేవ దేవార్చన కృన్న యజ్ఞః ।**
**ప్రసూతికాలే కిల యస్య హస్తౌ**
**హస్తస్థితా తస్య సమస్త సంపత్॥**

**తా॥** దానగుణము –కీర్తి – అభిమానము సత్కార్యములు చేయుట – యజ్ఞములు – దేవాలయమునందు అర్చన చేయుట ఇష్టము – అధికమైన సంపదలు కలుగును.

### 14. చిత్ర

**శ్లో॥ ప్రతాపసంతాహిత శతృపక్షః**
**దక్షోనయే చాపి విచిత్రవాసాః ।**
**ప్రసూతికాలే యదితస్య చిత్రా**
**బుద్ధిర్విచిత్రా ఖలుతస్య శాస్త్రే ॥**

**తా॥** చేయు పనులందు విజయము – ధైర్యము – రాజకీయములందు వ్యవహార నైపుణ్యం – వస్త్రములందు ఇష్టము – చిత్రవిచిత్రమైన మనోధర్మము – బుద్ధికుశలత – గ్రంథ పరిచయములచే అధిక జ్ఞానము కలుగును.

### 15. స్వాతి

**శ్లో॥ కందర్పరూప ప్రభయా సమేతః**
**కాంతాజన ప్రీతిరతి ప్రసన్నః ।**
**స్వాతి ప్రసూతౌయది**
**మహామతిః ప్రాప్త విభూతియోగః ॥**

**తా॥** సౌందర్యము – స్త్రీలయందు ఇష్టము – అతి ప్రసన్నమైన స్వభావము – తెలివి – సంపదలు కలుగును.

**16. విశాఖ**

శ్లో॥ సదానురక్తో వివిధ క్రియాయాం
సువర్ణకారైరపి సఖ్యమేతి।
యస్యప్రసూతౌ చ భవేద్విశాఖా
సఖాన కస్యాపి భవేత్ప్రసూతః॥

**తా॥** అనేక పనులయందు కౌశల్యము – బంగారు పనివారతో, గొప్ప గొప్ప ఉద్యోగస్తులతో పరిచయములు – అందరికీ ఇష్టుడు అగును.

**17. అనురాధ**

శ్లో॥ సత్కీర్తి కాంతిశ్చ సదోత్సవః స్యాత్
జేతారిపూణాంచ కళాప్రవీణః ।
స్యాత్సంభవే యస్య కిలానురాధః
సంపత్ ప్రమాదౌ వివిధౌ భవేతాం॥

**తా॥** మంచికీర్తి – సుఖము – కళలయందు కౌశలం – అనేక రకములయిన కష్టములు – దీర్ఘాయువు కలుగును.

**18. జ్యేష్ఠ**

శ్లో॥ సత్కీర్తి పుత్రైః వివిధైః సమేతః
విత్తాన్వితో త్యంత లసత్ప్రతాపః।
శ్రేష్ట ప్రతిష్ఠో వికలస్వభావో
జ్యేష్ఠా భవేద్యస్యచ జన్మకాలే ॥

**తా॥** మంచికీర్తి – పుత్ర సంతానము – సంపద – కార్యకుశలత – దుష్ట స్వభావము కలుగును.

**19. మూల**

శ్లో॥ మూలం విరుద్ధావయవం సమూలం
కులందహత్యేవ వదంతి సంతః ।
చేదన్యథాతః పురుషా విశేషాత్
సౌభాగ్యమాయుశ్చ కులానువృద్ధిః॥

**తా॥** ఇందు జన్మించిన వారు వికలాంగులుగా జన్మించినచో కులమునంతా నశింపు చేయుదురు. శుభలక్షణములతో జన్మించినచో సౌభాగ్యము – ఆయువు – వంశవృద్ధి కలుగును.

## 20. పూర్వాషాఢ

**శ్లో॥ భూయో భూయాస్తూయ మానాను రక్తః**
**భక్తోదేవే బంధుమాన్యో తి దక్షః।**
**పూర్వాషాఢాం జన్మకాలే యదిస్యాత్**
**ఆషాడః స్యాత్ వైరివర్గే నితాంతమ్॥**

**తా॥** అనేకమంది చేత మంచి వాడనిపించు కొనుట – భక్తి – బంధువులచే గౌరవింపబడువాడు – అతినేర్పరి – కార్యజయము కలుగును.

## 21. ఉత్తరాషాఢ

**శ్లో॥ దాతాదయావాన్ విజయీ వినీతః**
**సత్కర్మచేత విభవైస్సమేతః ।**
**కాంతా సుఖావాప్త సుఖోనితాంతః**
**వేషే సువేషః పురుషో మనీషీ ॥**

**తా॥** దయ – దాతృత్వము – వినయము – జయము మంచి కర్మలు చేయుట – సంపద సంతోషము – కుటుంబ సుఖము – మంచి వేషము, గొప్పకీర్తి కలుగును.

## 22. శ్రవణం

**శ్లో॥ శాస్త్రానురక్తో బహుపుత్రమిత్రః**
**సత్పుత్రభక్తిః విజితారి వర్గః ।**
**చేజ్జన్మకాలే శ్రవణాహియస్య**
**ప్రేమా పురాణ శ్రవణే ప్రవీణః॥**

**తా॥** అనేక విషయములందు ఆసక్తి – ఎక్కువ మంది పుత్రులు, మిత్రులు, శత్రు జయము – ప్రాచీన గాథలందు ఇష్టము కలుగును.

**23. ధనిష్ఠ**

**శ్లో॥ ఆచార జాతాదర చారుశీలః**
**ధీశాలి సోదరబలవాన్ దయాలుః ।**
**యస్యప్రసూతౌ చ భవేద్ధనిష్ఠా**
**మహత్ప్రతిష్ఠా సహితో నరం స్యాత్॥**

**తా॥** సంప్రదాయమునందిష్టము – తెలివి – సోదరులు ఎక్కువ కలవాడు, వారి వలన సహాయము పొందువాడు – గొప్పకీర్తి ప్రతిష్ఠలు పొందువాడు అగును.

**24. శతభిషం**

**శ్లో॥ శతభీతిరతి సాహసీ సదా**
**నిష్ఠురోహి చతురో నరస్యాత్ ।**
**వైరిణామతి శయేన దారుణో**
**వారుణోడు యదియస్య సంభవే ॥**

**తా॥** అనేక భయములు – సాహసము – నిష్ఠూరము – తెలివి – శతృజయము కలుగును.

**25. పూర్వాభాద్ర**

**శ్లో॥ జితేంద్రియః సర్వకలాసు దక్షః**
**జితారి పక్షః ఖలుతస్య నిత్యం ।**
**భవేన్మహీయాన్ సుతారాం అపూర్వా**
**పూర్వాదా భాద్రపదాప్రసూతౌ॥**

**తా॥** ఇంద్రియ నిగ్రహము – అన్ని పనులయందు నేర్పరితనము – శతృజయము – కష్ట జీవితము కలుగును.

**26. ఉత్తరాభాద్ర**

**శ్లో॥ ధనీ కులీనః కుశలః క్రియాదౌ**
**భూపాల మన్యో బలవాన్ మహౌజాః॥**
**సత్కర్మకర్తా నిజబంధు భక్తః**
**యదురాభద్ర పదా ప్రసూతః॥**

**తా॥** ధనము – గొప్ప వంశము – పనులు చేయుట యందు కేవలం – కీర్తి – బలము మంచి పనులు చేయుట – బంధుప్రేమ సంభవించును.

## 27. రేవతి

శ్లో॥ చారుశీల విభవో జితేంద్రియః
సత్కులః స్వభవనైక మానసః ।
మానవో నను భవేన్మహీపతిః
రేవతీ భవతి యస్య జన్మభమ్॥

**తా॥** రేవతి నక్షత్రమునందు జన్మించిన వారు మంచి నడవడిక, ఇంద్రియ నిగ్రహం కలవారగుదురు. ఎప్పుడూ తమ ఇంటియందు మాత్రమే ఉండుటకు ఇష్టపడతారు. ఉన్నత స్థాయి జీవితము గడుపుదురు.

నక్షత్ర ఆకృతి – ఇది చేపాకారములో నుండును 32 నక్షత్రముల సమూహము. అధిదేవత పూష

| | | |
|---|---|---|
| **జాతి** | – | **శూద్ర** |
| **లింగము** | – | **స్త్రీ** |
| **తత్త్వం** | – | **ఆకాశ తత్త్వం** |
| **స్థానం** | – | **ఈశాన్యం** |
| **అవయవములు** | – | **మడమ** |

ఇందు జన్మించువారు – యాత్రికులు, నీటిపై జీవించువారు, ఇతరుల ధనము నాశించరు.

# రాశి ఫలితములు

## మేషరాశి యందు జన్మించిన వారి ఫలితములు

వీరు భావావేశము గలవారు. ఏదో ఒక పనియందు నిమగ్నులైయుంటారు. ఏమీ చేయకుండా నిరుద్యోగముగా ఉండలేరు. అలంకారములందు – డాంభికములందు ఆసక్తి ఉండదు. క్రమశిక్షణ కలిగియుంటారు. దైవ సంబంధ విషయములందు అభిమానముండును. గొప్ప మేధాశక్తియుండును. 33సం॥ అనంతరము జీవితము మరింత అభివృద్ధికరముగా యుంటుంది. ఇతరుల యందు సహనమున్ననూ, స్వజనము నందు వెంటనే ఉద్రేకము పొందెదరు. ఉపకార

స్వభావముండును. ఉత్సాహవంతులు –క్రీడలయందు అమితమైన ఉత్సాహముండును. రాశ్యాధిపతి కుజుడు కావున అహంకారముండును. మనసులోని అభిప్రాయము ఇతరులు తెలియకుండా జాగ్రత్తపడతారు. రహస్యముగా అపరాధములుగా చేస్తారు. స్వయంకృషితో జీవితమున అనుకొన్నవి సాధింతురు. లాభస్థానము శని ఆధిపత్యము పొందుట చేత – ఇష్టసిద్ధి ఆలస్యముగా జరుగును. తలచినవన్నియు నెరవేరును. ఆచార వ్యవహారములందు ఆపేక్షయుండును. ఆరోగ్య విషయమున జాగ్రత్త వహించెదరు. కక్షసాధింపు స్వభావముండదు. క్షమాగుణముండును. ఆలోచన కన్నా ఆచరణకు అధిక ప్రాధాన్యమిస్తారు. జ్ఞానమధికము. వైరాగ్యము తక్కువ. సాంకేతిక రంగములందు జీవనముండును.

## వృషభ రాశి

ధన సంపాదన యందు దృష్టి అధికము. 2 విధముల సంపాదింతురు. బంధుమిత్రులతో అభిమానముండును. శుచి శుభ్రతలయందు శ్రద్ధ అధికము. అతిధులను ఆదరించుట – ఉదారస్వభావము కలిగియుందురు. ఆత్మవిశ్వాస మధికము. నిజాయితీగా పనిచేయుదురు. ఖర్చు చేయుటకు అంగీకరించరు. స్థిరమైన అభిప్రాయములుండును. రహస్య గోపనము చేయుటలో సమర్థులు. వైవాహిక జీవితము నందు సంపూర్ణ ఆనందము పొందెదరు. తక్కువ స్థాయిలో జన్మించిన వారైనను, భోగ భాగ్యములను అనుభవించెదరు. వీరి జీవిత భాగస్వామి అనుకూలము కానిచో వీరు పట్టుదలకు పోయి దు:ఖము చెందెదరు. కర్మఫలమునందు – దైవచింతన యందు అధికమైన విశ్వాసముండును. చక్కని మిత్ర లక్షణములుండును. జీవితము నందు తలచిన వన్నియూ నెరవేరును. శృంగార విషయములందు – పరిమళ ద్రవ్యములందు –సంగీత గోష్టులందు –అభిరుచియుండును, ఏ విషయము గూర్చి అయిననూ ఆలోచించి చక్కని నిర్ణయము చేసెదరు. తొందరపడుట వీరికి నచ్చదు. శాంతికాముకులు. కృతజ్ఞతా స్వభావముండును. నమ్మతగినవారు, ఉపకార స్వభావముండును. ఆదరణ – అప్యాయ తలధికము, గొప్పవారి పరిచయము లుండును. వివిధ దూరప్రాంతములు – క్షేత్రములు సందర్శిస్తారు. కుటుంబవృద్ధి జీవన సౌఖ్యం పొందుతారు. భక్తియున్ననూ – వైరాగ్యము వీరికి నచ్చదు.

# మిధునము

ఆర్థిక విషయములందు ఆసక్తి ఎక్కువ. ధనవంతులగుదురు. వ్యాపార ధోరణియుండును. చంచల స్వభావము. అలంకరణ – ఆడంబరములు – అధికము. వ్రాతయందు ఇష్టము. బుద్ధి సూక్ష్మత కలిగియుందురు. ధనము కూడబెట్టుటలో బహు సమర్థులు. అయినను ఖర్చు అధికముగా చేయుదురు. సమయానుకూలముగా ప్రవర్తించెదరు. మానసికానందమే వీరికి ఎక్కువ ఇష్టము. వైవాహిక జీవితములో చిన్న అసంతృప్తియుండును. దూరప్రయాణములు చేస్తారు. భగవద్భక్తి – అధికము. స్వప్రయత్నము నందు ఎక్కువ నమ్మికయుండును. సంగీత కళయందు అభిరుచియుండును. సాంకేతిక రంగములందు రాణింతురు. ఉదరకోశ వ్యాధులుండును. గృహమునందు శుచి–శుభ్రతలధికము. బౌద్ధిక క్రీడలందు ఇష్టము. క్షణకాలమైననూ నిర్వ్యాపారముగా నుండలేరు. ఏదో ఒకటి చేయుటయందు అమిత తృప్తి. ఆలోచనలతో కాలము గడుపుట వీరికి ఇష్టముండదు. దయా గుణముండును. ఇతరుల మనోభావములను వెంటనే గ్రహించగలరు. కోర్కెలధికముగా నుండునుగాని వాని గూర్చి తీవ్ర కృషి చేయరు. దాని గూర్చి ఎక్కువగా బాధపడరు. హాస్య సంభాషణా చతురులు – భోజనము నందు అంత శ్రద్ధ ఉండదు. కష్ట సమయములందు మనో ధైర్యముతో ప్రవర్తించెదరు. కార్య సాధకులు సహనమధికము. తప్పు చేసిన వారిని క్షమించుట వీరి ముఖ్య లక్షణము. భౌతిక జీవితమునకు ఎక్కువ ప్రాధాన్యత ఇస్తారు.

# కర్కాటకము

దయా హృదయము – జ్ఞాపకశక్తి ఎక్కువ. ఏ విషయమును మరచిపోరు. మితముగా ఖర్చు చేస్తారు. కుటుంబ విషయములలో ఆసక్తి ఎక్కువ. ఇతరులు విమర్శించినచో సహింపలేరు. పూర్వ సంప్రదాయములందు ఎక్కువ ఇష్టము. దైవభక్తివెక్కువ. ఉపకార స్వభావముండును. వైవాహిక జీవితమునందు కొంత అసంతృప్తి యుండును. దీర్ఘరోగముతో బాధపడుదురు. శృంగార సంబంధమైన విషయములందు కొన్ని ఖచ్చితమైన అభిప్రాయములుండును. కష్టము చేయుటకు వెనుకాడరు. వారసత్వరీత్యా వచ్చిన ఆస్తి ఎక్కువగా నిలువదు. ఆరోగ్యము సామాన్యము.

స్వజనమందు అభిమానము ఎక్కువగా ప్రదర్శించరు. అవకాశము వచ్చినపుడు ప్రతీకారము తీర్చుకొనుటకు వెనుకాడరు. మంచిపేరు కొరకు ప్రాకులాడెదరు. ఆత్మనిగ్రహముండును. రాజకీయములు – గ్రంథరచన – కళానిపుణత యుండును. ఏకాంతముగా నుండుటకు ఇష్టపడతారు. మొక్కల పెంపకమునందు ఎక్కువ ఇష్టముండును. బాల్యములో తల్లిదండ్రులకు కొంతకాలము దూరముగా నుందురు. ఎక్కువగా మాటలాడుట వీరి స్వభావము. స్త్రీలయినచో రహస్యము దాచలేరు. కల్పనాశక్తి అధికము. పురాతన వస్తువులు సేకరించుట యందు అభిలాష యుండును. దీర్ఘకాలము జీవించెదరు.

## సింహము

ఉదార స్వభావము కలవారు. గొప్పపేరు సంపాదించవలెనని మహత్వాకాంక్ష యుండును. ఖర్చుకు వెనుతీయరు. స్నేహితుల కొరకు ఎంతైనా వ్యయము చేయుదురు. అతిథి బంధువులను ఆదరించుటలో వీరిని మించిన వారు లేరు. వీరికి కోపము వెంటనే వచ్చినను, ఎక్కువ కాలముండదు, ఆర్థిక విషయములలో జాగ్రత్త వహించుట మంచిది. మంచి ఆరోగ్యము అనేక రంగములందు అభినివేశముండును. నాయకత్వ లక్షణములుండును. ముఖస్తుతులకు పొంగిపోదురు. ఉపకార స్వభావమధికము. సన్ననయిన నడుముండును. మనో విచారముండును. ఆత్మశక్తి చేత జ్యోతిష – మనోవైజ్ఞానిక శాస్త్రములందు రహస్యములను గ్రహించెదరు. కొన్ని స్థిరమైన అభిప్రాయములున్ననూ, ఇతరులను వ్యతిరేకిస్తారు. ఉద్రేక స్వభావముండును. సాహసమధికము. మంచి విమర్శనా జ్ఞానముండును. సత్సంతానము కలుగును. అధికార పదవులలో నున్న బాగుగా రాణింతురు. సంస్థ అభివృద్ధి మార్గములో నడుపగలరు. సంఘసేవయందు అభిలాషయుండును. దూరప్రాంత సంచారము చేయుదురు. అవకాశమును సద్వినియోగము చేసుకొను సమర్థులు. వేదాంతమునందు ప్రీతియుండును. శివునియందు భక్తియుండును. బంధువులతో అంత సఖ్యత యుండదు. సూక్ష్మబుద్ధి – పట్టుదలగలవారు – కపటము లేని వారు అగుదురు.

## కన్య

వీరికి లౌక్యమధికము – కార్యసాధకులు – వంచనతో అయినను పనిజరుగుట ముఖ్యమని భావిస్తారు. దైవమందు భక్తి – వ్యాపార దక్షత యుండును. రాజకీయములందు రాణిస్తారు. పశుపోషణ – సంఘసేవ అభిమాన విషయములు బాల్యమునందు కొన్ని బాధలు పొందుతారు. ఆరోగ్యము అంతంతమాత్రముండును. సమయానుకూలముగా ప్రవర్తిస్తారు. విషయాభిలాషులు, బంధుమిత్రుల వలన నష్టపడదురు. వివాహ సమయములో కొంత అసంతృప్తి యుండును. జ్ఞాపకశక్తి ఎక్కువ. ఎంతో ఆలోచించి మాట్లాడతారు. మితభాషి. చెప్పుడు మాటలు విను స్వభావముండును. అవకాశవాదమందు అభిమాన మెక్కువ. ఎదుటివారి మనసు నొప్పింపరు. ఆత్మ విశ్వాము తక్కువ. ఖర్చు చేయుటకు ఇష్టపడరు. వ్యసనములుండును. సంతానము వలన కొన్ని ఇబ్బందులు ఎదుర్కొంటారు. వివేకముండును. కొన్ని అపవాదులు తప్పవు. ఆరోగ్యవిషయమున ఎక్కువ జాగ్రత్త వహిస్తారు. పరమత సహనముండును. అనుభవమునకు ఎక్కువ ప్రాధాన్యతనిస్తారు. ఏ విషయము సులభముగా నమ్మరు. బాధ్యతలుంటాయి. రచన – కళారంగములందు పేరు పొందుతారు. స్వార్ధము ఎక్కువుగానున్నను కొంత సంఘసేవ చేస్తారు. ఇతరుల ననుసరించుటకు వీరు ఇష్టపడరు. మిత్రులందు ప్రేమ ఎక్కువ. త్వరితమైన అభివృద్ధి సాధిస్తారు. దైవబలముండును.

## తుల

సమబుద్ధి కలిగి – అందరితో కలుపుగోలు స్వభావము కలిగియుంటారు. ఆకర్షణీయమగు ఆకృతి. సౌందర్య వస్తువుల యందు మమకారము. కళాభిరుచి కలిగియుంటారు. విలాసవస్తువుల కొరకు ఖర్చు చేస్తారు. వంశప్రతిష్ఠ – జాత్యహంకారము ఉంటుంది. వారసత్వ రీత్యా ఆస్తి సంక్రమించును. స్నేహశీలురు. దేశ–కాల–పరిస్థితుల ననుసరించి మసలుకుంటారు. శ్రమ తక్కువ – సంపాదన ఎక్కువగానుండును. సంతాన విషయములో వారికి ఏలోటూ లేకుండా చూచెదరు.

ఉద్యోగ–వ్యాపారములందు కొన్ని సమస్యలు సంభవించును. ఉత్తరోత్తరముగా జీవితము బాగుండును. దూరదృష్టి – సూక్ష్మబుద్ధి – సుఖాభిలాష – నిస్వార్థప్రేమ వీరిముఖ్య లక్షణములు. ఆడంబరములనిన ఆసక్తి ఎక్కువ. పట్టుదల కార్యదీక్ష గలవారగుదురు. ధనసంపాదనలో నీతి నియమములకు ప్రాధాన్యత నీయరు. ప్రయాణములు లాభిస్తాయి. సంగీతము – సాహిత్యము – చిత్రకళయందు అభినివేశ ముండును. శ్లేస్మ వ్యాధితో బాధపడుదురు. బంధుద్వేషి – బాల్యమందు కొంత ఇబ్బందులుండును. స్త్రీలయందను రాగము. బలమైన వాంఛలుండును. వారసత్వ రీత్యా వచ్చినది వ్యయమగును. స్వయంకృషితో ధనవంతులగుదురు. దూర ప్రయాణములు చేయుదురు. కొన్ని విరుద్ధ భావములుండును. అదృష్టవంతులు. రాజకీయములు లభించును. ఐహిక సుఖములు పొందెదరు. బహువిషయ పరిజ్ఞాన ముండును. సంభాషణాచతురులు, హాస్యప్రియులు, ఆయుర్దాయవంతులు

## వృశ్చికం

స్థిర చిత్తము – క్రమశిక్షణ గలవారు. గుప్త విద్యలందు నిపుణులు. తర్క–మంత్ర–క్షుద్ర విద్యలందు అభినివేశము. ముందుగా బాగా ఆలోచించనిదే ఏ పనీ చేయరు. బహుముఖ ప్రజ్ఞావంతులు. కుటుంబవృద్ధి, పుత్రులు వీరికంటే గొప్ప వారగుదురు. ఉన్నత వ్యక్తులతో పరిచయములుండును. మంచికీర్తి యుండును. స్వార్థపరులు, కళలయందు వేదాంతమునందు – బహుభాషలయందు పాండిత్య ముండును, ప్రయాణములు లాభించును. జ్యోతిష – మంత్ర శాస్త్రములందు పేరుగాంచెదరు. పరుషముగా మాట్లాడి ఎదుటివారిని బాధపెట్టుదురు. వీరు మౌనవ్రతము చేయుట మంచిది. వీరి గాంభీర్యతవలన ఇతరులు అంత సుఖముగా చేరరు. లక్ష్యసిద్ధికై వేచియుండు సహనము – పట్టుదల కలిగి యుంటారు. అత్యాశా పరులు కారు. ఋణములందు ఇష్టముండదు. దీర్ఘవ్యాధులుండును. పుస్తక పఠనమందు శ్రద్ధ, సంభాషణా చతురులు. తగవులనిన ఇష్టముండదు. లోభిత్వముండును. తనకోసము ఎంతైనా ఖర్చు పెడతారు. అనవసర వ్యయముండును. గర్వముండును.

రచనలు – పుస్తక ప్రచురణ – కాంట్రాక్టుల వలన లాభముండును. రెండు విధముల సంపాదింతురు. సంతానము వలన సుఖ సంతోషములుండును. స్త్రీల వలన కొన్ని చిక్కులుండును. రసాయన శాస్త్రమందు అభినివేశము. భౌతిక వాదమునకు ఎక్కువ నమ్మికయుండును. వీరిలో జ్ఞానులధికము భక్తి – విశ్వాసములు తక్కువ. కార్యకారణ భావ విచారము చేయుదురు. స్నేహశీలురు, దయా గుణవంతులు ఇతరుల మాట వినరు.

## ధనుస్సు

సూటిగా మాట్లాడే స్వభావము. దయా హృదయులు, ధన విషయములో జాగ్రత్త గలవారు. సంతృప్తిగా జీవించుటకు ఇష్టపడుదురు. పొదుపు చేయుటకు ప్రయత్నింతురు. వీరు తలచినది ఆశ్చర్యకరముగా జరుగును. పదిమందితో కలసి మెలసి జీవింతురు. ఉదారస్వభావముండును. ఎక్కువమంది స్నేహితులుందురు. దైవభక్తి – పాపభీతి ఉండును. ప్రయాణములందు ఇష్టము. అందరూ తన మాట వినవలెనను కోరిక యుండును. జీవితము సుఖ సంతోషములతో గడచును. అల్ప సంతోషులు. కళలయందు అభిరుచియుండును. శత్రువులు కూడా మిత్రులగుదురు. విశాల దృక్పథము – సంఘ సేవయందు అభిలాష ఉండును. కాలమునకు ఎవరూ అతీతులు గారని సమాధానపడును. అధికారులమన్నన పొందును. ఆడంబరములకై ఖర్చుపెట్టుట – అనవసర వ్యయము ఎంత నిగ్రహించుకొన్నా తప్పదు. వ్యాపార వ్యవహారములందు లాభముండును. సంప్రదాయములందు గౌరవముండును. ఒక లక్ష్యమునుద్దేశించి ప్రయత్నము చేయుట వీరిముఖ్య లక్షణము. పట్టు – విడుపు రెండూ ఉంటాయి. ఇతరులు చెప్పినది వింటారు. వారితో వాదించరు. అవకాశములను సద్వినియోగము చేసుకొందురు. అత్యాశ ఉండదు. గురుబలముచేత అపాయములు తప్పిపోవును. విషయవాంఛలకు వశులగుదురు. పరలోకము గూర్చి నిర్దిష్టమైన అభిప్రాయము నేర్పరుచుకొనుటకు ఇష్టపడరు. ఇతరులకు మార్గదర్శకముగా నుండునట్లు జీవింపగలరు.

## మకరము

ఆలోచనాపరులు – ముందు జాగ్రత్త – పట్టుదల వారు కార్యదీక్షాపరులు. మనసులో ఉన్న విషయము బయటకు తెలియనీయరు. డాంబికము చేయుటకు ఇష్టపడరు. మనోధైర్యము హెచ్చుగానుడును. ధనవిషయములో లోటు ఉండదు. స్వార్థమున్నను – కొన్ని సమయములందు ఉదారముగా వ్యవహరింతురు. ఎక్కువమంది స్నేహితులుందురు. ఎవరితోనైననూ ముందుగా మాట్లాడు స్వభావముండును. బహుముఖ ప్రజ్ఞావంతులు. అందరూ సుఖముగా నుండవలెనని తలంతురు. తత్త్వశాస్త్రమందు అభిమానముండును. దైవభక్తి, ధర్మచింతనయుండును. వైద్యము, విద్యాలయములు, విలాసవస్తువుల సంబంధమయిన వాటియందు జీవనముండును. ఆలస్య స్వభావమైననూ క్రమశిక్షణ పాటింతురు. నిరాడంబర జీవితమునందు ఆసక్తియుండును. ధనము దాచుటయందు శ్రద్ధ ఉండదు. పెద్దల యందు గౌరవముండును. నూతన విషయములు పరిశోధించువారు – విజ్ఞాన శాస్త్రవేత్తలు – రచయితలుగా పేరు పొందెదరు. దూరదృష్టి, బాగుగా ఆలోచించి నిర్ణయము తీసుకొనుట వీరి ముఖ్య లక్షణములు జరిగిన దానిని తలచి బాధపడు స్వభావము కాదు. సంగీతము నందు అభినివేశముండును. ఆత్మగౌరవమును గొప్పగా తలతురు. ఇతరుల ఉద్దేశ్యము గ్రహించు శక్తి యుండును. సంఘసేవ చేయుట యందు అభిలాష. భార్యావిధేయులై ఉందురు. కొన్ని చెడు స్నేహములుండును. వివాహ జీవితమందు ప్రతికూలములున్ననూ విడిపోవుటకు ఇష్టపడరు. సంఘమునకు భయపడుదురు.

## కుంభము

మిత్రప్రేమ, అమితమైన అభిమానము – ఆప్యాయత కలిగినవారు కార్యసాధనయే ముఖ్యము. అక్రమ మార్గములోనైనా సాధిస్తారు. ధనసంపాదన బాగుంటుంది. విశాలదృక్పథము, తాత్త్విక చింతన, ఉంటుంది. వీరి జీవన విధానము ఎక్కువగా ప్రజలతో సంబంధం కలిగినదై యుంటుంది. జీవిత చరమాంకములో ఒంటరిగా నుందురు. కొందరు సన్యాసజీవితము గడిపెదరు. సమాజమునకు ఉపయోగపడతారు.

ప్రయాణములు ఎక్కువగా చేస్తారు. గ్రంధములు చదువుట, వ్రాయుట, సంస్థలు స్థాపించుట జరుగును. బాల్యము నందు కొన్ని కష్టములుండును. అభిప్రాయములు స్థిరముగా నుండును. స్థలమార్పు ఎక్కువగా నుండదు. నూతన విషయములందు ఆసక్తి. ముందుగా బాగుగా ఆలోచించి నిర్ణయము తీసుకొందురు. ముఖస్తుతులు గమనించిననూ ఆశ్రితులకు సహాయము చేయుదురు. గంభీర హృదయులు, తరచు అనారోగ్యము కలుగును. ప్రజాకర్షణ ఉంటుంది. శతృజయం కలుగును. జ్ఞాపకశక్తి అదికము – అదృష్టము కలసివచ్చును. దైవమునందు అపారమైన నమ్మకముండును. ఏది జరిగిననూ పూర్వ కర్మవలన విధి విధానము వలన జరిగినదని భావిస్తారు. మనోబలము ఎక్కువ ఎదుటి వారి మనోగత విషయములు వెంటనే తెలుసుకొను ఇంగిత జ్ఞానముండును. వ్యసనములకు బానిసలగుదురు. అందరికి ద్రోహ చింతన ఉండును. ఇతరులను మానసికముగా హింసించి ఆనందించు స్వభావముండును. నచ్చిన వారికి ఎంతో ఉపకారము చేయుదురు. బంధుమిత్రులధికము. కీర్తి ప్రతిష్ఠలుండును. దైవబలము ఆపత్సమయములందు సహాయపడును.

## మీనరాశి

దయాదాక్షిణ్యములు – దైవచింతన గల సాత్త్విక స్వభావులు. ఈ రాశి పరమార్థ చింతనను సూచించును. సాహసించి ఏ పనీ తొందరగా చేయరు. జన్మరాహిత్యము కొరకుప్రయత్నించవలెనని అభిలాషయుండును. “బుద్ధి సూక్ష్మత – విషయధారణ శక్తి గలవారు. ఏ పని నిర్వహించుటకు గాని, ముందుగా ఆలోచించి సక్రమముగా పూర్తిచేయుట వీరి స్వభావము. నీతి నియమములందు ఖచ్చితమైన అభిప్రాయము లుండును. వ్యసనములు సాధారణముగా వీరికుండవు. ధన కుటుంబములు చక్కగా వృద్ధి నొందును. శాంతి సామరస్యములు అందరితో సహజీవనం – సాంఘిక కట్టుబాట్లు పాటించుట వీరికి ఇష్టము. వీరి అభీష్టము అనుసరించే వీరి జీవన విధాన ముండును. స్పెక్యులేషన్– షేర్ల వ్యాపారము లాభించును. ఉన్నత పదవులు – ఉచ్ఛస్థితి పొందుతారు. వీరిలో కొందరికి బహుభార్యలుందురు. ఉద్యోగ – వ్యవహారములందు ఆదర్శ ప్రాయములుగానుందురు. యవ్వనములో ఎక్కువగా

కష్టబడుదురు. ఇళ్ళు – భూములు – వాహనములుండును. విద్య– వైద్య–న్యాయ–మత–వేదాంత రంగములలో ప్రఖ్యాతి పొందెదరు. గ్రంధ రచయితలు – కళాకారులు – సహృదయులు. విజ్ఞాన శాస్త్రమందు అభిమాన ముండును. అధిక కోపమున్నను ఎదుట వారిని బాధించరు. దైవబలము వీరికుండును. వ్యయము చేయుటకు వెనుకాడరు. కాని కొన్ని సమయములందు లోభిత్వము చూపుదురు. లగ్నము కూడా ద్విస్వభావము అయినచో, ద్వంద్వాభిప్రాయము లుండును. అసహనము, ఉదాసీన స్వభావముండును. మానవ శ్రేయస్సుకై ఏదైనా గొప్ప కార్యము చేయవలెనను తలంపుండును. వీరికి సాధారణముగా డబ్బుకులోటుండదు. మధు మేహము – మూత్రపిండము వ్యాధులుండును.

# సూర్యుడు 12 భావములలో ఉన్న ఫలితములు

## సూర్యుడు లగ్నమందున్నచో

**"ఆరోగ్యం భవతి, పిత్త ప్రకృతిః నేత్రరోగి, మేధావీ సదాచారీవా। ఉష్ణోదరవాన్, మూర్ఖః, పుత్రహీనః, తీక్షబుద్ధిః, అల్పభాషి, ప్రవాసశీలః సుఖి, స్వోచ్ఛే కీర్తిమాన్, బలనిరీక్షితే విద్వాన్, నీచే ప్రతాపవాన్, జ్ఞానద్వేషీ, దరిద్రః, అంధకః శుభదృష్టే నదోషః, సింహస్వాంశే, నాథః, కుళీరే జ్ఞానవాన్, రోగీ, బుద్‌బుదాక్షః మకరే హృద్రోగీ, మీనే స్త్రీజనసేవీ, కన్యాయాం రవే కన్యా ప్రజః, దారహీనః కృతఘ్నః క్షేత్రే శుభయుక్తః, ఆరోగ్యవాన్, పాపయుతే శత్రునీచక్షేత్రే తృతీయే వర్షే జ్వరపీడా శుభదృష్టే నదోషః॥** - భృగుసూత్రము

**తా॥** లగ్నమందు సూర్యుడున్నచో ఆరోగ్యము, పైత్య స్వభావము, నేత్రరోగము, మేధావిత్వము, సదాచారము, జఠరాగ్ని ఎక్కువగా నుండుట, మూర్ఖుడు, సంతానము లేనివాడు, కోపస్వభావము, తక్కువగా మాట్లాడువాడు, ఎక్కువగా ప్రయాణములు చేయువాడు, సౌఖ్యవంతుడు, సూర్యుడు మేషమందు ఉచ్చ స్థానమందున్నచో సాహస వంతుడు, జ్ఞానమును వ్యతిరేకించువాడు, దరిద్రుడు, నేత్రరోగి, శుభుల దృష్టి యున్నచో దోషము లేదు. స్వనావాంశయందు అధికారము, కర్కాటకమందు జ్ఞాని, రోగి,

మిడిగుడ్లు, మకరమందు గుండె జబ్బు, మీనమందు స్త్రీ ద్వేషి, కన్యయందు స్త్రీ సంతానము భార్యాహాని, కృతఘ్నుత, స్వరాశియందు ఆరోగ్యము, పాప సంబంధ మందు, నీచయందు 3వసం॥ జ్వరము శుభదృష్టి దోషము లేదు.

## ద్వితీయమందు సూర్యుడున్న ఫలితములు

**ముఖరోగి, పంచ వింశతివర్షే రాజదండేన ద్రవ్యచ్ఛేదః ఉచ్చే స్వక్షేత్రే నదోషః, పాపయుతే నేత్రరోగి, స్వల్ప విద్వాన్ రోగి, శుభవీక్షితే ధనవాన్, దోషాదీన్ వ్యపహరతి, నేత్రసౌఖ్యం, స్వోచ్చే స్వక్షేత్రేవా బహుధనవాన్, బుధయుతే పవనవాక్, ధనాధిపఃస్వోచ్చే వాగ్మీ ।**

**శాస్త్రజ్ఞః । జ్ఞానవాన్। నేత్రసౌఖ్యం రాజయోగశ్చ॥ - భృగుసూత్రము**

**తా॥** ముఖమందు రోగము – 25 సం॥నందు ధననష్టం – ఉచ్చ స్వక్షేత్రము లందున్న దోషము లేదు – పాపగ్రహ సంబంధమున్న నేత్రరోగము – స్వల్పమైన విద్య – రోగి – శుభగ్రహ దృష్టియున్నచో ధనవంతుడు – దోషములు తొలగును – బుధునితో కలసిన కొంత నత్తి – ధనాధిపతి ఉచ్చయందున్న మంచివక్త – విద్యావంతుడు అగును – జ్ఞాని – రాజయోగం – నేత్రసౌఖ్యం.

## తృతీయమందు సూర్యుడున్న ఫలితములు

**– బుద్ధిమాన్ – అనుజరహితః జ్యేష్ఠ నాశః । పంచమేవర్షే చతురష్టాదశవర్షే వా కించిత్పీడా। పాపయుతే క్రూర కర్తా। ద్విభ్రాతృమాన్, పరాక్రమా। యుద్ధే శూరశ్చ, కీర్తిమాన్। నిజధనభోగి। శుభయుతే సోదరవృద్ధి। భావాధిపే బలయుతే భ్రాతృదీర్ఘాయుః । పాపయుతే పాపేక్షణవశాత్ వంశనాశః । శుభవీక్షణ వశాద్ధనవాన్ భోగి॥**

**తా॥** బుద్ధిమంతుడు – సోదరులు లేనివాడు – 5వ సం॥నందు, 22 సం॥ నందు అనారోగ్యం – పాపగ్రహములతో కలసిన పాపపు పనులు చేయును. ఇద్దరు

సోదరులుందురు – పరాక్రమవంతుడు – ధైర్యవంతుడు – కీర్తిగలవాడు – తన ధనముతో సుఖములనుభవించువాడు – శుభదృష్టియున్నచో సోదరవృద్ధి కలుగును. భావాధిపతి బలముగా నున్నచో సోదరులు దీర్ఘాయువు. పాపులతో కలసి వారి దృష్టి సంబందమున్నచో వంశనాశనము – శుభ గ్రహసంబంధము వలన ధనవంతుడు – భోగి అగును.

## చతుర్థమందు సూర్యుడున్న ఫలితములు

**–హీనాంగః । అహంకారీ ।జనవిరోధి, ఉష్ణదేహీ, మనం పీడవాన్। ద్వాత్రింశద్వర్షే సర్వకర్మాను కూలవాన్। బహుప్రతిష్ఠా సిద్ధిః । సత్తాపద విజ్ఞాన శౌర్యసంపన్నః । ధనధాన్యహీనః । భావాధిపతి బలయుతే స్వక్షేత్రే త్రికోణే కేంద్రే లక్షణాపేక్షయా ఆందోళికా ప్రాప్తిః । పాపయుతే పాపవీక్షణవశాత్ దుష్టస్థానే దుర్వాహన సిద్ధిః। క్షేత్రహీనః । పరగృహవాసః॥**

**తా॥** అవయవలోపము – అహంకారము, జనులతో శతృత్వము – వేడిగా యుండు నిక్కాక దేహము – మనస్సు వేధించుట – 32 సం॥నందు చేయు అన్ని పనులయందు అనుకూల్యత – అనేక నిర్మాణములు చేయుట – జ్ఞాన ధైర్యములు – భావాధిపతి బలంగాయున్న గౌరవ సన్మానములు –పాపగ్రహసంబంధము వలన వాహన నాశనము –గృహ క్షేత్రములు లేకపోవుట – ఇతరుల ఇండ్లయందు ఉండుట సంభవించును.

## పంచమమందు సూర్యుడున్న ఫలితములు

**–నిర్ధనః। స్థూలదేహీ, సప్తమవర్షే పిత్రారిష్టవాన్ । మేధావీ అల్పపుత్రః, బుద్ధివాన్। భావాధిపే బలయుతే పుత్రసిద్ధిః । రాహు కేతుయుతే సర్పశాపాత్ సుతక్షయః । కుజయుతే శతృమూలాత్। శుభదృష్టేయుతే న దోషః । సూర్య శరభాదిసు భక్తః। బలయుతే పుత్ర సమృద్ధిః।**

**తా॥** దరిద్రుడు – స్థూలదేహుడు – 7వ సం॥ నందు తండ్రికి అరిష్టము – తెలివైనవాడు, తక్కువ పుత్రవంతుడు – బుద్ధిమంతుడు అగును.

భావాధిపతి బలముగా నున్నచో పుత్రులు కలుగుదురు. రాహు – కేతువులతో కలసిన సర్వశాపమువలన పుత్రనాశనము కలుగును. కుజునితో కలసి శత్రు మూలకముగా సంతాన నాశము. శుభులతో కలసిననూ, చూడబడిననూ దోషము లేదు. సూర్యోపాసకుడు అగును. బలయుతుడైయున్నచో పుత్ర సమృద్ధి కలుగును.

## షష్ఠస్థానమందు సూర్యుడున్న ఫలితములు

**–అల్పజ్ఞాతిః శత్రువృద్ధిః ధనధాన్య సమృద్ధిః, వింశతి వర్షే నేత్ర వైపరీత్యం భవతి । శుభదృష్టియుతే న దోషః । అహికానన పారకృన్మం త్రసేవీ। కీర్తిమాన్, శోక రోగీ, మహోష్ణదేహీ। శుభయుతే భావాధిపే దేహారోగ్యం । జ్ఞాతిశత్రు బాహుళ్యం। భావాధిపే దుర్బలే శత్రునాశః। పితృదుర్బలః॥**

**తా॥** బంధువులు తక్కువగా యుందురు – శత్రువులు ఎక్కువ – సంపద – 20 సం॥నందు నేత్ర రోగము –శుభ గ్రహసంబంధముచే దోష నివారణమగును. తంత్ర మంత్రములందు ఇష్టము, ప్రయత్నము – కీర్తి –దుఃఖము –ఉష్ణశరీరము – శుభులలో కలసిన ఆరోగ్యం – భావాధిపతి దుర్బలుడైన శత్రునాశం – పితృనాశనం జరుగును.

## సప్తమమందు సూర్యుడున్న ఫలితములు

**–వివాహ విలంబనం। స్త్రీద్వేషి। పరదారరతః। దారద్వయవాన్। పంచవింశతి వర్షే దేశాంతర గమనం। అభక్ష్య భక్షణం । వినోదశీలః। దారద్వేషి । నాశాంత బుద్ధిః । స్వర్క్షే బలవతి ఏకదారవాన్ । శత్రునీచ వీక్షితే పాపయుతే బహుదారవాన్॥**

**తా॥** వివాహం ఆలస్యం – స్త్రీ ద్వేషము – ఇతర స్త్రీలతో సంబంధములు – ఇద్దరు భార్యలు –25సం॥నందు దూరప్రయాణము లేదా విదేశగమనము – భోజన ప్రియత్వం –ఆచారహీనత – వినోదములందు ఇష్టము – భార్యతో విరోధం – శత్రువులు నాశనమగు వరకు మనశ్శాంతి లేకపోవుట – తన నక్షత్రమందు బలముగా నున్నచో ఒకే భార్యగలవాడు – శత్రునీచ గ్రహసంబంధముచే అనేకమంది భార్యలు కలుగుదురు.

## అష్టమమందు సూర్యుడున్న ఫలితములు

**– అల్పపుత్రః । నేత్రరోగి। దశమవర్షే శిరోవ్రణీ। శుభయుత దృష్టే తత్పరిహారః। అల్పధనవాన్ । గోమహిష్యాది నాశః । రోగీ । ఖ్యాతిమాన్ । భావాధిపే బలయుతే ఇష్టక్షేత్రవాన్ । స్వోచ్చే స్వక్షేత్రే దీర్ఘాయుః॥**

**తా॥** స్వల్ప సంతానము – 10వ సం॥నందు శిరస్సు నందు కురుపులు – శుభ గ్రహసంబంధముచేత దోషపరిహారమగును– స్వల్పధనము – పశునాశనము – రోగము – కీర్తి – భావాధిపతి బలముగానున్నచో తానుకోరిన స్థల గృహములు పొందును – స్వక్షేత్ర ఉచ్చయందున్నచో దీర్ఘాయుర్దాయము కలుగును.

## నవమమందు సూర్యుడున్న ఫలితములు

**– సూర్యాది దేవతా భక్తః । ధార్మికః । అల్పభాగ్యః ।**
**పితృద్వేషీ । సుతదారవాన్ । స్వోచ్చే స్వక్షేత్రే పితాదీర్ఘాయుః।**
**బహుధనవాన్ । తపోధ్యానశీలః । గురుదేవతా భక్తః।**
**నీచారి పాపక్షేత్రే పాపైర్యుతే దృష్టేవా పితృనాశః। శుభ**
**యుతే వీక్షణ వశాద్వా పితా దీర్ఘాయుః॥**

**తా॥** సూర్య – శివ భక్తుడగును – ధర్మబుద్ధి – స్వల్ప ధనము – భార్యాబిడ్డలు కలవాడు – తండ్రితో విరోధము – ఉచ్చ స్వక్షేత్రమందున్న తండ్రి దీర్ఘాయువు – ధనవంతుడు –తపస్సు, ధ్యానము చేయువాడు –గురుదేవతా భక్తి – నీచ – పాపగ్రహ సంబంధమున్నచో తండ్రి మరణం – శుభ గ్రహసంబంధముచే తండ్రి దీర్ఘాయువు

## దశమమందు సూర్యుడున్న ఫలితములు

**– అష్టాదశ వర్షే విద్యాధికారేణ ప్రసిద్ధో భవతి। ద్రవ్యార్జన సమర్థశ్చ। దృష్టిత్రితః రాజప్రియః సత్కర్మరతః రాజశూః। ఖ్యాతిమాన్। స్వోచ్చే స్వక్షేత్రే బలపరః కీర్తి ప్రసిద్ధిః। తటాకక్షేత్ర గోపురాది బ్రాహ్మణ ప్రతిష్ఠా సిద్ధిః । పాపక్షేత్రే**

**పాపయుతే పాపదృష్టవశాత్ కర్మవిఘ్నకరః। దుష్టకృతిః అనాచారః దుష్కర్మ కృతాపి।**

పదవ స్థానమందు సూర్యుడున్నచో 18వ సం॥నందు విద్యయందు కీర్తి, వెంటనే ఉద్యోగము వచ్చుట, 3గ్రహములు చూచినచో ప్రభుత్వమువలన లాభము, అధికారము కలుగును.

స్వక్షేత్ర – ఉచ్ఛస్థానములందున్నచో బలవంతుడైన గొప్పపేరు ప్రఖ్యాతులు కలుగును. భవనములు, దేవాలయములు, శంకుస్థాపనలు నిర్వహించును. పాప స్థానములందుగాని, పాపులతో కలసిన గాని, ఉద్యోగ భంగము కలుగును.

పాపగ్రహ సంబంధము వలన, అనాచారము, పాప కార్యములు ఆచరించువాడు అగును.

## ఏకాదశమమందు సూర్యుడున్న ఫలితములు

**–బహుధాన్యవాన్ – పంచవింశతి వర్షే వాహన సిద్ధిః। ధనవాగ్జాల ద్రవ్యార్జన సమర్థః। జ్వరిత, భృత్యజన స్నేహః। పాపయుతే బహుధాన్యవ్యయః వాహనహీనః। స్వోచ్ఛ స్వక్షేత్రే అధిక ప్రాబల్యం। వాహనేశయుతే బహుక్షేత్రే విత్తాధికారః। వాహనయోగేన బహుభాగ్యవాన్**

**తా॥** సంపద – 25 సం॥నందు వాహనయోగము – తన వాక్కుచేత ధనము సంపాదించువాడు – సేవకులయందు కారుణ్యము – పాపగ్రహ సంబంధముచేత అధిక వ్యయము – వాహనము లేకపోవుట – చతుర్థాధిపతితో కలసిన స్థలములు – సంపద – అధికారము కలుగును – వాహన యోగముచే బహుభాగ్యవంతుడగును.

## ద్వాదశమందు సూర్యుడున్న ఫలితములు

**–షట్ త్రింశద్వర్షే గుల్మరోగీ। అపాత్ర వ్యయకారి, పతితః। ధనహానిః। గోహత్యా దోషకృత్। పరదేశవాసీ। భావాధిపే బలయుతే వా దేవతామంత్ర సిద్ధిః। శయ్యాఖట్వాంగాది సౌఖ్యం। పాపయుతే అపాత్రవ్యయకారీ, సుఖశయ్యా హీనః। షష్ఠేశయుతే కుష్టరోగయుతః శుభదృష్టియుతే నివృత్తిః। పాపే రోగవృద్ధిమాన్॥**

**తా॥** 36 సం॥ అనారోగ్యం – ఆసనరోగం – అనవసరఖర్చు భ్రష్టత్వం – హననదోషం – ఇతర ప్రాంతములందు నివాసం – భావాధిపతి బలంగాయున్నచో దేవతా మంత్ర సిద్ధి – శయనసుఖం – పాపగ్రహములతో చేరినచో పాత్రవ్యయం – శయ్యాసుఖహీనుడు – ఆరవ స్థానాధిపతితో కలసిన చర్మరోగం – శుభదృష్టియున్నచో నివారణ ।– పాపత్వంపట్టిన రోగవృద్ధి –

# 2. లగ్నమందు చంద్రుడున్న ఫలితములు

**–రూపలావణ్యయుక్తశ్చలః, వ్యాధినా జలాచ్చ అసౌఖ్యః పంచ వింశతి వర్షే బహుయాత్రావన్ । మేష వృషభ కర్కలగ్నే చంద్రే శాస్త్రపరః । ధనీ, సుఖీ, మృదువాక్, మృదుగాత్రః, బలీ। శుభదృష్టే బలవాన్। బుద్ధిమాన్, ఆరోగ్యమాన్, వాగ్జాలకః, ధనీ। లగ్నేశే బలరహితే వ్యాధిమాన్, శుభదృష్టేన ఆరోగ్యవాన్॥**

**తా॥** సౌందర్యము–లావణ్యము–జలభయం–తరచు అనారోగ్యం–15–25 సం॥ లలో అనేక యాత్రలు చేయువాడు–మేష–వృషభ – కర్కాటలగ్నములందు చంద్రుడున్న గొప్ప విద్యాయోగము–ధనవంతుడు–సుఖి–మృదువుగా మాట్లాడువాడు– సుకుమార దేహడు శుభదృష్టిచే బలవంతుడు – బుద్ధిమంతుడు ఆరోగ్యవంతుడు –వాగ్మి– లగ్నాధిపతి బలహీనుడైనచో రోగిష్టి అగును. శుభదృష్టిచే దోష నివారణమగును.

## ద్వితీయమందు చంద్రుడున్న ఫలితములు

**–శోభనవాన్, బహుప్రతాపీ, ధనవాన్, అల్పసంతోషీ। అష్టాదశవర్షే రాజద్వారే సేనాధిపత్యయోగః। పాపయుతే విద్యాహీనః। శుభయుతే బహువిద్యా ధనవాన్। ఏకేనైవ పూర్ణచంద్రేణ సంపూర్ణ ధనవాన్, అనేక విద్యావాన్॥**

**తా॥** అందగాడు – ధనవంతుడు – అల్పసంతోషి – 18–19 సం॥నందు ప్రభుత్వోద్యోగము – పాప గ్రహ సంబంధము వలన విద్యాహీనత – శుభగ్రహములతో కలసిన బహువిద్యావేత్త – ధనవంతుడు – పూర్ణచంద్రుడొక్కడు బలముగా నున్నచో – విద్య – సంపదలు పొందును.

## తృతీయమందు చంద్రుడున్న ఫలితములు

**భగినీసామాన్యం,వాతశరీరీ,అన్నహీనఃఅల్పభాగ్యః। చతుర్వింశతి వర్షే రాజ దండేన ద్రవ్యచ్ఛేదః। గోమహిష్యాదిహీనః,పిశునః, మేధావీ, సహోదరవృద్ధిః॥**

**తా॥** సోదరి సామాన్యజీవితం – వాతశరీరం – స్వల్ప ధనప్రాప్తి – 24సం॥ ధననష్టం – వాహన గృహహీనుడు – లోభి – మేధావి – సోదరవృద్ధి కలవాడగును.

## చతుర్థమందు చంద్రుడున్న ఫలితములు

**రాజ్యభిషిక్తః అశ్వవాన్, క్షీరసమృద్ధిః, ధనధాన్య సమృద్ధః మాతృరోగీ, పరస్త్రీస్తనపానకారి। మిష్టాన్న సంపన్నః పరస్త్రీలోలః సౌఖ్యవాన్। పూర్ణచంద్రౌ, స్వక్షేత్రే బలవాన్ మాతృదీర్ఘాయుః। క్షీణచంద్రేపాపయుతే మాతృనాశః, వాహన హీనః, బలయుతే వాహనసిద్ధిః।భావాధిపే స్వోచ్చే అనేకాశ్వాది వాహనసిద్ధిః॥**

**తా॥** పదవీ యోగము లేదా ఉన్నత ఉద్యోగము, వాహనములు, పాలసమృద్ధి, ధాన్యములు సంపత్, తల్లి దీర్ఘాయువు, పరస్త్రీ స్తనపానముచే పెరుగువాడు, పరస్త్రీలోలుడు, సుఖి, అగును. మంచి రుచికరమైన భోజనములు చేయువాడు, అగును. చంద్రుడు క్షీణబలుడైనచో, పాపక్షేత్ర పాపయుతియున్నచో మాతృనాశనం, వాహనము లేకపోవుట జరుగును.

## పంచమ మందు చంద్రుడున్న ఫలితములు

**–స్త్రీ దేవతా సిద్ధిః। భార్యా రూపవతీ, క్వచిత్ కోపవతీ, స్తనమధ్యే లాంఛనం భవతి। చతుష్పాద లాభః స్త్రీ ద్వయం, బహుక్షీరలాభః, సత్త్వయుతః, బహుశ్రమోత్పన్నః చింతావన్, స్త్రీప్రజావాన్। ఏక పుత్రవాన్। శుభయుతే వీక్షణవశాత్ అనుగ్రహ సమర్థః పాపయుతే క్షణవశాన్ని గ్రహసమర్థః। పూర్ణచంద్రేబలవాన్, అన్నదాన ప్రీతిః, అనేక బుధ ప్రసాదైశ్వర్య సంపన్నః। సత్కర్మకృత్ । భాగ్యసమృద్ధః। రాజభోగి, జ్ఞానవాన్॥**

**తా॥** స్త్రీ దేవతోపాసన–అందమైన భార్య, లేదా కోపము గల భార్య, గుండెల మధ్య పుట్టుమచ్చ ఉండును. పశులాభము, ఇద్దరు భార్యలు, ద్రవపదార్థముల వల్ల లాభము, సత్త్వగుణము, కష్టజీవి, స్త్రీ సంతానమధికం, ఒక్క పుత్రుడుండును. శుభులతో

కలసిన దృష్టి మాత్రము చేత ఇతరులకు సుఖము కలుగును, పాపులతో కలసిన నాశదృష్టి, అన్నదానమందు ఇష్టము. బలచంద్రుని వలన సంపద, తెలివి కలుగును. మంచి కర్మలనాచరించును. భాగ్యవృద్ధి కలుగును. రాజభోగముల ననుభవించును. వేదాంత జ్ఞానము తెలిసిన వాడగును.

## షష్ఠమందు చంద్రుడున్న ఫలితములు

**అధిక దారిద్ర్యదేహీ, షట్ త్రింశద్వర్షే విధవా సంగమీ, తత్రపాపయుతే హీనపాపకరః, రాహుకేతుయుతే అర్థహీనః। ఘోరః, శతృకలహవాన్, సహోదర హీనః, అగ్నిమాంద్యాది రోగీ, తటాక కూపాదిషు జలాదిగండః, పాపయుతే రోగవాన్, క్షీణచంద్రే పాపఫలవాన్, శుభయుతే బలవాన్, అరోగీ॥**

**తా॥** దరిద్రం-36 సం॥నందు విధవాస్త్రీ సంపర్కం - పాపగ్రహముతో కలసిన పాపకర్మలుచేయువాడు - రాహు, కేతువులతో కలసిన దరిద్రం- కోపిష్టి - శతృకలహం - సోదరులు లేనివాడు - ఉదరవ్యాధి - జలగండం - క్షీణచంద్రుడైన పాపఫలితం - శుభులతో కలసిన ఆరోగ్యం.

## సప్తమందు చంద్రుడున్న ఫలితములు

**-మృదుభాషీ, పార్శ్వ నేత్రః, ద్వాత్రింశద్వర్షే స్త్రీ యుక్తః, స్త్రీలోలః, స్త్రీమూలేన గ్రంధి శస్త్రాదిపీడా, రాజప్రాసాదలాభః, భావాధిపే బలయుతే స్త్రీద్వయం, క్షీణ చంద్రే కళత్రనాశః, పూర్ణచంద్రేబలయుతే, స్వోచ్ఛే ఏకదారవాన్, భోగలబ్ధః॥**

**తా॥** మృదువుగా మాట్లాడువాడు - మెల్లకన్ను - 32 సం॥ నందు వివాహము - స్త్రీ లోలుడు - స్త్రీ వలన రోగములు - ప్రభుత్వం వలన లాభం - భావాధిపతి బలంగాయున్న ఇద్దరు భార్యలు. క్షీణచంద్రుని వలన భార్యావియోగం - పూర్ణచంద్రుడు బలముగా నున్నచో ఒకే భార్య - భోగం.

## అష్టమందు చంద్రుడున్న ఫలితములు

**-అల్పవాహనవాన్, తటాకాదిసు గండః, స్త్రీమూలేన బంధుజనపరిత్యాగీ, సర్వేస్వోచ్ఛే దీర్ఘాయుః, క్షీణేవా మధ్యాయుః॥**

**తా॥** స్వల్ప వాహనములు – జలగండం – స్త్రీ వలన బంధువులతో విరోధం – స్వనక్షత్రమందు, ఉచ్చరాశియందున్న దీర్ఘాయువు – క్షీణుడైనచో మధ్యమాయువు.

## నవమమందు చంద్రుడున్న ఫలితములు

**–బహుశృతవాన్, పుణ్యవాన్, తటాకగోపురాది నిర్మాణ పుణ్యకర్తా। పుత్ర భాగ్యవాన్, పూర్ణచంద్రే బలయుతే బహుభాగ్యవాన్। పితాదీర్ఘాయుః। పాపయుతే పాపక్షేత్రే భాగ్యహీనః। నష్ట పితరౌ॥**

**తా॥** అనేకమంది వలన ఎన్నో విషయములు తెలిసినవాడు – పుణ్యవంతుడు – తటాకం – గోపురం మొదలగు ప్రజోపయోగ కర్మలు చేయువాడు – పుత్రవంతుడు – పూర్ణచంద్రుడు బలవంతునితో కలసిన గొప్పధనవంతుడగును. తండ్రి దీర్ఘాయువు – పాపులతో కలసిన పాపస్థానమునందున్న దరిద్రుడు – తల్లిదండ్రులు లేనివాడు అగును.

## దశమమందు చంద్రుడున్న ఫలితములు

**విద్యావాన్, పాపయుతే సప్తవింశతి వర్షే విధవా సంగమేన జనవిరోధీ। అతిమేధావీ। సత్కర్మనిరతః। కీర్తిమాన్, దయావాన్। భావాధిపే బలయుతే విశేష సత్కర్మ సిద్ధిః। పాపనిరీక్షితే పాపయుతే దష్కృతిః। కర్మవిఘ్నకరః॥**

**తా॥** విద్యావంతుడు – పాపులు కలసిన 27సం॥నందు విధవాస్త్రీ సంగమము వలన అపఖ్యాతి। అతి మేధావి – మంచి కర్మలు చేయువాడు – కీర్తి – దయగలవాడు – భావాధిపతి బలవంతునితో కలసిన విశేష కార్యములు చేయువాడు – పాపులచే చూడబడిన, కలసిన కర్మభ్రష్టుడగును.

## ఏకాదశమమందు చంద్రుడున్న ఫలితములు

**–బహుశృతవాన్, పుత్రవాన్, ఉపకారీ। పంచవింశతి వర్షే పుత్రబహుళ యోగః। గుణాఢ్యః । భావాధిపే బలహీనౌ బహుధనవ్యయః బలయుతే లాభవాన్। లాభేచంద్రే నిక్షేపలాభః। శుక్రయుతేన నరవాహన యోగః । బహువిద్యావాన్, క్షేత్రవాన్, అనేక జనరక్షణ భాగ్యవాన్॥**

**తా॥** అనేకమంది శత్రువులు గలవాడు – ఉపకారి – 25సం॥నందు పుత్రలాభము – గుణవంతుడు – భావాధిపతి బలహీనముగా నున్న ధనవ్యయం ఎక్కువ – బలవంతునితో కలసిన లాభము పొందును – నిధి దొరుకును – శుక్రునితో కలసిన గొప్ప వాహనయోగము, సేవకులు – విద్యావంతుడు – స్థలములు గలవాడు – ఇతరులను పోషించువాడు.

## ద్వాదశమందు చంద్రుడున్న ఫలితములు

**–దుర్భోజనః, దుష్పాత్రవ్యయః కోపోద్భవ వ్యసన సమృద్ధిమాన్, స్త్రీరోగ యుక్తః। అన్నహీనః, శుభయుతే విద్వాన్, పాపశతృయుతే పాపలోకః। శుభ మిత్రయుతే శ్రేష్ఠలోకవాన్।**

**తా॥** చెడు తిళ్ళు తినువాడు – అనవసర వ్యయం – కోపం – వ్యసనములు – సుఖరోగములు – అన్నహీనుడు –శుభులు కలసిన విద్వాంసుడు – పాప, శతృ గ్రహములు కలసిన నరకప్రాప్తి –శుభ, మిత్ర గ్రహములు కలసిన ఉత్తమజన్మ.

# 3. లగ్నమందు కుజుడున్న ఫలితములు

**–దేహే వ్రణం భవతి, దృఢగాత్రః, చౌరబుభూషకః, బృహన్నాభి, రక్తపాణిః శూరోబలవాన్ మూర్ఖః, కోపవాన్, ధనవాన్, చపలః, చిత్రరోగీ, దుర్జనః, స్వోచ్ఛే స్వక్షేత్రే ఆరోగ్యం, దృఢగాత్రవాన్, రాజసన్మాన కీర్తిః। దీర్ఘాయుః, పాప శతృయుతే అల్పాయుః, స్వల్ప పుత్రవాన్, వాతశూలాది రోగః । దుర్ముఖః, స్వోచ్ఛే లగ్నబుక్షే ధనవాన్, విద్యావాన్, నేత్ర విలాసవాన్, పాపయుతే పాపక్షేత్రే పాపదృష్టియుతే నేత్ర రోగః॥**

**తా॥** శరీరమునందు వ్రణములు – గాయములు – దృఢశరీరము – చౌర్యముగా తినువాడు – లోతైన బొడ్డు – ఎర్రటి అరచేతులు – ధైర్యము గలవాడు – మూర్ఖుడు – కోపిష్టి – ధనవంతుడు – చపలుడు – చిత్రమైన రోగములు కలవాడు – దుర్జనుడు – స్వోచ్ఛ స్వక్షేత్రములందు ఆరోగ్యం సన్మానం – కీర్తి – దీర్ఘాయువు – పాపశతృ సంబంధం వలన అల్పాయువు–స్వల్పసంతానం–వాత, శూలరోగము స్వనక్షత్రయ

మందున్న ధనవంతుడు – విద్యావంతుడు మంచి నేత్రములు కలవాడు – పాపులతో కలసిన నేత్రరోగం పాపులు చూచినా ఇదే ఫలితము –

## ద్వితీయమందు కుజుడున్న ఫలితములు

**–విద్యాహీనః, లాభవాన్। షష్ఠాధిపేన యుతశ్చేత్ నేత్ర వైపరీత్యం భవతి। శుభదృష్టే పరిహారః। స్వోచ్చ స్వక్షేత్రే విద్యావాన్, నేత్ర విలాసః, పాపయుతే, పాపదృష్టే నేత్రరోగః॥**

**తా॥** విద్యాహీనుడు – లాభములు పొందువాడు 6వ స్థానాధిపతితో కలసిన నేత్రరోగి – శుభులచే చూడబడిన దోష పరిహారమగును – స్వోచ్చ స్వక్షేత్రములందున్న విద్యావంతుడు అందమైన కళ్ళు – పాపగ్రహ సంబంధము వలన నేత్రరోగము

## తృతీయమందు కుజుడున్న ఫలితములు

**–స్వస్త్రీ వ్యభిచారిణీ, శుభదృష్టే నదోషః, అనుజహీనః। ద్రవ్యలాభః, రాహు కేతుయుతే వేశ్యాసంగమః। భ్రాతద్వేషీ, క్లేశయుతః। అల్ప సహోదరః, పాపయుతే, పాపదృష్టే భ్రాతృనాశః। ఉచ్చే స్వక్షేత్రే శుభయుతే భ్రాతా దీర్ఘాయుః। ధైర్య విక్రమవాన్, యుద్ధేశూరః, పాపయుతే మిత్రక్షేత్రే ధృతిమాన్॥**

**తా॥** భార్య వ్యభిచారిణి – శుభదృష్టి యున్నచో దోష నివారణ – ధనలాభం – రాహు, కేతువులతో కలసిన వేశ్యా సంగమం – సోదర ద్వేషి – కష్టములు – తక్కువ సోదరులు – పాపులతో కలసినా, చూడబడినా సోదర నాశనం – ఉచ్ఛ, స్వక్షేత్రములందున్న సోదరుడు దీర్ఘాయువు ధైర్యవంతుడు, పాపులతో కలసి మిత్ర క్షేత్రమందున్న ధీరుడగును.

## చతుర్థమందు కుజుడున్న ఫలితములు

**– గృహచ్ఛిద్రం, అష్టమేవర్షే పిత్రారిష్టం, మాతృరోగీ, నిరోగీ, క్షేత్రహీనః। ధనధాన్యహీనః। జీర్ణ గ్రహవాసః, ఉచ్చే స్వక్షేత్రే శుభయుతే మిత్రక్షేత్రే వాహనవాన్, క్షేత్రవాన్ మా తాదీర్ఘాయుః । నీచబుక్షే పాప మృత్యుయుతే మాతృనాశః। సౌమ్యయుతే వాహన నిష్టవాన్। బంధుజనద్వేషీ। స్వదేశ పరిత్యాగీ, వస్త్రహీనః॥**

**తా॥** ఇంటియందు అనేక సమస్యలు, జాతకుని 8వ సం॥ తండ్రికి అరిష్టము. తల్లికి అనారోగ్యం, జాతకునికి ఆరోగ్యం, భూములు – స్థలములు ఉండవు – దరిద్ర బాధ – పాడుబడిన పాత ఇంట్లో నివాసం ఉచ్ఛ, స్వక్షేత్ర, మిత్రక్షేత్రములందుండి, శుభులతో కలసిన భూములుండును. వాహనములుండును. తల్లికి దీర్ఘాయువు. నీచయందుండి, పాప సంబంధమున్న తల్లికి అరిష్టం. శుభులతో కలసిన వాహనములుండును. బంధువులను, జనులను ద్వేషించును. తన జన్మస్థానమును వదలి ఇతర దూర ప్రాంతములందు నివసించును. వస్త్రములు – చిరగడమో, కాలడమో జరిగి మనసు బాధపడును.

## పంచమమందు కుజుడున్న ఫలితములు

**–నిర్ధనః, పుత్రాభావః। దుర్మార్గీ రాజకోపః। షష్ఠవర్షే ఆయుధేన కించిద్దండకాలః। దుర్వ్యసన జ్ఞానశీలవాన్। మాయావాదీ। తీక్ష్ణధీః। ఉచ్చే స్వక్షేత్రే పుత్రసమృద్ధిః। అన్నదాన ప్రియః। రాజాధికార యోగః। శతృపీడా। పాపక్షేత్రే పాపయుతే పుత్రనాశః, బుద్ధిభ్రంశాది రోగః రంధ్రేశే పాపయుతే పాపీ।వీరః। దత్తపుత్రయోగః॥**

**తా॥** దరిద్రత – సంతాన విచారము – దుర్మార్గుడు – రాజకోపము (ప్రభుత్వంతో విరోధం) 6వ సం॥నందు ఆయుధభయం – వ్యసని– జ్ఞాని – మాయావది (అద్వైతి) – సుశితమైన మేధాసంపత్తి – ఉచ్ఛ స్వక్షేత్రమందు పుత్రసమృద్ధి – అన్నదాన ప్రియుడు – రాజయోగం – శతృపీడ – పాపగ్రహ సంబంధము వలన సంతాన విచారము – బుద్ధి చాంచల్యము – అష్టమాధిపతి పాపులతో కలసిన పాపి – ధైర్యము గలవాడు – దత్తపుత్రయోగము

## షష్ఠమందు  కుజుడున్న ఫలితములు

**–ప్రసిద్ధ: కార్యసమర్థః, శతృహంతా పుత్రవాన్। సప్తవింశతి వర్షే కన్యకాశ్వది యుతః । ఉష్ణవాన్ శతృక్షయః। పాపబుక్షే పాపయుతే పాపదృష్టే పూర్ణ ఫలాని। వాత శూలాది రోగః। బుధక్షేత్రయుతే కుష్టరోగః। శుభదృష్టే పరిహారః॥**

**తా॥** ప్రఖ్యాతి పొందువాడు - కార్యసమర్థుడు - శత్రువులను జయించువాడు - కుమారులు కలవాడు అగును. 27 సం॥ నందు వివాహము, వాహనములు కలుగును. వేడి శరీరతత్త్వము, పాపరాశులందు, పాపగ్రహములతో కలసిన, పాపగ్రహ దృష్టి పొందినా పైన చెప్పిన శుభ ఫలితములు జరుగును, వాతరోగము, నొప్పుల వ్యాధి ఉండును. బుధక్షేత్రమందున్నచో చర్మరోగముండును. శుభదృష్టియున్నచో కొంతమేర దోషము తగ్గును.

## సప్తమమందు కుజుడున్న ఫలితములు

**-స్వదార పీడా, పాపర్క్షే పాపయుతే, స్వక్షేత్రే స్వదారహానిః। శుభయుతే జీవతి, పత్న్యాస్త్రీ నాశః। విదేశపరః, ఉచ్చమిత్ర స్వక్షేత్ర శుభయుతే పాపక్షేత్రే ఈక్షణవశతాత్కళత్రనాశః, అథవా చోర వ్యభిచార మూలేన కళత్రాంతర దుష్టస్త్రీ సంగః। భగచుంబనవాన్, చతుష్పాదమైథునవాన్, మద్యపాన ప్రియః। మంద యుతే దృష్టే శిశ్నచుంబన పరః। కేతుయుతే రజస్వలా స్త్రీ సంభోగ। తత్రశత్రుయుతే బహుకళత్ర నాశః। అవీరః అహంకారీవా, శుభదృష్టే న దోషః।**

**తా॥** భార్యాపీడ-పాపగ్రహములతో కలసిన, స్వనక్షత్రమందున్న భార్య వియోగము-శుభ సంబంధము వలన భార్య జీవించియుండును. విదేశమునందు గాని, దూరప్రాంతమునందుగాని నివసించును. శుభసంబంధము వలన వ్యభి చారముచే మరొక స్త్రీ భార్య అగును. పశురతి చేయువాడు-మద్యపానము నందు అమితప్రేమగలవాడు-శని సంబంధము వలన శిశ్నచుంబనము చేయువాడు - కేతువుతో కలసిన రజస్వలా సంభోగి-శత్రుగ్రహముతో కలసిన అనేకమంది భార్యలు గలవాడు-పిరికివాడు-అహంకారి-అగును. శుభదృష్టియున్నచో దోషము నివారణమగును.

## అష్టమమందు కుజుడున్న ఫలితములు

**-నేత్రరోగీ, అర్థాయుః । పిత్రారిష్టం, మూత్రకృచ్ఛ్ర రోగః । అల్పపుత్రావన్ - వాత శూలాదిరోగః। దార సుఖయుతాః। శుభయుతే దేహారోగ్యం। దీర్ఘాయు**

**మగుష్యాది వృద్ధిః। పాపక్షేత్రే పాపయుతే ఈక్షణవశాత్ వాతక్షయాది రోగః। మూత్రకృచ్ఛ్రాధిక్యంవా। మధ్యమాయుః। భావాధిపే బలయుతే పూర్ణాయుః॥**

**తా॥** నేత్రరోగి – 60 సం॥లు జీవించును. తండ్రి బాల్యము నందే మరణించును. మూత్ర కోశరోగము, తక్కువ మగసంతానము – వాతము – కడుపునొప్పి। భ్రాతృ సుఖముండును. శుభులు చూచిన ఆరోగ్యము. దీర్ఘాయువు కలుగును. పాపగ్రహ సంబంధమున్న వాతరోగము – క్షయ లేదా మూత్ర కోశరోగములు – మధ్యమాయువు. భావాధిపతి బలముగానున్నచో దీర్ఘాయువు కలుగును.

## నవమమందు కుజుడున్న ఫలితములు

**–పుత్రారిష్టం। భాగ్యహీనః। ఉచ్ఛస్వక్షేత్రే గురుణా రోగః॥**

**తా॥** బాల్యమునందు కొడుకు మరణించుటగాని, తండ్రికి దూరముగా పెరుగుట, తండ్రితో విరోధముగాని జరుగును. దురదృష్టము వెంటాడుచుండును. తనకంటే పెద్దవారయిన, పూజనీయులగు స్త్రీలతో సంగమము చేయును.

## దశమమందు కుజుడున్న ఫలితములు

**–జనవల్లభః, భావాధిపే బలయుతే భ్రాతా దీర్ఘాయుః, విశేష భాగ్యవాన్। ధ్యానశీలవాన్, గురుభక్తియుతః, పాపయుతే కర్మ విఘ్నవాన్। శుభయుతే శుభక్షేత్రే కర్మసిద్ధిః। కీర్తి ప్రతిష్ఠావాన్। అష్టాదశవర్షే ద్రవ్యార్జన సమర్థః। సర్వసమర్థః దృఢ గాత్రః, చోరబుద్ధిః, పాపక్షేత్రే పాపయుతే కర్మవిఘ్నకరః। దుష్కృతిః। భాగ్యేశ కర్మయుతే మహారాజయోగః। గురుయుతే గజాంతైశ్వర్యవాన్, భూసమృద్ధిమాన్॥**

**తా॥** జనులకు ఇష్టుడు – భావాధిపతి బలముగానున్న సోదరుడు దీర్ఘాయువు – విశేష భాగ్యవంతుడు – ధ్యానము చేయువాడు – గురుభక్తి కలవాడు – పాపగ్రహ సంబంధమువలన కర్మభ్రష్ఠుడు – శుభగ్రహ సంబంధము వలన కర్మసిద్ధి – కీర్తి – 18సం॥ నుంచి ధనము సంపాదించువాడు – సమర్థుడు – దృఢగాత్రుడు – చోరబుద్ధి, పాపక్షేత్రమందు పాపగ్రహముతో కలసిన ఏ పనీచేయనివాడు, విఫల ప్రయత్నములు

– 9–10 అధిపతులు కావలసిన గొప్పయోగము – గురునితో కలసిన గొప్ప ధనయోగము – భూసంపద కలుగును.

## ఏకాదశమందు కుజుడున్న ఫలితములు

**–బహుకృత్యవాన్, ధనీ। ఆశులాభవాన్, స్వగుణీ, క్షేత్రేశయుతే రాజాధి పత్యవాన్। శుభద్వయయుతే మహారాజ్యాధిపత్యయోగ: భ్రాతృ విత్తవాన్।**

**తా॥** అనేక వ్యాపారములు చేయును – ధనవంతుడు – సులభముగా ధనము సంపాదించును. గుణవంతుడు ఆ స్థానాధిపతితో కలసిన ఉన్నత పదవి – మంచి ఉద్యోగము లేదా గొప్పకీర్తి – ఇద్దరు శుభులతో కలసిన ముద్రాధికారం – సోదరునకు సంపదవృద్ధి సంభవించును.

## ద్వాదశమందు కుజుడున్న ఫలితములు

**–ద్రవ్యాభావ: । వాతపిత్తదేహ:। పాపయుతే డాంభిక:।**

**తా॥** దరిద్రుడు, వాత – పైత్యముల వలన రోగపీడితుడు, పాపులతో కలసిన గొప్పలు పలుకువాడు – అగును.

# 4. లగ్నమందు బుధుడున్న ఫలితములు

**విద్వాన్, వివాహాది బహుశృతవాన్, అనేక దేశ సార్వభౌమ: మంత్రవాది, పిశాచోచ్చాటన సమర్థ:। మృదుభాషీ, క్షమీ, దయావాన్, సప్తవింశతి వర్షే తీర్థయాత్రా యోగ:, బహులాభవాన్, బహువిద్యావాన్, పాపయుతే పాపక్షేత్రే దేహరోగ:। పిత్తపాండురోగ:। శుభయుతే శుభక్షేత్రే దేహారోగ్యం। స్వర్ణకాంతి దేహ:। జ్యోతిష శాస్త్ర పఠితా। అంగహీన:। సజ్జనద్వేషీ, నేత్రరోగీ, సప్తదశవర్షే భ్రాతృణా మన్యోన్య కలహ:। వంచక:। ఉచ్ఛ స్వక్షేత్రే భ్రాతృసౌఖ్యం। శ్రేష్ఠలోకం గమిష్యతి। పాపయుతే, పాపదృష్టే, నీచఋక్షే పాపలోకం గమిష్యతి। – శయ్యాసుఖ వర్జిత:। క్షుద్ర దేవతోపాసక:। పాపమందాదియుతే వామనేత్రే హాని:। షష్ఠేశయుతే వా నదోష:। అపాత్ర వ్యయవాన్, పాపహా, శుభయుతే నిశ్చయేన ధనధాన్యాది**

**మాన్, ధార్మిక బుద్ధిః, శాస్త్రవిత్ గణిత శాస్త్రజ్ఞః సౌఖ్యవాన్। తర్కశాస్త్రవిత్, దృఢగాత్రః॥**

**తా॥** పండితుడు – అనేక విషయములు తెలిసినవాడు – అనేక దేశములు తిరుగువాడు – మాంత్రికుడు – పిశాచములను సైతము ఉచ్చాటన చేయుటయందు సమర్థత గలవాడు – మృదువుగా మాట్లాడువాడు – దయా, క్షమాగుణము కలవాడు, అనేక లాభములు పొందువాడు – పాపులతో కలసిన, పాపక్షేత్రమందున్న అనారోగ్యం – పైత్య, పాండు రోగములు – శుభులతో కలసిన మంచి దేహకాంతి – ఆరోగ్యము – జ్యోతిష శాస్త్ర పాండిత్యము – నేత్రరోగము – అంగవికలత – 17 సం॥నందు సోదరులతో వివాదము – వంచన, శయ్యాసుఖము లేనివాడు – క్షుద్రదేవతోపాసన – శనితో కలసిన ఎడమకంటికి అనారోగ్యం – అనవసర ధనవ్యయం – శుభగ్రహ సంబంధము వలన – ధనవృద్ధి – ధార్మికబుద్ధి – గట్టి శరీరము – గణిత శాస్త్ర జ్ఞానము – సుఖి – తర్కశాస్త్రము తెలిసినవాడు, చమత్కారముగా మాట్లాడువాడు – బహు నేర్పరితనముతో మాట్లాడువాడు అగును.

## ద్వితీయమందు బుధుడున్న ఫలితములు

**–పుత్రసమృద్ధిః। వాచాలకః, వేదశాస్త్ర విచక్షణః। సంకల్పసిద్ధః। ధనీ, గుణాఢ్యః। పంచదశవర్షే బహులాభప్రదః, పాపయుతే పాపక్షేత్రే అరినీచగో విద్యాహీనః। క్రూరవాన్, పవన వ్యాధిః। శుభయుతే వీక్షణాద్ధనీ, గురుణాయుతే వీక్షితే వా గణిత శాస్త్రాధికారీ సంపన్నః॥**

**తా॥** పుత్రసంతానము కలవాడు, ఎక్కువగా మాట్లాడువాడు, వేదశాస్త్రములు తెలిసినవాడు, కోరికలను నెరవేర్చకొనువాడు, ధనవంతుడు, గుణవంతుడు అగును. 25వ సం॥న అనేక లాభములు పొందును. వివిధ కళలను నేర్చును.

పాపక్షేత్రమందున్ననూ, పాపులతో కలసిననూ, నీచ, శత్రు క్షేత్రమందున్ననూ విద్యాహీనుడగును. చదివిన చదువు ఉపయోగపడదు. క్రూర స్వభావము కలవాడు, వాతరోగి, అగును. శుభసంబంధమున్న ధనవంతుడు, గురునితో కలసిననూ, చూడ బడిననూ గణితశాస్త్రమందు ప్రావీణ్యము సంపాదించి ధనవంతుడగును.

## తృతీయమందు బుధుడున్న ఫలితములు

**-భగినీ సామాన్యః, వాతశరీరీ, అన్న హీనః, అల్పభాగ్యః। చతుర్వింశతి వర్షే రాజదండేన ద్రవ్యచ్ఛేదః। గోమహిష్యాదిహీనః, పిశునః, మేధావీ, సహోదర వృద్ధిః॥**

**తా॥** సోదరి సామాన్య జీవితం – వాత శరీరం – స్వల్ప ధనప్రాప్తి – 24 సం॥ ధననష్టం – వాహన గృహహీనుడు – లోభి – మేధావి – సోదరవృద్ధి కలవాడగును.

## చతుర్థమందు బుధుడున్న ఫలితములు

**-హస్త చాపల్యవాన్, ధైర్యవాన్, విశాలాక్షః, పితృమాతృసౌఖ్యయుతం, జ్ఞానవాన్। సుఖీ। షోడశవర్షే ద్రవ్యాపహార రూపేణ అనేక వాహనవాన్। భావాధిపే బలయుతే ఆందోళికా ప్రాప్తిః। రాహుకేతు శనియుతే వాహనారిష్టవాన్। క్షేత్రసుఖ వర్జితః, బంధుకులద్వేషీ, కపటీ॥**

**తా॥** చేతివాటము గలవాడు – ధైర్యవంతుడు – విశాలనేత్రములు – తల్లిదండ్రుల వలన సౌఖ్యము – జ్ఞాని –భోగి – 16 సం॥నందు చౌర్యముచే వాహనయోగము – భావాధిపతి బలముగానున్న గొప్ప వాహనయోగము – శని, రాహు, కేతువులతో కలసిన వాహన క్షేత్ర నాశనము – కష్టములు – వంచకుడు – బంధుద్వేషియగును.

## పంచమమందు బుధుడున్న ఫలితములు

**-మాతులగండః, మాత్రాదిసౌఖ్యం, పుత్రవిఘ్నం, మేధావీ, మధురభాషీ, బుద్ధిమాన్। భావాధిపే పాపయుతే బలహీనే పుత్రనాశః। దత్తపుత్రప్రాప్తిః। పాపకర్మీ। మంత్రవాదీ॥**

**తా॥** మేనమామకు గండము – మాతృసౌఖ్యము – మేధావి – సంతాన విచారము – చక్కగా మాట్లాడువాడు – బుద్ధిమంతుడు – భావాధిపతి పాపగ్రహ సంబంధము పొంది బలహీనుడైన పుత్ర వియోగము –దత్తపుత్రయోగము – పాపకర్మలు చేయువాడు – మాంత్రికుడు అగును.

## షష్ఠస్థానమందు బుధుడున్న ఫలితములు

**–రాజ్యపూజ్యః, విద్యావిఘ్నః, దాంభికః, వివాద సూరః। త్రింశద్వర్షే బహురాజస్నేహో భవతి। పత్రాది లేఖకః। కుజఋక్షే చర్మరోగీ। శనిరాహుయుతే కేతుయుతే వాతశూలాదిరోగీ। జ్ఞాతి శత్రుకలహః। భావాధిపే బలయుతే జ్ఞాతి ప్రబలః। అలి నీచఋక్షే జ్ఞాతి క్షయః॥**

**తా॥** గౌరవము పొందువాడు – విద్యయందు ఆటంకము లేదా విద్యకు తగిన ఉద్యోగము పొందక పోవుట–గొప్పలు చెప్పుట – వివాదములు కల్పించుట – 30సం॥న ప్రముఖులతో స్నేహము–రచనా పాటవము లేదా లేఖక వృత్తి – కుజ క్షేత్రములందున్న చర్మ రోగము – శని, రాహు, కేతువులతో కలసిన వాతరోగము – కడుపు నొప్పి – బంధువులతో దెబ్బలాటలు, భావాధిపతి బలముగా నున్నచో జ్ఞాతులు ఎక్కువగా నుందురు. కర్కాటకమందుగాని, నీచయందుగాని బుధుడున్న జ్ఞాతులందరూ నశింతురు.

## సప్తమమందు బుధుని ఫలితములు

**–మాతృ సౌఖ్యం, అశ్వాద్యారూఢో, ధర్మజ్ఞః। ఉదారమతిః, దిగంతవిశృత కీర్తిః। రాజపూజ్యః, తత్రశుభయుతే చతుర్వింశతి వర్షే ఆందోళికాప్రాప్తిః। కళత్రమతిః, అభక్ష్య భక్షణః, భావేశే బలయుతే ఏకదారవాన్, దారేశే దుర్బలే పాపఋక్షే కుజాదియుతే కళత్రనాశః, స్త్రీ జాతకే పతినాశః। కళత్రంచర్మ రోగీ। అరూపవతీ॥**

**తా॥** మాతృసౌఖ్యం –వాహనలాభం –ధర్మవేత్త – ఉదార స్వభావము – గొప్పకీర్తి – సన్మానములు శుభగ్రహసంబంధము వలన 24 సం॥నందు వాహనయోగము – భార్యయందిష్టము – ఆచారహీనుడు – భావాధిపతి బలముగానున్నచో ఒకే భార్య యుండును. సప్తమాధిపతి బలహీనుడై, కుజాదిగ్రహములతో కలసిన భార్యగా వియోగము – భార్యకు చర్మరోగము – కురూపి

స్త్రీ జాతకమునకు భర్తృ వియోగము కలుగును

## అష్టమమందు బుధుడున్న ఫలితములు

**–ఆయుష్కారకః, బహుక్షేత్రవాన్‌। సప్తపుత్రవాన్‌, పంచవింశతి వర్షే అనేక ప్రతిష్ఠాసిద్ధిః। కీర్తి ప్రసిద్ధః। భావాధిపే బలయుతే పూర్ణాయుః। అరినీచ పాపయుతే అల్పాయుః, అథవా ఉచ్ఛ, స్వక్షేత్రే వా శుభయుతే పూర్ణాయుః॥**

**తా॥** తక్కువ కాలము జీవించును – స్థలములుండును – ఏడుగురు కుమారులుందురు – 25సం॥ అనేక నిర్మాణములు చేయును. కీర్తిపొందును. భావాధిపతి బలముగానున్నచో పూర్ణాయువు కలగును. నీచ, శతృక్షేత్రములందున్న అల్పాయువు. ఉచ్ఛ – స్వక్షేత్రములందున్న పూర్ణాయువు కల్గును.

## నవమమందు బుధుడున్న ఫలితములు

**–వేదశాస్త్ర విశారదః–సంగీత పాఠకః– దాక్షిణ్యవాన్‌, ధార్మికః। ప్రతాపవాన్‌, బహులాభవాన్‌, పితా దీర్ఘాయుః, తపోధ్యాన శీలవాన్‌॥**

**తా॥** వేద శాస్త్రములు తెలిసినవాడు – సంగీత శాస్త్రము బోధించువాడు – దయగలవాడు – ధార్మికుడు ధైర్యము కలవాడు – అనేక లాభములు పొందువాడు తండ్రి దీర్ఘాయువు – తపస్సు, ధ్యానము ఆచరించువాడు – సద్గుణవంతుడు అగును.

## దశమమందు బుధుడున్న ఫలితములు

**–సత్కర్మ సిద్ధిః – ధైర్యవాన్‌ – బహుకీర్తిమాన్‌ – బహు విత్తవాన్‌। అష్టావింశతి వర్షే నేత్రరోగవాన్‌। ఉచ్ఛ స్వక్షేత్రే గురుయుతే అగ్నిష్టోమాది బహు కర్మవాన్‌। అరిపాపయుతే మూఢకర్మా। విఘ్నవాన్‌। దష్కృతిః, అనాచారః॥**

**తా॥** మంచిపనులు చేయువాడు, పేరు ప్రఖ్యాతులు పొందువాడు. అనేక కోరికలు కలవాడు – 28 సం॥నందు నేత్ర వ్యాధి – ఉచ్ఛ – స్వక్షేత్రములందున్ననూ, గురునితో కలసిననూ మంచి గౌరవ ప్రదమైన ఉద్యోగము – యజ్ఞములు చేయును. శతృ – పాపగ్రహములతో కలసిన ఏ ఉద్యోగము చేయడు – పనులన్నిటియందు ఆటంకములు – పాపకర్మలు – అనాచారము కలుగును.

## ఏకాదశమందు బుధుడున్న ఫలితములు

**-బహుమంగళ ప్రదః, అనేక ప్రకారణ ధనవాన్। ఏకోనవింశతి వర్షాదు పరిక్షేత్రపుత్ర ధనవాన్ - దయావాన్ । పాపబుక్షే పాపయుతే హీనః, మూలేన ధన లోపః। ఉచ్ఛస్వక్షేత్రే శుభమూలేన ధనవాన్॥**

**తా॥** మంగళ కార్యములాచరించువాడు-అనేక విధముల ధనము సంపాదించువాడు -21 సం॥ము దాటిన తరువాత వివాహ-పుత్ర-భూలాభము పొందువాడు- దయగలవాడు-పాపగ్రహ సంబంధము చేత హీనుడు - ధననష్టం - ఉచ్ఛ స్వక్షేత్రములందు ధనికుడు అగును.

## ద్వాదశమందు బుధుడున్న ఫలితములు

**-జ్ఞానవాన్ వితరణశీలః। పాపయుతే చపలతా। నృపజన ద్వేషీ। శుభయుతే ధర్మమూలేన ధనవ్యయః విద్యాహీనః॥**

**తా॥** జ్ఞానము కలవాడు - దానగుణము కలవాడు - పాపగ్రహముతో కలసిన ప్రభుత్వాధికారులతో విరోధము - శుభులతో కలసిన ధర్మ కార్యనిమిత్తము ధన వ్యయము - విద్యాహీనత కలుగును.

# 5. లగ్నమందు గురుడున్న ఫలితములు

**-స్వక్షేత్రే శబ్దశాస్త్రాధికారీ। త్రివేదీ, బహుపుత్రవాన్, సుఖీ, చిరాయుః। జ్ఞానవాన్, ఉచ్ఛే పూర్ణ ఫలాని, షోడశవర్షే మహారాజయోగః, అరినీచపాపానాం క్షేత్రే పాపయుతే నీచకర్మవాన్, మనశ్చలత్వవాన్। మధ్యాయుః। పుత్రహీనః। స్వజనపరిత్యాగీ। కృతఘ్నః గర్విష్ఠః, బహుజన ద్వేషీ, సంచారవాన్, క్లేశభోగీ॥**

**తా॥** స్వక్షేత్రమందు గొప్ప విద్యాయోగము-అనేకమంది పుత్రులు-సుఖి-దీర్ఘాయువు-జ్ఞాని-16 సం॥నందు మంచి యోగము-పాపగ్రహ సంబంధము వలన మనస్సు చంచలము-దుష్కర్మలు-మధ్యమాయువు-పుత్రులు లేకపోవుట-

స్వజనులచే అనాదరం–కృతఘ్నుత–గర్వము–సంచారము చేయుట–కష్టపడి సుఖములననుభవించువాడు అగును.

## ద్వితీయమందు గురుడున్న ఫలితములు

**–ధనమాన్, బుద్ధిమాన్, ఇష్టభాషీ। షోడశవర్షే ధనధాన్య సమృద్ధిః, బహు ప్రాబల్యవాన్, ఉచ్చస్వక్షేత్రే ధనుషి ద్రవ్యవాన్। పాపయుతే విద్యావిఘ్నః। చోర వంచనవాన్, దుర్వచనః। అమృత ప్రియః। నీచ క్షేత్రే పాపయుతే మద్యపాయీ, భ్రష్ఠః, కులనాశకః। కళత్రాంతరయుక్తః, పుత్రహీనః॥**

**తా॥** ధనవంతుడు, బుద్ధిమంతుడు, ఇష్టముగా మాట్లాడువాడు, 16సం॥నందు ధనలాభము, ఎక్కువమందితో పరిచయ, స్నేహములు – ఉచ్చ, స్వక్షేత్రములందున్న సంపద–పాపులతో కలసిన విద్యయందు ఆటంకములు – ఇతరులను మోసగించువాడు – చోరుడు – కఠినముగా మాట్లాడువాడు, అబద్దములాడుటయందు ఇష్టము. నీచక్షేత్రములందు పాపులతో కలసిన త్రాగుబోతు – భ్రష్ఠుడు – కులమునకు చెడ్డపేరు తెచ్చువాడు – రెండవ వివాహము చేసుకొనువాడు – సంతానము లేనివాడు అగును.

## తృతీయమందు గురుడున్న ఫలితములు

**– అతిలుబ్ధః, భ్రాతృవృద్ధిః, దాక్షిణ్యవాన్, సంకల్ప సిద్ధకరః, బంధు దోషకరః, అష్టత్రింశద్వర్షేయాత్రా సిద్ధిః, భావాధిపే బలయుతే భ్రాతాదీర్ఘాయుః , భావాధిపే పాపయుతే భ్రాతృనాశః, ధైర్యహీనః, జడబుద్ధిః, దరిద్రః॥**

**తా॥** పిసినారి– సోదరవృద్ధి– దాక్షిణ్యము గలవాడు–సంకల్పములు నెరవేరును–బంధువులకు హాని చేయువాడు– 38సం॥నందు యాత్ర చేయును. సోదరుడు దీర్ఘాయువు – భావాధిపతి పాపగ్రహ సంబంధముచే భాతృనాశం – పిరికివాడు – జడబుద్ధి– దరిద్రుడు అగును.

## చతుర్థమందు గురుడున్న ఫలితములు

**–సుఖీ, క్షేత్రవాన్, బుద్ధిమాన్, క్షీరసమృద్ధః, సన్మానః। మేధావీ, భావాధిపే బలయుతే భృగుచంద్రయుక్తే శుభవర్గేణ నరవాహనయోగః, బహుక్షేత్రః,**

**అశ్వవాహన యోగః, గృహవిస్తరవాన్, పాపసంబంధాత్ క్షేత్రవాహనహీనః। పరగృహవాసః, క్షేత్రహీనః, మాతృనాశః, బంధుద్వేషీ।।**

**తా॥** సుఖవంతుడు – బుద్ధిమంతుడు – మంచి మనస్సు – క్షీరసమృద్ధి కలవాడు – మేధావి –భావాధిపతి బలవంతుడైనచో శుక్ర–చంద్రులతో కలసి శుభవర్గు పొందిన గొప్ప వాహనయోగము – అనేక స్థలములు – గృహములు – పాపసంబంధమువలన వాహన గృహ హీనత – పరగృహవాసం–తల్లికి అరిష్టం – బంధు ద్వేషము కలుగును.

## పంచమమందు గురుడున్న ఫలితములు

**–బుద్ధిచాతుర్యవాన్, విశాలేక్షణః, వాగ్మీ ప్రలాపీ, అన్నదానప్రియః, కులప్రియః, అష్టాదశవర్షే రాజద్వారేణ సేనాధిపత్యయోగః, పుత్రసమృద్ధిః, భావాధిపే బలయుతే పాపక్షేత్రే అరినీచగే పుత్రనాశః, ఏకపుత్రవాన్, ధనవాన్। రాజద్వారే రాజమూలేన ధనవ్యయః । రాహుకేతు యుతే సర్పశాపాత్ సుతక్షయః । శుభదృష్టే పరిహారః ॥**

**తా॥** తెలివి–పెద్దకళ్ళు–వక్త– అన్నదానము చేయుట యందు ఇష్టము – కుల మందు ఇష్టుడు – 18 సం॥నందు ఉద్యోగము – పుత్రులు – పాపగ్రహసంబంధము వలన ఒకే కుమారుడు – ధనవంతుడు – ప్రభుత్వ వ్యవహారముల రీత్యా ధనవ్యయం –రాహు, కేతు గ్రహములతో కలసిన సంతానరీత్యా విచారము–శుభగ్రహ సంబంధము వలన దోషపరిహారమగును.

## షష్ఠమందు గురుడున్న ఫలితములు

**–శత్రుక్షయః, జ్ఞాతి వృద్ధిః। పౌత్రాదిదర్శనం, వ్రణశరీరః, శుభయుతే రోగాభావః పాపయుతే పాపక్షేత్రే వాతపైత్యాదిరోగః। మందక్షేత్రే రాహుయుతే మహారోగః॥**

**తా॥** శత్రునాశనము – బంధువులు అధికము – మనుమలను చూచును – శరీరమునందు వ్రణములు – శుభగ్రహ సంబంధము వలన ఆరోగ్యం – శనిక్షేత్ర మందు రాహువుతో కలసిన అనారోగ్యం దాత – పైత్యరోగములుండును.

## సప్తమమందున్న గురుని ఫలితములు

**-విద్యాధనేశః, బహులాభప్రదః, చింతాధికః। విద్యావాన్, పాతివ్రత్య భక్తియుత కళత్రః, భావాధిపే బలహీనే రాహు, కేతు, శని, కుజయుజే పాప వీక్షణాద్వా కళత్రాం - తరం। శుభయుతే ఉచ్ఛ స్వక్షేత్రే ఏకదారవాన్। కళత్ర ద్వారా బహువిత్తవాన్। సుఖీ, చతుర్త్రింశద్వర్షే ప్రతిష్ఠా సిద్ధిః॥**

**తా॥** విద్య - ధనము - అనేక లాభములు - మంచి అనుకూలమైన భార్య - భావాధిపతి బలహీనుడైన శని- కుజ - రాహు, కేతువులతో కలసిన ఇద్దరు భార్య లుందురు-శుభగ్రహ సంబంధముచే ఒకే భార్య - భార్యద్వారా ధనప్రాప్తి - సౌఖ్యము - 24 సం॥నందు సత్కర్మలు - గృహలాభము -

## అష్టమమందు గురుడున్న ఫలితములు

**-అల్పాయుః, నీచకృత్యకారీ, పాపయుతే పతితః। భావాధిపే శుభయుతే రంధ్రే దీర్ఘాయుః। బలహీనే అల్పాయుః। పాపయుతే సప్త దశవర్షాదుపరి విధవా సంగమో భవతి। ఉచ్ఛస్వక్షేత్రే దీర్ఘాయుః। బలహీనః। అరోగీ, యోగపురుషః, విద్వాన్, వేదశాస్త్ర విచక్షణః॥**

**తా॥** అల్పాయువు - పాపకార్యములు చేయువాడు - పాపగ్రహ సంబంధము వలన పతితుడు - శుభగ్రహసంబంధము చేత దీర్ఘాయువు పాపగ్రహ సంబంధము వలన విధవాస్త్రీ సంపర్కము - ఉచ్ఛ స్వక్షేత్రములందు ఆరోగ్యం - పాండిత్యం - యోగము కలుగును.

## నవమమందు గురుడున్న ఫలితములు

**- తపస్వీ, సాధుతారూఢః। ధనికః, పంచ త్రింశద్యజ్ఞ కర్తా। పితాదీర్ఘాయుః , సత్కర్మసిద్ధిః, అనేక ప్రతిష్ఠావాన్, బహుజన పాలకః॥**

**తా॥** తపస్సు చేయువాడు - సాధుత్వమును సాధించువాడు - ధనవంతుడు - 35 సం॥నందు యజ్ఞములు - ప్రతిష్ఠవంటి సత్కర్మలు చేయువాడు, తండ్రి దీర్ఘాయువు - అనేకమందిని పోషించువాడు అగును.

## దశమమందు గురుడున్న ఫలితములు

**–ధార్మికః, శుభకర్మకారీ, గీతాపారకః। యోగ్యతావాది, ప్రౌఢకీర్తిః బహుజన పూజ్యః, భావాధిపే బలయుతే విశేషక్రతు సిద్ధిః।పాపయుతే పాపక్షేత్రే కర్మ విఘ్నః। దుష్కృతిః, యాత్రాలాభహీనః॥**

**తా॥** ధర్మము ఆచరించువాడు, శుభకర్మలు చేయువాడు, జ్ఞాని, యోగ్యత గలవారికే ఫలసిద్ధి కలగాలని వాదించేవాడు, కీర్తివంతుడు, ఎక్కువమందిచే గౌరవింపబడువాడు, భావాధిపతి బలముగానున్నచో మంచి ఉద్యోగము చేయును. లేదా యజ్ఞములు చేయును. పాపగ్రహ సంబంధమువలన నిరుద్యోగి అగును. చెడ్డ పనులు చేయును. తీర్థయాత్రలు చేయలేదు.

## ఏకాదశమమందు గురుడున్న ఫలితములు

**విద్వాన్, ధనవాన్, బహులాభవాన్। ద్వాత్రింశద్వర్షే అశ్వారూఢః। అనేక ప్రతిష్ఠాసిద్ధిః।, శుభపాపయుతే గజలాభః। భాగ్యవృద్ధిః, చంద్రయుతే నిక్షేపలాభః॥**

**తా॥** పండితుడు, ధనవంతుడు, అనేక లాభములు పొందువాడు, 32వ సం॥నందు వాహన లాభము, అనేక నిర్మాణములు చేయువాడు, శుభపాప మిశ్ర సంబంధముచే పశులాభము, భాగ్యవృద్ధి, చంద్రునితో కలసిన నిధి నిక్షేపముల వలనగాని, అదృష్టము వలన, స్పెక్యులేషన్ వలన లేదా స్వల్ప ప్రయత్నముచేతనే అధిక లాభము కలుగును.

## ద్వాదశమందు గురుడున్న ఫలితములు

**నిర్ధనః, పతితా, అల్పపుత్రః, గణితశాస్త్రజ్ఞః, సంభోగి।గ్రంధివ్రణీ,అయోగ్యః, శుభయుతే ఉచ్చస్వక్షేత్రే స్వర్గలోక ప్రాప్తిః। ధర్మమూలేన ధనవ్యయః, బ్రాహ్మణ స్త్రీ సంభోగీ, గర్భిణీ సంగమీ॥**

**తా॥** దరిద్రుడు, అనేక గ్రంధములు, సంతానము గలవాడు, గణితశాస్త్రము తెలిసినవాడు, సంభోగ ప్రియుడు, కేన్సరు రోగము, అయోగ్యుడు, ఉచ్చ, స్వక్షేత్రము లందున్న శుభులతో కలసిన ఉత్తమలోకము పొందును. ధర్మబద్ధముగా ధనము వ్యయము చేయును. బ్రాహ్మణ స్త్రీ, గర్భిణీ సంగమము చేయును.

# 6. లగ్నమందు శుక్రుడున్న ఫలితములు

**–దీర్ఘాయుః, దారప్రియః, వస్త్రాలంకార ప్రియః। రూపలావణ్యప్రియః, గుణవాన్। స్త్రీ ప్రియః, ధనీ, విద్వాన్, శుభయుతే అనేక భూషణవాన్, స్వర్ణకాంతి దేహః, పాపయుతే వీక్షితే, నీచాస్తగే వంచకః। వాతశ్లేష్మాదిరోగవాన్। భావాధిపే రాహుయుతే బృహదండోభవతి। వాహనశుభయుతే గజాంతైశ్వర్యవాన్। స్వక్షేత్రేమహారాజయోగః। షష్ఠాష్టమ వ్యయాధిప సంబంధే దుర్బలే స్త్రీ ద్వయం, చంచల భాగ్యః, క్రూరబుద్ధిః॥**

**తా॥** దీర్ఘాయువు – భార్యయందు ఇష్టము – వస్త్రఅలంకార సుగంధములందు ప్రీతి–సౌందర్యప్రియుడు – ధనవంతుడు – పండితుడు–శుభ గ్రహములతో కలసిన అనేక ఆభరణములు చక్కటి బంగారు వంటి దేహకాంతి –పాపసంబందము వలన మోసగాడు –వాతశ్లేష్మరోగి–భావాధిపతి రాహువుతో కలసిన అండరోగము – చతుర్ధ మందు కూడా శుభగ్రహమున్న గొప్ప సంపద, సుఖము–స్వక్షేత్రమందు ముద్రాధి కారము–6–8–12 సంబంధము చేత ఇద్దరు భార్యలు–ధనచంచలత– వక్రబుద్ధి.

## ద్వితీయమందు శుక్రుడున్న ఫలితములు

**ధనవాన్, కుటుంబీ,సుభోజనః।వినయవాన్,నేత్రేవిలాసవాన్,సుముఖః, దయావాన్, పరోపకారీ। ద్వాత్రింశ ద్వర్షే ఉత్తమ స్త్రీ లాభః। భావాధిపే దుర్బలే దుస్థానే నేత్రవైపరీత్యం భవతి। శశియుతే నిశాంధః, కుటుంబహీనో, ధననాశకరః॥**

**తా॥** ధనవంతుడు – చక్కని కుటుంబము, మంచి భోజనము, వినయవంతుడు, కనులయందు సౌందర్యము, మంచిముఖం, దయ, పరోపకార స్వభావము కల వాడగును. 32సం॥నందు ఉత్తమస్త్రీ లాభము, భావాధిపతి దుస్థానమందుండి దుర్బలుడైనచో నేత్రరోగము కలుగును. చంద్రునితో కలసియున్న రేచీకటి వ్యాధి, కుటుంబము లేకపోవుట, ధననాశనము ఏర్పడును.

## తృతీయమందు శుక్రుడున్న ఫలితములు

**–అతిలుబ్ధః, దాక్షిణ్యవాన్। భ్రాతృవృద్ధిః, సంకల్ప సిద్ధిః। పశ్చాత్ సహోదర భావః। క్రమేణ భ్రాతృతత్పరః, విత్తభోగపరః, భావాధిపే బలయుతే ఉచ్చే స్వక్షేత్రే భ్రాతృవృద్ధిః, దుస్థానే భ్రాతృనాశః॥**

**తా॥** లోభి – దాక్షిణ్యము గలవాడు – సోదరులు అధికముగా నుందురు. అనుకున్నవి జరుగును. ధనవాంఛ – సుఖైకబుద్ధి – భావాధిపతి బలముగానున్నచో సోదరవృద్ధి – దు:ఖస్థానములందున్న సోదరనాశనము జరుగును.

## చతుర్థ భావమందున్న శుక్రుని ఫలితములు

**–సౌందర్యవాన్, బుద్ధిమాన్, భ్రాతృసౌఖ్యం। సుఖీ, క్షమావాన్। త్రింశద్వర్షే అశ్వవాహన ప్రాప్తిః। క్షీర సమృద్ధిః భావాధిపే బలయుతే అశ్వాందోళికా కనక చతురంగాది వృద్ధిః। తత్రపాపయుతే పాపక్షేత్రే అరినీచగే బలహీనే క్షేత్ర వాహన హీనః। మాతృక్లేశవాన్। కళత్రాం తరభోగీ॥**

**తా॥** అందగాడు – బుద్ధిమంతుడు, సోదర సౌఖ్యము కలవాడు, సుఖి। క్షమా గుణము కలవాడు, 30వ సంవత్సరమున వాహనయోగము, ద్రవపదార్థముల వలన లాభము, భావాధిపతి బలముగానున్నచో ధనము, ఆభరణములు, వాహన ములు ప్రాప్తించును. పాపగ్రహ సంబంధమువలన నీచ, శత్రుస్థానము లందున్న భూములు లేనివాడు, వాహనము లేనివాడు, తల్లికి కష్టము కలిగించువాడు, పరస్త్రీ సాంగత్యము చేయువాడు అగును.

## పంచమమందున్న శుక్రుని ఫలితములు

**–బుద్ధిమాన్, మంత్రీ, సేనాపతిః। మాతామహీదృశ్వా, యౌవనదార పుత్ర వాన్, రాజసన్మానీ। సుజ్ఞః। ప్రసన్నతా బుద్ధిః, తత్రపాపయుతే పాపక్షేత్రే అరినీచగే బుద్ధిజాడ్యయుతః, పుత్రక్లేశః, తత్రశుభయుతే బుద్ధిమాన్, నీతిమత్పుత్రసిద్ధిః, వాహనయోగః॥**

**తా॥** బుద్ధిమంతుడు – మంచిఉద్యోగము – గవర్నమెంటు, సెక్రటరీ – మంత్రి – అమ్మమ్మను చూచువాడు – కుటుంబి – సన్మానములు – ప్రసన్నబుద్ధి – పాపులతో కలసి పాపక్షేత్రములందున్న, బుద్ధిజాడ్యము – సంతాన విచారము – శుభులతో కలసిన బుద్ధిమంతుడు – నీతిమంతుడైన పుత్రులు – వాహనయోగము.

## షష్ఠమమందున్న శుక్రుని ఫలితములు

**–జ్ఞాతి ప్రజాసిద్ధిః, శతృక్షయః, పుత్రపౌత్రవాన్। అపాత్రవ్యయకారీ। మాయా వాదీ, రోగవాన్, ఆర్యపుత్రవాన్। భావాధిపే బలయుతే శతృజ్ఞాతివృద్ధిః। శతృ పాపయుతే నీచస్థే శతృజ్ఞాతి నాశః॥**

**తా॥** బంధువులధికము – సంతానమధికము – శతృనాశనం – కొడుకులు – మనుమలు కలుగుదురు. అనవసర ఖర్చులు – మాయావాదము – రోగి – ఉన్నతవంశ జననము–భావాధిపతి బలముగా నున్నచో శతృ–బంధువృద్ధి–పాపగ్రహ సంబంధము చేత శతృ–బంధునాశనము కలుగును.

## సప్తమమందున్న శుక్రుని ఫలితములు

**–అతి కాముకః, ముఖచుంబకః, అర్థవాన్। పరదార రతః, వాహనవాన్। సకలకార్యనిపుణః, స్త్రీ ద్వేషీ, జనబంధుకళత్రం। పాపయుతే శతృక్షేత్రే అరినీచగే కళత్రనాశః, వివాహద్వయం, బహుపాపయుతే అనేక కళత్రాంతర ప్రాప్తిః, పుత్రహీనః, శుభయుతే ఉచ్చే స్వక్షేత్రే కళత్రదేశే బహువిత్తవాన్, కళత్ర మూలేన బహుప్రాబల్యయోగః స్త్రీ గోష్ఠిః॥**

**తా॥** అతి కాముకుడు, పెదవులు చుంబించుట యందు ఇష్టము కలవాడు, ధనవంతుడు, పరస్త్రీరతుడు, వాహనవంతుడు, పనులు పూర్తిచేయుటయందు సమర్థుడు, స్త్రీ ద్వేషీ, ఎక్కువమంది స్నేహితులు, బంధువులు కలవాడు, పాపగ్రహసంబంధముండి, శతృ,నీచ స్థానములందున్న భార్యమృతి, రెండు వివాహములు, ఎక్కువమంది పాపులతో కలసిన ఎక్కువ విహములగును. పుత్ర సంతానముండదు, శుభులతో కలసి ఉచ్ఛ, స్వక్షేత్రములందున్న భార్య పుట్టింటివారి వలన ధనవృద్ధి, అత్తవారి ఊరునందు ధనలాభము, భార్యామూలకముగా కీర్తి, స్త్రీలతో గోష్ఠులు సంభవించును.

## అష్టమమందున్న శుక్రుని ఫలితములు

**–సుఖీ, చతుర్థవర్షే మాతృగండః। అర్థాయుః, రోగి, హితదారవాన్, అసంతుష్ఠః। శుభక్షేత్రే పూర్ణాయుః। పాపయుతే అల్పాయుః॥**

**తా॥** సుఖము పొందువాడు, 4వ సం॥న తల్లికి గండము, 60సం॥లు జీవించు వాడు, రోగి, అనుకూలవతి అయిన భార్య, అసంతృప్తి కలవాడు అగును. శుభ స్థానములందున్న పూర్ణాయువు, పాపులతో కలసిన అల్పాయువు కలుగును.

## నవమమందున్న శుక్రుని ఫలితములు

**ధార్మికః, తపస్వీ, అనుష్ఠానపరః। పాదే బహూత్తమ లక్షణః, ధర్మీ భోగ వృద్ధిః। సుతదారవాన్। పితా దీర్ఘాయుః, తత్రపాపయుతే పిత్రారిష్టవాన్। పాపయుతే పాపక్షేత్రే అరినీచగే ధనహానిః, గురుదారగః, శుభయుతే భాగ్యవృద్ధిః। మహారాజ యోగః, వాహన కామేశయుతే మహాభాగ్యవాన్। అశ్వాందోళ్యాది వాహనవాన్। వస్త్రాలంకార ప్రియః॥**

**తా॥** ధార్మికుడు – తపస్వి – అనుష్ఠానము చేయువాడు –పాదములందు శుభ చిహ్నములుండును. భోగముల ననుభవించును. భార్యపుత్రులతో సుఖించును. తండ్రి దీర్ఘాయువు. పాపులు కలిసిన తండ్రికి మంచిది కాదు. స్థానచలనం – పాపక్షేత్రము లందున్న ధననష్టం – తనకంటే పెద్దవారితో సంగమం– శుభులు కలసిన భాగ్యవృద్ధి – మహారాజయోగం – చతుర్థ – సప్తమాధిపతులు కలసిన మహాభాగ్యం – గొప్ప వాహనయోగం – వస్త్రాలంకారములందు ఇష్టము.

## దశమమందున్న శుక్రుని ఫలితములు

**–బహుప్రతాపవాన్, పాపయుతే విఘ్నకరః, గురు, బుధ చంద్రయుతే అనేక వాహణారోహణవాన్। అనేక ఋతుసిద్ధిః, దిగంత విశృత కీర్తిః, అనేక రాజయోగః, బహుభాగ్యవాన్। వాచాలః॥**

**తా॥** ధైర్యము కలవాడు – పాపులతో కలసిన విఘ్నములు – గురు, బుధ, చంద్రులతో కలసిన అనేక వాహనముల యోగం – కాలోచిత సుఖప్రాప్తి గొప్పకీర్తి – రాజయోగం – ధనవృద్ధి – ఎక్కువగా మాట్లాడు స్వభావముండును.

## ఏకాదశమమందున్న శుక్రుని ఫలితములు

**-విద్వాన్, బహుధనవాన్, భూమిలాభవాన్। దయావాన్, శుభయుతే అనేక వాహనయోగః। పాపయుతే పాపమూలాద్ ధనలాభః। శుభయుతే శుభమూలాద్। నీచఋక్షే పాపరంధ్రేశాదియోగే లాభహీనః॥**

**తా॥** విద్యావేత్త – ధనవంతుడు – భూలాభం – దయావంతుడు – శుభులతో కలసిన అనేక వాహనయోగము – పాపులతో కలసిన పాపకర్మలచే ధనలాభం నీచ క్షేత్రమందున్న, పాపులతో కలసిన అష్టమాధిపతితో కలసిన 'ధననష్టం' కలుగును.

## ద్వాదశమందున్న శుక్రుని ఫలితములు

**-బహుళ దారిద్ర్యవాన్, పాపయుతే విషయలుబ్ధపరః। శుభయుక్తశ్చేత్ బహుధనవాన్, శయ్యాఖట్వాంగాది సౌఖ్యవాన్, శుభలోక ప్రాప్తిః, పాపయుతే నరకప్రాప్తిః॥**

**తా॥** దరిద్రుడు –పాపులతో కలసిన విషయ వాంఛలయందు వ్యసని – శుభులతో కలసిన ధనవంతుడు – శయ్యాది సుఖములు – ఉత్తమ జన్మ – పాపులతో కలసిన నీచజన్మ.

# 7. లగ్నమందు శనియున్న ఫలితములు

**-వాతపిత్త దేహః, ఉచ్చేపురగ్రామాధిపః। ధనధాన్య సమృద్ధిః। స్వర్క్షే పితృ ధనవాన్, వాహనేశ కర్మేశక్షేత్రే బహుభాగ్యం। మహాయోగః, చంద్రమసా దృష్టే భిక్షుకీ వృత్తిః, శుభదృష్టే నివృత్తిః॥**

**తా॥** వాత శరీరము, పైత్య ప్రకృతి, ఉచ్చయందున్న గొప్ప ఉద్యోగము లేదా పదవీయోగము, ధనధాన్య సమృద్ధి మకర, కుంభములందున్నచో వారసత్వరీత్యా లేదా స్వయంకృషితో ధనవంతుడగును. 4–10 అధిపతుల రాశులందున్నచో అనేక సంపదలు కలుగును. చంద్రుని దృష్టి వున్నచో దరిద్రయోగము. గురు–శుక్రుల దృష్టి ఉన్నచో దోషనివారణమగును.

## ద్వితీయమందు శనియున్న ఫలితములు

**ద్రవ్యాభావః, దారద్వయం, పాపయుతే దార వంచనా। మఠాధిపః, అల్ప క్షేత్రవాన్, నేత్రరోగి॥**

**తా॥** దరిద్రత – ఇద్దరు భార్యలు – పాపగ్రహ సంబంధము చేత వంచన చేయువాడు – మఠాధిపతి – నేత్రరోగియగును.

## తృతీయమందు శనియున్న ఫలితములు

**–భ్రాతృ హానికరః, అదృష్టం। దుర్వృత్తః, ఉచ్చ స్వక్షేత్రే భ్రాతృవృద్ధిః, తత్రపాపయుతే భ్రాతృద్వేషీ॥**

**తా॥** సోదరులకు హాని చేయువాడు – అదృష్టవంతుడు – చెడు ప్రవర్తన – ఉచ్చ స్వక్షేత్రము లందు సోదరవృద్ధి – పాపగ్రహ సంబంధము చేత సోదర ద్వేషియగును.

## చతుర్థమందు శనియున్న ఫలితములు

**– మాతృహానిః, ద్విమాతృవాన్, సౌఖ్యహానిః। నిర్ధనః, ఉచ్చ స్వక్షేత్రే నదోషః। అశ్వాందోల్యాద్యారోహి। లగ్నేశే మందే మాతృ దీర్ఘాయుః। సౌఖ్యవాన్। రంధ్రేశయుక్తే మాత్రారిష్టం। సుఖహానిః॥**

**తా॥** మాతృసుఖం తక్కువ – లేదా–ఇద్దరు తల్లులు, సుఖహీనత – దరిద్రత – ఉచ్చస్వక్షేత్రములందు దోషము లేదు–వాహనయోగము–లగ్నాధిపతి కూడా కలసినచో తల్లి దీర్ఘాయువు – సుఖి – అష్టమాధిపతితో కలసిన తల్లికి అరిష్టం – సౌఖ్యహాని॥

## పంచమమందు శనియున్న ఫలితములు

**–పుత్రహీనః। అతిదరిద్రీ, దుర్వృత్తః, దత్తపుత్రీ, స్వక్షేత్రే స్త్రీ ప్రజాసిద్ధిః। గురుదృష్టే స్త్రీ ద్వయం, తత్ర ప్రథమా అపుత్రా। ద్వితీయా పుత్రవతీ, బలయుతే మందే స్త్రీ భిర్యుక్తః॥**

**తా॥** సంతానము లేనివాడు, దరిద్రుడు, అవినీతిపరుడు ఇతరుల సంతానము పెంచుకొనును. స్వక్షేత్రమందున్నచో స్త్రీ సంతానము కలుగును. గురుదృష్టి యున్నచో

ఇద్దరు భార్యలుందురు. మొదటి భార్యకు సంతానముండదు. రెండవ భార్యకు సంతాన ముండును. శని బలవంతుడైనచో ఇతర స్త్రీ సంబంధములుండును.

**పరాశర సిద్ధాంత రీత్యా -**

**శ్లో॥ పంచమే పుత్రలాభంచ బుద్ధిఉద్యమ సిద్ధికృత్॥**

**తా॥** అనగా పంచమ శనివలన పుత్ర సంతానము, తెలివి, గొప్ప ఉద్యోగము సంభవించును. అనుభవములో ఇది నిజమగుచున్నది.

## షష్ఠస్థానమందు శనియున్న ఫలితములు

**- అల్పజ్ఞాతిః, శతృక్షయః, ధనధాన్యసమృద్ధః। కుజయుతే దేశాంతర సంచారో అల్పరాజయోగః। భంగయోగాత్ క్వచిత్ సౌఖ్యం క్వచిత్ యోగ భంగః। రంధ్రేశేమందే అరిష్టం వాతరోగీ, శూలవ్రణదేహీ॥**

**తా॥** తక్కువ బంధువులు - శతృనాశనము - ధనధాన్య సమృద్ధి - కుజునితో కలసిన దేశ విదేశ సంచారము- స్వల్పరాజయోగము - ఒకసారి సుఖము, ఒకసారి దు:ఖము కలుగును. అష్టమాధిపతి, శని కలసిన వాతరోగము - ఉదరవ్యాది

## సప్తమమందున్న శనియున్న ఫలితములు

**-శరీరదోషకారః, కృశకళత్రః, వేశ్యాసంభోగవాన్। అతి దుఃఖీ, ఉచ్ఛ స్వక్షేత్ర గతే అనేక స్త్రీ సంభోగీ, కేతుయుతే స్త్రీ సంభోగీ। కుజయుతే శిశ్న చుంబనపరః। శుక్రయుతే భగచుంబనపరః। పరస్త్రీ సంభోగీ॥**

**తా॥** రోగి, సన్నటి భార్యకలవాడు, దుఃఖితుడు, వేశ్యలతో తిరుగువాడు, ఉచ్ఛ స్వక్షేత్రములందున్ననూ, కేతువుతో కలసిననూ పరస్త్రీ సంబంధముండును. కుజునితో కలసిన హోమోసెక్సువల్ అగును. శుక్రునితో కలసిన భగచుంబనాసక్తి, పరస్త్రీరతుడు అగును.

## అష్టమమందు శనియున్న ఫలితములు

**త్రిపాదాయుః। దరిద్రీ। శూద్రస్త్రీరతః। సేవకః। ఉచ్ఛస్వక్షేత్రే దీర్ఘాయుః, అరినీచగే భావాధిపే అల్పాయుః, కష్టాన్న భోగి॥**

**తా॥** 75 సం॥లు జీవించును. దరిద్రుడు, శూద్రస్త్రీ సంగమము చేయును. చిన్న ఉద్యోగము చేయును. కష్టజీవితము, ఉచ్చస్వక్షేత్రమందున్న దీర్ఘాయువు, శత్రునీచలందు బలహీనుముగా నున్నచో అల్పాయువు అగును.

## నవమమందు శనియున్న ఫలితములు

**-పతితః, జీర్ణోద్ధారకరః, ఏకోనచత్వారింశద్వర్షేతటాక గోపుర నిర్మాణకర్తా, ఉచ్చ స్వక్షేత్రే పితాదీర్ఘాయుః, పాపయుతే దుర్బలే పిత్రారిష్టవాన్॥**

**తా॥** పతితుడు, పాడుబడిన దేవాలయములు తిరిగి ఉద్ధరించువాడు, 39 సం॥న సత్కర్మలు చేయును. ఉచ్చస్వక్షేత్రమందు, శుభసంబంధమున్నచో తండ్రి చిరకాలము జీవించును. పాపయుతుడై దుర్బలుడైనచో తండ్రికి అరిష్టము కలుగును.

## దశమమందు శనియున్న ఫలితములు

**-పంచవింశతి వర్షే గంగాస్నాయీ। అతిలుబ్ధః। పిత్తశరీర। పాపయుతే కర్మవిఘ్నకరః, శుభయుతే కర్మసిద్ధిః।**

**తా॥** 25సం॥నందు గంగాస్నానము చేయును. లేదా తీర్థయాత్ర, దూర ప్రయాణములు చేయును. పిసినిగొట్టు, పైత్యతత్త్వము కలవాడు, పాప గ్రహ సంబంధమున్నచో పనులయందు ఆటంకములు, శుభులతో కలసిన కార్యసిద్ధి.

## ఏకాదశమందు శనియున్న ఫలితములు

**-బహుధనీ। విఘ్నకరః। భూమిలాభః। రాజపూజకః। ఉచ్చే స్వక్షేత్రే వా విద్వాన్॥**

**తా॥** ధనవంతుడు, పనులలో ఆటంకములు ఎక్కువ। స్థిరాస్తులుండును। మంచిపేరు ప్రతిష్ఠలుండును। స్వక్షేత్ర, ఉచ్చ పొందిన విద్యావంతుడు, గొప్ప ఉద్యోగి అవును.

## ద్వాదశమందు శనియున్న ఫలితములు

**-పతితః, వికలాంగః। పాపయుతే నేత్రచ్ఛేదః। శుభయుతే సుఖీ, సునేత్రః। పుణ్యలోక ప్రాప్తిః, పాపయుతే నరకప్రాప్తిః। అపాత్రవ్యయకారీ, నిర్ధనః॥**

**తా॥** భ్రష్టుడు – అంగవైకల్యము – పాపగ్రహములతో కలసిన నేత్రరోగము, శుభులతో కలసిన సుఖవంతుడు, మంచి అందమైన నేత్రములు కలవాడు. పుణ్యలోకమును చేరును. ఉత్తమ జన్మ కలుగును. పాపగ్రహసంబందము వలన నీచజన్మ కలుగును. ధనమును అనవసరముగా ఖర్చు పెట్టును. దరిద్రుడగును.

## 1. తనుభావం

**శ్లో॥ సౌమ్యస్వామి యుతేక్షితం శుభకరం తద్భావ సౌఖ్యప్రదం**
**షష్ఠద్వాదశ రంధ్రనాథ సహితం క్రూరైశ్చ నష్టప్రదం।**
**నీచేవారిపురంధ్రరిప్ప సదనేష్వస్తంగతో వాయదా**
**దౌర్బల్యం త్వధచోచ్చమిత్రగృహః ఖేటోబలం ప్రాప్నుయాత్॥**

**తా॥** లగ్నము శుభగ్రహములతో కూడిననూ, శుభగ్రహములచే చూడబడిననూ శరీరమునకు ఆరోగ్యము, సౌఖ్యము, ఆయుర్ధాయము, సౌందర్యము కలుగును. 6–8–12 స్థానాధిపతులలోన్ననూ, పాపులున్ననూ లగ్నభావము కొంతమేర చెడును. దీని ఫలితముగా అనారోగ్యము, అసౌఖ్యము, కష్టజీవితము, ఆయుర్ధాయము తగ్గుట సంభవించును.

లగ్నాధిపతి ఉచ్చ – స్వక్షేత్ర – మిత్ర క్షేత్రములందున్ననూ, లగ్నమును చూచిననూ శుభ ఫలితములు కలుగును.

లగ్నాధిపతి నీచ – శత్రుక్షేత్రములందు, 6–8–12 స్థానములందున్ననూ, సూర్యునితో కలసి అస్తంగతుడైననూ పాప ఫలితములు కలుగును.

**శ్లో॥ తను స్థానాధిపః కేంద్రే లాభకోణే గతోయది।**
**త్యాగవాన్ ధనవాన్ భోగీ నృపపూజ్యో విశేషతః॥**

**తా॥** లగ్నాధిపతి కేంద్ర స్థానములగు 1–4–7–10 యందుగాని, కోణములగు 5–9 యందుగాని, లాభస్థానము 11నందుగాని ఉన్న ఎడల, జాతకుడు త్యాగి, భోగి, ధనవంతుడు, గొప్ప ఉద్యోగము కలవాడు అగును.

శ్లో॥ లగ్నాత్ కేంద్రగతే చంద్రే విధోః కేంద్రగతే గురౌ।
తత్కేంద్రే భృగుపుత్రశ్చ బహుభోగీభవేన్నరః॥

- జాతక అనుభవసారం

**తా॥** లగ్నమునకు కేంద్ర స్థానములలో చంద్రుడు, చంద్రునికి కేంద్రస్థానములలో గురుడు, గురునికి కేంద్ర స్థానములలో శుక్రుడు ఉన్నచో జాతకుడు బహు భోగమునను భవించును.

శ్లో॥ రంధ్రేశే బలహీనే చ రంధ్రేమంద నిరీక్షితే।
లగ్నే పాపగ్రహైః దృష్టే రోగయుక్తో భవేన్నరః॥

**తా॥** అష్టమాధిపతి బలహీనుడై, అష్టమస్థానమును శని చూచిననూ, లగ్నము పాపగ్రహములచేత చూడబడిననూ జాతకుడు ఏదో అనారోగ్యముచే బాధపడును.

శ్లో॥ లగ్నేశ్వరే శుష్కగతే తధైవ శుష్కగ్రహాణాంచ వనేస్థితేవా
లగ్నాధిపే నాశగతేపి శుష్కః రాశేతనోః కృచ్ఛ్రమతీవ కష్టం॥

- జాతకామృతసారం

**తా॥** లగ్నాధిపతి నిర్జల రాశులందున్ననూ, శుష్కగ్రహములతో కూడిననూ, లగ్నమందు నీరస గ్రహములున్ననూ లగ్నాధిపతి నిర్జలరాశియైన అష్టమమందున్ననూ, జాతకుడు, కృశించిన దేహము గలవాడు, నీరసము గలవాడు అగును.

శ్లో॥ లగ్నాధిపే లగ్నగతే చతుర్థే ధర్మాధిపే ధర్మగతే తనుస్థే।
సురార్యదైత్యార్య యుతేక్షితేచసౌభాగ్యయుక్తస్సతతంహిజాతః॥

-గోపాల రత్నకరం

**తా॥** లగ్నాధిపతి 1-4లోగాని, నవమాధిపతి 1-9లందుగాని యుండి, గురు, శుకులచే చూడబడిననూ, కలసిననూ జాతకుడు జీవితాంతమూ సౌఖ్యవంతుడగును.

## 2. ధనభావం

శ్లో॥ నేత్రేశస్తను నాయకేన సహితః చంద్రాన్వితో దుస్థలే
నేత్రఘ్నస్తమనాయకేన సహితో వామాక్షిహా దుఃస్థలే॥

**లగ్నేశేన ధనేశ్వరే శనియుతే జాత్యంధకో దుఃస్థలే**
**రిష్ఫేభాను సుతోక్షిహాని గదితో వామాక్షిహా భూసుతః॥**

**తా॥** ద్వితీయాధిపతి లగ్నాధిపతితో కలసి, దుస్థానములందు చంద్రునితో కలసిన నేత్రములు పాడగును. రాహు కేతువులతో కలసి 6–8–12 నందున్నచో ఎడమకన్ను చెరచును. 1–2 అధిపతులు కలసి శనితో కలసి 6–8–12నందున్ననూ నేత్రహాని, 12 నందుశని, నేత్రహాని, 12నందు కుజుడు ఎడమనేత్ర హాని.

**శ్లో॥ లగ్నేశే ధనరాశిస్థే, ధనేశే లాభరాశిగే।**
**లాభేశేచ విలగ్నస్థే బహుద్రవ్యార్జితం భవేత్॥** -సర్వార్థ చింతామణి

**తా॥** లగ్నాధిపతి 2నందును, ద్వితీయాధిపతి 11నందు, లాభాధిపతి 1నందును ఉన్న జాతకుడు వివేషముగా ధనము సంపాదించును.

**శ్లో॥ విత్తేశే వ్యయ భావస్థే వ్యయేశే విత్తరాశిగే।**
**లాభరాశిపతౌ దుస్థే మహాన్ భూయాద్ధన వ్యయః॥** -భావార్థరత్నాకరం

**తా॥** 2–12 అధిపతులకు పరివర్తన కలిగి, లాభాధిపతి 6–8–12 స్థానము లందున్నచో జాతకుడు తన ధనమంతయు పోగొట్టుకొని దరిద్రుడగును.

**శ్లో॥ ధనేశే బుధ సంయుక్తే కేతునావీక్షితే యుతే।**
**హేమరత్నాది లాభస్యాత్ ఇతి కేరళ నిర్ణయః॥** - కేరళం

**తా॥** 2వ అధిపతి బుధ కేతువులతో కలసినూ, చూడబడిననూ, ఆభరణములు, బంగారము, రత్నములు జాతకుడు పొందును.

**శ్లో॥ ద్వితీయస్థో సోమసుతో యుక్తియుక్తం వచోభవేత్**
**తత్రైవ సంస్థితో రాహుః విషశాకాన్న భుగ్భవేత్।**
**ద్వితీయస్థో యదికవిః క్షీరభక్ష్యాది భుగ్భవేత్**
**ద్వితీయస్థోథ కేతు గురూ వాచాలో నిపుణోభవేత్॥**- భావార్థ రత్నాకరం

**తా॥** 2నందు బుధుడున్న జాతకుడు, ఎంతో సమయస్ఫూర్తిగా మాటలాడు వాడగును. రాహువు వున్నచో వికృతాహారము భుజించును. శుక్రుడున్నచో సాత్వికా

హారము తినును. 2నందు కేతు గురువులు కలసియున్న యెడల, ఎక్కువగా మాటలాడువాడు, నేర్పరి అగును.

**శ్లో॥ గురుశ్చ ధనకారస్య ధనాధిపతినా సహ**
**సంబంధశ్చ బుధేనాపి ధనయోగమితీ రితిః॥** -జా.సా.

**తా॥** ధనకారకుడయిన బృహస్పతి, 2వ అధిపతితో కలసిననూ, చూడబడిననూ, ధనయోగము పట్టును. బుధునితో సంబంధమున్ననూ జాతకుడు ధనవంతుడగను.

## 3. భ్రాతృభావం

**శ్లో॥ దుఃస్థానగో సోదరనాథ భావగౌ పాపేక్షితౌ సోదర భంగమాహుః**
**లాభస్థితేవాయది సోదరేశే భ్రాతృస్థితే క్రూరఖగేపిసంతః॥**

**తా॥** 3వ అధిపతి, కుజుడు, 6-8-12 స్థానము లందుండి, పాపులచే చూడబడిన సహోదరులుండరు. 11వ స్థానమందు తృతీయాధిపతియున్న సోదరులుందరు. 3నందు క్రూరగ్రహములున్ననూ సహోదరులుందురు.

**శ్లో॥ భ్రాతృ స్థానేశ్వరస్యాపి భ్రాతృణాం కారకేణ వై**
**కుజేన సహసంబంధే భ్రాతృవృద్ధి రితీరితా॥** -భావార్థరత్నాకరం

**తా॥** తృతీయ లాభాధిపతులకు, కుజునకు సంబంధత్రయము పట్టిన (స్థితి-యుతి-దృష్టి) సోదరలాభం కలుగును.

**శ్లో॥ స్త్రీ గ్రహోయదిభతే తృతీయప స్త్రీ గ్రహస్య సంబంధయుతో వా।**
**పూర్వతో పరత శ్శరీరిణ శ్చంచలాక్షి భగినీ భవంవద॥**
-కాళిదాస కేరళం

**తా॥** తృతీయ స్థానమునకుగాని, తృతీయాధిపతికిగాని పాపార్గళం పట్టిన ఎడల సోదర నష్టం కలుగును.

**శ్లో॥ పాపాంతరే తద్దశేతు కారకేతు తథా విధే।**
**తాదృశే భావ నాథేవా సోదరాణాం వినాశనం॥** - జాతకసారం

**తా॥** తృతీయ స్థానమునకు గాని, తృతీయాదిపతికి గాని, పాపార్గళం పట్టిన ఎడల సోదరనష్టం కలుగును.

**శ్లో॥ భ్రాతృస్థానాధిపే మూఢే లగ్నేశే నాశరాశిగే।**
**పాపాన్వితే భ్రాతృ భావే సోదరాణామ భావతా॥** జా॥అ॥సా

**తా॥** భ్రాతృస్థానాధిపతి అస్తంగతుడై, లగ్నాధిపతి అష్టమమందుండిననూ - తృతీయమున సూర్య-శని-రాహులున్ననూ సోదరులుండరు.

**శ్లో॥ నాశస్థితౌ సోదరభావ భౌమౌ**
**పాపేక్షితౌ సోదర నాశమాహుః।**
**పాపర్క్షగౌ పాప సమాగమౌచేత్**
**భ్రాతౄన్ సముత్పాద్య వినాశమాహుః॥** -స॥ చింతామణి

**తా॥** తృతీయమందు పాపులున్ననూ, చూచిననూ, తృతీయస్థానాధిపతి పాపులతో చేరి 6-8-12 రాశులలోనున్ననూ, జాతకునికి సోదర, సోదరీ నష్టము కలుగును.

**శ్లో॥ భ్రాతృపే కారకావాపి శుభయోగనిరీక్షితే।**
**భావేవా బలసంపూర్ణే భ్రాతృణాంవర్ధనం భవేత్॥ -** -స॥ చింతామణి

**తా॥** సోదరస్థానాధిపతీ, కుజుడూ, శుభగ్రహములతో కలసిననూ, చూడబడిననూ - తృతీయభావమునకు శుభగ్రహ సంబంధము కలిగిననూ జాతకునకు సోదర సోదరీ వర్గము కలుగును.

## 4. మాతృభావం

**శ్లో॥ మాతృస్థానే శుభయుతే తదీశే స్వోచ్చరాశిగే।**
**కారకేబలసంయుక్తే మాతుర్దీర్ఘాయురాదిశేత్॥** - శుక్ర కేరళం

**తా॥** చతుర్థ స్థానమునందు శుభగ్రహమున్ననూ, చంద్రుడు శుభగ్రహములతో కలసిననూ, చూడబడిననూ, చతుర్థాతిపతి శుభగ్రహములతో చూడబడిననూ, కలసిననూ, జాతకుని తల్లి పూర్ణాయుర్దాయవంతురాలగును.

శ్లో॥ క్షేత్రేశ సంయుక్త నవాంశనాథే
కేంద్రస్థితే మిత్ర నిరీక్షితే వా।
భౌమాన్వితే భౌమద్రుశాసమేతే
భ్రాతృర్ధన క్షేత్రముదాహరంతి॥

**తా॥** చతుర్థాధిపతి కుజునితో కలసి కేంద్రమందుండగా, లగ్నముకాని, లగ్నాధిపతిగాని చతుర్థాధిపతితో కలసియున్ననూ లేక చూడబడిననూ, కుజుడు రాశ్యంశలయందు ఉచ్చపొందిన జాతకుడు అనేక భూములు, వాహనములు పొందును. సోదరమూలకముగా భూలాభము కలుగును.

శ్లో॥ వాహనేశేన సంయుక్తః కారకో వాహనస్యతు
ఏతేస్థితౌ వాహనేచేద్బహు వాహన ముచ్చతే॥

**తా॥** వాహన స్థానాధిపతి శుక్రునిక్షేత్రమందుగాని, శుక్రనవాంశయందుగాని యుండి, కేంద్రములందుండగా పంచమి – భాగ్యాధిపతులలో ఒకరితో కలసి పాప గ్రహ సంబంధము లేని ఎడల అనేక వాహనములుండును.

శ్లో॥ భావేశ సంయుక్త నవాంశ నాథ
యుక్తాంశపే కేంద్రగతే బలాఢ్యే।
తస్మిన్ శశాంకో యది కేంద్రరాశే
మాతుశ్చ దీర్ఘాయురు దాహరంతి॥ -స॥ చింతామణి

**తా॥** చతుర్థస్థానాధిపతి శుభగ్రహ నవాంశలం దుండి, ఆ నవంశాధిపతి కేంద్ర కోణములందు శుభగ్రహములతో కలసిననూ, చూడబడిననూ తల్లి చిరకాలము జీవించును.

శ్లో॥ మంత్రీ రాజప్రతిమ స్సుఖబంధు సమన్వితో మహావిభవః।
బహుశాస్త్రాక్షత బుద్ధిర్హిబుకే స్యాజ్జీవశశినోశ్చ॥ -సారావళి

**తా॥** చంద్రగురులు చతుర్థమందున్న గొప్ప ఉద్యోగము చేయును. ధనవంతు డగను. గొప్ప విద్యావేత్త బహుసుఖములు పొందువాడు. పదవీయోగము, బంధువు లలో శ్రేష్టుడు అగును.

శ్లో॥ జలాశ్రయోత్పన్న ధనోప లబ్ధిం
కృష్యాంగనా వాహన సూను సౌఖ్యం।
ప్రసూతి కాలే కురుతే కళావాన్
పాతాళ సంస్థో ద్విజదేవభక్తిమ్॥

**తా॥** చతుర్థమందు కారకుడైన చంద్రుడున్న ఎడల ధనవంతుడు, జలము మొ॥ ద్రవపదార్థముల వల్ల, స్వయంకృషివల్ల లాభము పొందువాడు, వాహనములు-కుమారులు కలవాడు, దేవబ్రాహ్మణులయందు భక్తి కలవాడు అగును.

## 5. పుత్రభావము

శ్లో॥ పుత్రీశే స్మరసంస్థితే నవమనాథే నాన్వితే కర్కటే
కన్యాతౌళి వృషస్థితే శశితమే శుక్రేక్షితే వాయుతే।
ఆదౌ స్త్రీ పురుషాలయే స్థితియుతే పుంధృష్టియుక్తేపుమాన్
జీవే పంచమగేఽ ధవా తనుగతే పుత్రోభవేన్నిశ్చయః॥

**తా॥** పంచమాధిపతి - సప్తమందున్ననూ, కర్కటరాశియందు 9వ అధిపతితో కలసినూ, కన్య-తుల-వృశ్చికములలో చంద్రునితో కలసియున్నను, శుక్రునితో చూడబడిననూ, కలసిననూ, ముందు కుమార్తె తరువాత కుమారుడు కలుగును, పురుష గ్రహ దృష్టియున్నముందు కుమారుడు కలుగును. 5లోగాని 1లోగాని గురుదున్న కుమారుడుండును. పంచమభావము శుభసంబంధము పొంది పాపసంబంధము లేనిచో జాతకుడు సంతానము పొందును.

లగ్నాధిపతి 1-2-3 స్థానములందున్నచో జాతకునికి ముందుగా పుత్రుడు జన్మించును. 4లో ఉన్నచో ముందుగా పుత్రిక, తరువాత పుత్రుడు మరల పుత్రిక జన్మింతురు.

పంచమభావమునకు పురుష గ్రహదృష్టి ఉన్నచో పుత్రులు, స్త్రీ గ్రహదృష్టిఉన్నచో పుత్రికలు జన్మింతురు.

3వ స్థానాధిపతి 1-2-3-5-12లో ఉన్నచో సంతానము ద్వారా కొంత విచారము దుఃఖము పొందును.

వృశ్చికములో గురు–శుక్రులు, లగ్నములో బుధ–శనులు ఉన్నచో సంతానము కలుగదు. పంచమకుజుడు సంతాన విచారము నిచ్చును. శుభులతో కలసిన దోషము తొలగును. బలహీనుడైన సూర్యుడు 5లో ఉన్నచో పుత్రుడు కలిగి మరణించును.

జన్మకాలమందు సూర్య–శని–రాహువులు సంతానము లేకపోవుటకు కారణ మైనచో, కులదేవతల శాపముగా భావించి, వారికి శాంతిచేసినచో సంతానము కలుగును.

**శ్లో॥ బుధశుక్రకృతే దోషే సుతాప్తిః శివపూజనాత్।**
**గురుచంద్రకృతే దోషే యంత్రమంత్రౌషధీ బలాత్॥**

**తా॥** బుధ – శుక్రుల దోషము శివపూజవలన తొలగిపోవును. గురుచంద్రుల దోషము మంత్ర, యంత్ర, ఔషధములవలన తొలగిపోవును.

రాహు దోషము కన్యాదానము వలన, రవి దోషము విష్ణుపూజవలన, కేతు దోషము కపిలగోదానము వలన, కుజ–శనుల దోషము రుద్రాధ్యాయ జపాభిషేకముల వలన తొలగి, పుత్రసంతానము కలుగును.

సమస్తదోషములు సంతాన గోపాలమంత్రానుష్ఠానము వలన నశించును. మంగళవార వ్రతము, కామదేవ వ్రతము చేయవలెనని ధర్మశాస్త్ర నిర్ణయమగుచున్నది.

# విశేషములు

ఫలిత జ్యోతిషంలో భావఫలితములు చెప్పడానికి ఎన్నోప్రక్రియలు– గణితములు చెప్పబడ్డాయి. పంచమభావ విషయంలో ప్రధమంగా పుత్రుడు జన్మిస్తాడని చెప్పడానికి ఈ క్రింది విధానం ఉపకరిస్తుంది. సంతాన విషయం గూర్చి సప్తమాంశ చక్రం పరిశీలించాలని శాస్త్ర నిర్ణయం. అయితే అతి సులభంగా కేవలం రాశిచక్రం ఆధారం చేసుకొని ఫలితం చెప్పడం ఈ వ్యాస రచనోద్దేశ్యం.

సూత్రం 1 – పంచమాధిపతి పురుష రాశిలోగాని, పురుషగ్రహనక్షత్రంలోగాని ఉన్నట్లయితే ప్రధమంగా పుత్రజననం కలుగుతుంది. పంచమాధిపతి 6–8 స్థానములలో ఉండరాదు.

**ఉదాహరణ -1** **జననం -1948.11.18**




ఈ జాతకునకు ప్రథమంగా పుత్ర జననం కలిగింది. ద్వితీయ సంతానం కూడా పుత్రుడే. ఇచ్చట పంచమాధిపతి గురుడు పురుషరాశిలో ఉన్నాడు.

**ఉదాహరణ -2** **జననం 1957.5.21**

ర
శు
కు
బు
కే
5
చ
2
గు
రా
ల శ

ఈ జాతకునకు ఇద్దరు పుత్రులు జన్మించారు. పంచమాధిపతి అయిన గురుడు పురుష గ్రహ నక్షత్రమైన ఉత్తరలో ఉన్నాడు.

**ఉదాహరణ -3** **జననం 1960.8.1.**

కు
బు
5
కే
ర శు
3
రా
చ
గు శ
ల

ఈ జాతకునకు ప్రథమం పుత్ర సంతానం – అనంతరం స్త్రీ సంతానం కలిగారు. ఇచ్చట పంచమాధిపతి గురుడు కుటుంబ స్థానంలో పురుష రాశిలో స్వక్షేత్రంలో ఉన్నాడు.

**ఉదాహరణ -4 జననం 1959.6.18.**

| | | |
|---|---|---|
| ర.బు | | కే |
| ల.కు.శు | 4 | |
| రా | చ | శ గు |

ఈ జాతకునికి ప్రథమంగా పుత్ర జననం అయింది. పంచమాధిపతి పురుష గ్రహ నక్షత్రంలో లేదు. పంచమంలో పుత్రకారకుడుగా వక్రించి గురునక్షత్రంలో ఉన్నాడు. పంచమాధిపతి కుజుడు చంద్రరాశిలో ఉన్నాడు. చంద్రుడు ఏకపుత్ర ప్రదుడని జైమిని చదివిన వారికి తెలిసిందే. అయినా ఇక్కడ 2వ సూత్రం ఇలా చెప్పవచ్చు.

సూత్రం – 2 – పంచమస్థానంలో పురుష గ్రహముంటే, అనగా రవి–కుజ–గురు–రాహువులుంటే ప్రథమంగా పుత్రజననం రాహువు పుత్ర సంతానమును, కేతువు స్త్రీ సంతానమునూ ఇచ్చును.

**ఉదాహరణ - 5 జననం - 1961.1.16**

| | | |
|---|---|---|
| కు | ల | కే శు |
| | 5 | ర.బు |
| 5 రా | | గు చ శ |

ఈ జాతకునికి ప్రథమంగా పుత్రజననం. పంచమ రాహువు పుత్ర ప్రదుడయ్యాడు.

**ఉదాహరణ -6** **జననం 1968.7.31.**

రా
శ
కు. ర
శు. బు
6
5
గు
ల
కే. చ

ఈ జాతకునికి ప్రథమంగా పుత్రసంతానం కలిగింది. పంచమాధిపతి శని, కుజుని రాశిలో ఉండడటం చేత సూత్రం ఇక్కడ వర్తించింది.

**ఉదాహరణ -7** **జననం 1948.5.3.**

ర
రా
బు
శు
చ
శ
7
ల. కు
కే
గు R
5

ఈ జాతకునికి ప్రథమంగా పుత్రుడు కలిగాడు. పంచమాధిపతి గురుడు వక్రించి స్వక్షేత్రంలో పురుషరాశిలో నున్నాడు.

**ఉదాహరణ - 8** **జననం 1949.10.7**



ఈ జాతకునికి ప్రథమంగా పుత్రజననం కలిగింది. పంచమాధిపతి కుజుడు, లగ్నంలో చంద్రరాశిలోనున్నాడు. పంచమ స్థానంలో ఉన్న గ్రహం కంటే పంచ మాధిపతినే విశ్లేషించాలి.

**ఉదాహరణ - 9** **జననం 1949.7.7**

| | | |
|---|---|---|
| కు ర.బు | | రా |
| శు | 9 | గు R |
| ల. శ కే | | 5 చ |

ఈ జాతకునికి ప్రథమంగా పుత్రజననం. ఇచ్చట పంచమాధిపతి అయిన గురుడు, లగ్నాధిపతి అయిన రవి నక్షత్రంలో వక్రించి నీచను పొందియున్నాడు.

**ఉదాహరణ- 10** **జననం 1942.1.31**

| | | |
|---|---|---|
| గు R | కు శR | ల బు. కే |
| 5 చ | 10 | ర.శు |
| రా | | |

ఈ జాతకునకు చాలా ఆలస్యంగా ఇద్దరు కుమారులు కలిగారు. పంచమాధిపతి చంద్రుడు పంచమంలోనే ఉన్నాడు. అయితే కుటుంబంలో వక్రించియున్న శని నక్షత్రంలో పుష్యమియందు ఉన్నాడు. అదే ఆలస్యానికి కారణం అయింది.

**ఉదాహరణ - 11** **జననం 1964.2.14**




ఈ జాతకునికి ప్రథమంగా పుత్రుడు కలిగాడు. ఇచ్చట సప్తమాధిపతి శుక్రుడు పంచమంలో ఉచ్చపొందాడు. గురుడు స్వక్షేత్రంలో ఉన్నాడు. శుక్రుడు శని నక్షత్రం లోనూ, గురుడు బుధుని క్షేత్రంలోనూ ఉన్నారు. అయినా గురుని స్వక్షేత్ర స్థితే బలంగా యున్నది. స్త్రీ గ్రహమైన శుక్రుడు ఉచ్చపొంది కలసినా బలం సరిపోలేదు.

**ఉదాహరణ -12** **జననం - 1941.2.24**

గు
శ
కే
ల
ర.బు
12
చ.శు
కు
5
రా

ఈ జాతకునికి ఇద్దరు పుత్రులు. ఇచ్చట పంచమాధిపతి అయిన శుక్రుడు. శని క్షేత్రంలో ఉన్నప్పటికీ పురుష గ్రహమైన కుజుని నక్షత్రం ధనిష్ఠలో ఉన్నాడు.

**ఉదాహరణ -13** **జననం - 1937.3.26**

కే
శు
ర.శ 5
బు
13
గు
చ
ల
కు రా

ఈ జాతకునికి ముగ్గురు పుత్రులు. ఇద్దరు పుత్రికలు, ప్రథమం పుత్రిక, ద్వితీయం పుత్రుడు. పంచమాధిపతి అయిన గురుడు నీచనుపొంది పురుష గ్రహమైన పంచమంలో ఉన్న రవి. నక్షత్రంలో ఉన్న పంచమంలో 2 అనపత్య గ్రహములున్నాయి.

**ఉదాహరణ– 14 జననం 1925.3.31**

| | | |
|---|---|---|
| కు / చ | బు | ల ర.శు |
| 5 రా | 14 | కే |
| | | గు శ |

ఈ జాతకునికి ముగ్గురు పుత్రులు. ఇద్దరు పుత్రికలు ప్రథమం పుత్రిక, ద్వితీయం పుత్రుడు. పంచమాధిపతి అయిన గురుడు నీచనుపొంది పురుష గ్రహమైన పంచమంలో ఉన్న రవి. నక్షత్రంలో ఉన్న పంచమంలో 2 అనపత్య గ్రహములున్నాయి.

**ఉదాహరణ – 15 జననం 1925.3.31**

| | | |
|---|---|---|
| 5 | రా | ల ర.కు బు.శు |
| చ | 15 | గు |
| శR | కే | |

ఈ జాతకునికి ఇద్దరు పుత్రులు. పంచమాధిపతి అయిన బుధుడు, దశమ కేంద్రాధిపతి అయిన, లగ్నమందున్న, పురుష గ్రహమైన, కుజుని నక్షత్రంలో ధనిష్ఠలో ఉన్నాడు.

**ఉదాహరణ : 16** **జననం 1930.1.27**

| | | |
|---|---|---|
| గు | రా | |
| | 16 | ర.బు.శు 5 |
| ల | కే | కు శ చ |

ఈ జాతకునికి ప్రథమంగా పుత్ర జననం. బహుసంతానవంతుడు 2 కుమారులు 6 కుమార్తెలు. పంచమాధిపతి శని, పురుష గ్రహమైన కుజక్షేత్రంలో ఉండి, కేతువు నక్షత్రమైన మూలయందున్నాడు. అందుచేతనే స్త్రీ సంతానం అధికం.

**ఉదాహరణ : 17** **జననం : 1938.3.8**

| | | |
|---|---|---|
| చ కే | కు | ల. శ శు ర.బు |
| 5 | 17 | గు |
| | | రా |

ఈ జాతకునికి ప్రథమంగా పుత్ర జననం. పంచమాధిపతిచే పురుషగ్రహమైన రవి నక్షత్రం కృత్తికలో ఉన్నాడు.

**ఉదాహరణ 18 :** **జననం 1967.1.5**

| | | |
|---|---|---|
| | రా | శ |
| ల.గు R | 18 | శు |
| కు | చ కే | బు.ర 5 |

ఈ జాతకునికి ప్రథమంగా పుత్ర జననం. అయితే వివాహానంతరం 4సం॥లకు సంతానం కలిగింది. లగ్నమందు గురుడు వక్రించియుండటం ఈ ఆలస్యానికి కారణం. పంచామాధిపతి కుజుడు పురుష గ్రహమైన కుజుని నక్షత్రంలో చిత్తలో ఉన్నాడు.

**ఉదాహరణ 19 :** **జననం 1943.8.21**

| | | | |
|---|---|---|---|
| శ / కు ల | చ | | |
| గు.రా | 19 | కే | |
| ర.శు / 5 బు | | | |

ఈ జాతకునికి ఇద్దరు మగపిల్లలు. పంచామాధిపతి బుధుడు పురుషరాశిలో లేకపోయినా, పురుష గ్రహ నక్షత్రమైన ఉత్తరయందున్నాడు.

**సూత్రం-3 :** వృశ్చికలగ్నమునకు పుత్రకారకుడైన గురుడు, కుటుంబ, పంచమాధి పతి అగుచున్నాడు. అంతేగాక నవమకోణము భావాత్ భావము ఉచ్ఛ స్థానము అగుచున్నది. అందుచేత వృశ్చికలగ్నమునకు గురుడు 1-5-9 స్థానము లందున్నచో తప్పక ప్రథమముగా మగ సంతానం కల్గును. అయితే వక్ర-నీచ-6-8 స్థానములు పొందరాదు. వీటివలన సంతానము ఆలస్యముగా కలుగుటకాని, కేవలం స్త్రీ సంతానము కల్గుట కాని జరుగును. నీచ భంగమందు పుత్ర సంతానము కలుగును. గురు + శనుల కలయిక పుత్ర సంతానమును కలిగించును. ఇద్దరూ వక్రించరాదు.

## 6. శతృభావము

**శ్లో॥ షష్ఠేలగ్ననాథశ్చ లగ్నేషష్ఠనాథశ్చ యదిబలే**
**జాతస్య శతృబాహుళ్యం వ్రణబాహుళ్యమాది శేత్॥**

- జ్యో.శా. సంగ్రహం

**తా॥** ఆరవ స్థానమందు లగ్నాధిపతి, లగ్నమందు షష్ఠాధిపతి బలముగానున్నచో జాతకునికి శతృవులు ఎక్కువగా నుందురు. కురుపులు, గాయములు ఎక్కువగా కలుగుచుండును.

శ్లో॥ వాదప్రీతిస్సామయో నిష్ఠురాత్మా
నానారాతి వ్రాత సంతప్త చిత్తః।
నిత్యాలస్య వ్యాకులఃస్యాన్మనుష్యః
శతృక్షేత్రే రాత్రినాధాత్మ జేస్మిన్॥

**తా॥** ఆరవ భావమందు బుధుడున్నచో నిత్యము కలహించువాడు, దీర్ఘరోగి, కఠోరహృదయుడు, శతృవులను బాధించువాడు, సోమరి, మనశ్శాంతి లేనివాడు అగును.

శ్లో॥ షష్ఠే పాపగ్రహ సమన్వితే శతృవాదే పాప సంయుతే।
జాతస్యశతృబాహుళ్యం రోగ బాహుళ్యమాదిశేత్॥

**తా॥** ఆరవ స్థానమందు పాపగ్రహములన్ననూ, ఆ స్థానాధిపతి పాపులతో కలసిననూ జాతకునికి రోగబాధ, శతృబాధయుండును.

శ్లో॥ లగ్నాధిపే ధనలాభాధిప సమాయుక్తే నాశరాశిగతేపివా।
ధనేరంధ్రే పాపగ్రహ సమన్వితే ఋణగ్రస్తోభవేన్నరః॥

**తా॥** లగ్నాధిపతి, ధనాధిపతి, లాభాధిపతి వీరికి షష్ఠాధిపతితో కలిసిన జాతకుడు ఋణము చేయువాడగును.

శ్లో॥ శిఖీయస్య షష్ఠే స్థితో వైరినాశో
భవేన్మాతృ పక్షేచ తన్మాన భంగః
చతుష్పాత్సుఖం ద్రవ్యలాభో నితాంతం
నరోగోఽస్యదేహే సదావ్యాధినాశం॥

**తా॥** శతృభావమందు కేతువు ఉండుట చాలా మంచిది. శతృవులను జయించు వాడు, మాతృవర్గము వారితో కలహించువాడు, పదవులు, వాహనములు కలవాడు, ధనలాభము పొందువాడు, రోగము లేనివాడు మంచి ఆరోగ్యవంతుడు అగును.

## 7. కళత్రభావం

శ్లో॥ కళత్రనాధాద్యదివా కళత్ర రాశేః
కుటుంబాధిపతిర్భ వేద్వా।
బలేనసౌమ్యే సమజాతి మాహుః
స్త్రియం సుశీలా పతిభక్తియుక్తా॥

**తా॥** 7వ స్థానాధిపతి కంటెను, 7వ స్థానము కంటెను 2వ అధిపతి బలవంతుడైన ఎడల, జాతకునకు సమాన జాతియు, మంచి స్వభావము కలిగినటువంటి, భర్త యందు ప్రేమగల భార్యలభించును.

శ్లో॥ దారాంశమేహీ నబలే ధరాసుతే
క్రూరాదిషష్ట్యంశ సమన్వితేవా।
నీచారిమూఢే విహగారి భాగే
దుష్టాన్యసక్తా మతికర్కశా స్యాత్॥

- జా. అ్ము

**తా॥** కుజుడు సప్తమాధిపతియై, బలహీనుడై క్రూరాది షష్ట్యంశలు పొంది, నీచయందుగాని, అస్తంగతుడైగాని యుండిన జాతకుని భార్య ఇతరాసక్తురాలు, కఠిన మనస్సుగలది అగును.

శ్లో॥ ధనేవ్యయేచ పాతాళే జామిత్రే చాష్టమే కుజే
స్త్రీణాం భర్తృవినాశాయ పుంసాంభార్యా వినశ్యతి॥

**తా॥** 2 – 4– 7 – 8 – 12 స్థానములందు కుజుడున్నచో వివాహ సుఖము సంపూర్తిగా అనుభవించలేరు. వివాహాలస్యము, కలహములు, వియోగము, దూరముగా నుండుట, రోగబాధలు మొదలగు వానివలన జీవితము దు:ఖ భూయిష్ట మగును. శుభగ్రహసంబంధముచే కొంత దోషపరిహారమగును.

# 8. ఆయుర్భావము

శ్లో॥ ఏకోపి కేంద్రభవనే నవపంచమేవా
రాత్రీశపుత్రీ సురపూజిత భార్గవానాం।
నిశ్శేషదోషమపహృత్య శిశుం ప్రయాతి
దీర్ఘాయుష్యం వితత రోగ భయంకరోతి॥

**తా॥** బుధ-గురు-శుక్రులలో ఒకరైనా కేంద్ర, కోణములందున్న ఎడల, సమస్త దోషములను పోగొట్టి జాతకునకు, ఆరోగ్యమును, దీర్ఘాయువును ఇచ్చెదరు.
- జా.అనుభవ సారం

"సతికుడ్యే చిత్రకర్మ" అన్నారు. అంటే గోడవుంటేనే దానిపై చిత్రం వ్రాయవచ్చు. అలాగే ఆయువు ఉంటేనే రాజయోగం అనుభవించవచ్చు.

కొందరికి 60సం॥లు దాటిన తరువాత ఉన్నత పదవీ ప్రాప్తియోగం ఉన్నప్పుడు, ఆ దశ రావాలంటే అప్పటిదాకా ఆయువు ఉండాలి. అందుచేతనే ముందుగా ఆయుర్నిర్ణయం చేయాలంటారు. ప్రాచీన జ్యోతిర్వేత్తలు.

**పరాశర పద్ధతిలో:-** లగ్నం - తృతీయం - అష్టమం ఆయుఃస్థానములు. శని ఆయుష్కారకుడు, అయితే జైమిని మహర్షి పద్ధతిలో, లగ్న, అష్టమములు ఆయు:స్థానములు. రవి ఆయుష్కారకుడు.

అనుభవమును బట్టి, జైమిని మతరీత్యా ఆయుష్కారకత్వము రవిగ్రహమునకు చెందుటయే సమంజసము. ఆత్మకారకుడు, శరీరభావ కారకుడు అయిన రవి సకల ప్రాణికోటికి జీవన ప్రదాతకదా. శరీరములో జీవాత్మ ఉండునంతవరకు ఆయువు ఉన్నట్లే కనుక, ఆయుష్కారకుడు రవియనుటలో సందేహమవసరములేదనియు నాయభిప్రాయము.

ఆయుర్భాగ్యము - యోగభావము ఈ రెండింటినీ వేరువేరుగా జైమిని, వరహమిహిరాదులు వ్రాసినారు. బృహజ్జాతకములో వరాహమిహిరుడు, జన్మవిధి - బాలారిష్టాధ్యాయములు వ్రాసి ఆయుర్ధాయధ్యాయము వ్రాసినాడు. ఆ తరువాతనే

కర్మజీవ, రాజయోగాధ్యాయములు వ్రాసినాడు. అందుచేత జాతకునికి ముందు ఆయుర్నిర్ణయము చేయుట అత్యంత ముఖ్యము.

ఈ ఆయుర్నిర్ణయములో జ్యోతిష శాస్త్రమునందు అనేక పద్ధతులున్నవి. వీటిలో ఖచ్చితమైన విధానము ఏది? ఏ పద్ధతిననుసరించిన జాతకుని ఆయుర్దాయము తెలియును? అని విమర్శచేసినచో ఈ విధానములిట్లున్నవి.

1. ఉడుదశావిధానముచే పరిశీలించు వింశోత్తర దశావిధానము (120సం॥) ఇందు లగ్న అష్టమాధిపతులు వారి స్థితిననుసరించి ప్రాప్తించు ఆయువు.
2. జైమిని పద్ధతి రీత్యా గుణించు కాలచక్ర, దశావిధానముననుసరించి ప్రాప్తించు ఆయువు.
3. జాతకుడు తల్లి గర్భమునందున్నప్పుడు గ్రహములచే ఇవ్వబడిన పిండాయుర్దాయము.
4. సత్యాచార్యఋషిచే ప్రశంసింపబడిన అంశాయుర్దాయము. దీనిని వరాహమిహిరుడు కూడా అనుసరించాడు.
5. గ్రహముల గోచారవశముచే సంప్రాప్తించు ఆయువు.
6. కేంద్రములందు గల గ్రహముల శుభత్వముచే సంప్రాప్తించు కేంద్రాయువు.
7. దశాంతర్దశలచేత ప్రాప్తించు కారకత్వ సంబంధ ఆయువు.
8. అష్టకవర్గురీత్యా బిందువులను వేసి త్రికోణశోధన – ఏకాధిపత్యశోధన చేసి, రాశిగుణకారములుచే గుణించి, హరణభరణాదులు చేసిన పిమ్మట సంప్రాప్తించు అష్టకవర్గు ఆయుర్దాయము.

ఈ ఎనిమిది విధానములచే ఒక జాతకుని ఆయువును పరిశీలించినచో ఒకే విధముగాను లేదా ఎనిమిది రకములుగా కూడా ఆయువు రావచ్చు. అటువంటప్పుడు ఏ పద్ధతిని అనుసరించాలి? ఈ సమస్యకు బృహజ్జాతక వ్యాఖ్యాత అయిన భటోత్పలుడు ఇలా సమాధానం చెప్పాడు.

ఒక జాతకునికి ఆయువు పైన చెప్పిన విధానములో 3-10-15-20-27-35-40-50 సం॥లుగా వివిధరకములుగా వచ్చినపుడు ఎక్కువ సం॥లుగా వివిధ రకములుగా వచ్చినపుడు ఎక్కువ సం॥లు వచ్చినది. జాతకుని ఆయుర్ధాయమని, మిగిలిన సం॥లలో జాతకుడు, వివిధ రోగ బాధలను, ప్రమాదములను పొందునని లేదా మరణ సదృశమైన అవమానములు ఎదుర్కొని ఎక్కువ వచ్చిన సం॥ల వరకూ జీవించునని సమన్వయ పరచాడు.

అయితే పైన పేర్కొన్న అన్ని విధానములలోనూ సత్యాచార్య ప్రతిపాదించిన అంశాయుర్ధాయము అనుభవములో బాగా సరిపోవుచున్నది. దీనినే వరాహమిహిరుడు కూడా అనుసరించాడు. ప్రపంచ ప్రఖ్యాత జ్యోతిషశాస్త్రవేత్త శ్రీ బి.వి.రామన్ కూడా ఈ విధానము తన 60సం॥ల అనుభవములో బాగా సరిపోయినదని ఇది అనుసరణీయమని My Experience in Astrology అనే గ్రంథంలో పేర్కొన్నాడు.

ఈ అంశాయుర్దాయ గణిత విధానం ఉదాహరణతో తెలియచేస్తాను.

గ్రహము ఎన్ని డిగ్రీలలోనున్నదో చూచి దానిని నిముషములలోనికి మార్చి, దానిని 200చేత భాగించగా నెలలు వచ్చును, శేషమును 30చేత గుణించి మరల 200చేత భాగించగా రోజులు వచ్చును.

ఉచ్చ గ్రహమునకు, వక్రించిన గ్రహమునకు ఆ గ్రహము ఇచ్చిన ఆయువును 3రెట్లు చేయవలెను. వర్గోత్తమాంశయందున్న గ్రహమునకు, స్వనావాంశయందున్న గ్రహమునకు, స్వక్షేత్రమునయున్న గ్రహమునకు, స్వద్రేక్కాణమునందున్న గ్రహమునకు, ఆగ్రహమిచ్చిన ఆయువు రెట్టింపు చేయవలెను. ఇవి భరణములని చెప్పబడును.

గ్రహము శతృక్షేత్రము నందున్న ఆ గ్రహము ఇచ్చిన ఆయువులో మూడవవంతు తగ్గించవలయును. రవితో కలసిన గ్రహములకు (శని-శుక్రులు మినహా) సగభాగము తగ్గించవలయును. వీటిని హరణములందురు.

**బృహజ్జాతకం 7 అధ్యాయం 10-11**

ఒకే గ్రహమునకు ఎక్కువ హారణములు పట్టిననూ, ఎక్కువ భరణములు పట్టిననూ, ఎక్కువైనది ఒక్కటే చేయవలయును.

గ్రహములు ఎన్ని డిగ్రీలలో నున్న ఎంత ఆయువు వచ్చునో ఈ క్రింది పట్టికవలన సులభముగా తెలుసుకొనవచ్చును.

## ఈ పట్టిక తయారుచేసినది. ఎం.సంపత్‌కుమార్

| డిగ్రీలు | సం॥లు | నె | రో |
|---|---|---|---|
| 1 | 0 | 3 | 18 |
| 2 | 0 | 7 | 06 |
| 3 | 0 | 10 | 24 |
| 4 | 1 | 2 | 12 |
| 5 | 1 | 6 | 0 |
| 6 | 1 | 9 | 18 |
| 7 | 2 | 1 | 06 |
| 8 | 2 | 4 | 24 |
| 9 | 2 | 8 | 12 |
| 10 | 3 | 0 | 0 |
| 11 | 3 | 3 | 18 |
| 12 | 3 | 7 | 06 |
| 13 | 3 | 10 | 24 |
| 14 | 4 | 2 | 12 |
| 15 | 4 | 06 | 0 |

| డిగ్రీలు | సం॥లు | నె | రో |
|---|---|---|---|
| 16 | 4 | 9 | 18 |
| 17 | 5 | 01 | 06 |
| 18 | 5 | 04 | 24 |
| 19 | 5 | 8 | 12 |
| 20 | 6 | 0 | 0 |
| 21 | 6 | 03 | 18 |
| 22 | 6 | 07 | 06 |
| 23 | 6 | 10 | 24 |
| 24 | 7 | 02 | 12 |
| 25 | 7 | 06 | 0 |
| 26 | 7 | 09 | 18 |
| 27 | 8 | 01 | 06 |
| 28 | 8 | 04 | 24 |
| 29 | 8 | 08 | 12 |
| 30 | 9 | 0 | 0 |

# మినిట్స్ పట్టిక

| మినిట్స్ (లిప్తలు) | నె. | రో. | గం. | నిముషాలు | మినిట్స్ (లిప్తలు) | నె. | రో. | గం. | నిముషాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 0 | 1 | 19 | 12 | 21 | 1 | 7 | 21 | 12 |
| 2 | 0 | 3 | 16 | 24 | 22 | 1 | 9 | 16 | 24 |
| 3 | 0 | 5 | 11 | 36 | 23 | 1 | 11 | 11 | 36 |
| 4 | 0 | 7 | 6 | 48 | 24 | 1 | 13 | 6 | 48 |
| 5 | 0 | 9 | 2 | 0 | 25 | 1 | 15 | 2 | 0 |
| 6 | 0 | 10 | 21 | 12 | 26 | 1 | 16 | 21 | 12 |
| 7 | 0 | 12 | 16 | 24 | 27 | 1 | 18 | 16 | 24 |
| 8 | 0 | 14 | 11 | 36 | 28 | 1 | 20 | 11 | 36 |
| 9 | 0 | 16 | 6 | 48 | 29 | 1 | 22 | 6 | 48 |
| 10 | 0 | 18 | 2 | 0 | 30 | 1 | 24 | 2 | 0 |
| 11 | 0 | 19 | 21 | 12 | 31 | 1 | 25 | 21 | 12 |
| 12 | 0 | 21 | 16 | 24 | 32 | 1 | 27 | 16 | 24 |
| 13 | 0 | 23 | 11 | 36 | 33 | 1 | 29 | 11 | 36 |
| 14 | 0 | 25 | 6 | 48 | 34 | 2 | 1 | 6 | 48 |
| 15 | 0 | 27 | 2 | 0 | 35 | 2 | 3 | 2 | 0 |
| 16 | 0 | 28 | 21 | 12 | 36 | 2 | 4 | 21 | 12 |
| 17 | 1 | 0 | 16 | 24 | 37 | 2 | 6 | 16 | 24 |
| 18 | 1 | 2 | 11 | 36 | 38 | 2 | 8 | 11 | 36 |
| 19 | 1 | 4 | 6 | 48 | 39 | 2 | 10 | 6 | 48 |
| 20 | 1 | 6 | 2 | 0 | 40 | 2 | 12 | 2 | 0 |

| మినిట్స్ (లిప్తలు) | నె. | రో. | గం. | నిముషాలు | మినిట్స్ (లిప్తలు) | నె. | రో. | గం. | నిముషాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 41 | 2 | 13 | 21 | 12 | 51 | 3 | 1 | 21 | 12 |
| 42 | 2 | 15 | 16 | 24 | 52 | 3 | 3 | 16 | 24 |
| 43 | 2 | 17 | 11 | 36 | 53 | 3 | 5 | 11 | 36 |
| 44 | 2 | 19 | 6 | 48 | 54 | 3 | 7 | 6 | 48 |
| 45 | 2 | 21 | 2 | 0 | 55 | 3 | 9 | 2 | 0 |
| 46 | 2 | 22 | 21 | 12 | 56 | 3 | 10 | 21 | 12 |
| 47 | 2 | 24 | 16 | 24 | 57 | 3 | 12 | 16 | 24 |
| 48 | 2 | 26 | 11 | 36 | 58 | 3 | 16 | 11 | 36 |
| 49 | 2 | 28 | 6 | 48 | 59 | 3 | 16 | 6 | 48 |
| 50 | 3 | 0 | 2 | 0 | 60 | 3 | 18 | 2 | 0 |

## ఉదాహరణ శ్రీరాజీవ్‌గాంధి

జననం 1944.8.20 ఉ.9.27

బొంబాయి 18 ఎన్ 55, 72ఇ 50

## గ్రహ సంపత్తి

రవి - సింహం - 3.58

చంద్ర - సింహం - 17.52

కుజ - కన్య - 1.20

బుధ - కన్య - 28.41

గురు - సింహం - 12.18

శుక్ర - సింహం - 18.49

శని - మిధునం - 14.23

## 1. రవి

పట్టిక ద్వారా గ్రహములకు వచ్చిన ఆయువు

| | సం. | నె. | రో. | గం. | ని. |
|---|---|---|---|---|---|
| 3 డిగ్రీలు | 0 | 10 | 24 | 0 | 0 |
| 58 ని॥లు | 0 | 3 | 18 | 11 | 36 |
| | 1 | 2 | 12 | 11 | 36 |

రవి స్వక్షేత్రముందుడుట చేత ఈ ఆయువును రెట్టింపు చేయగా 2-4-24-23-12 ని॥ వచ్చినది. ఇది జాతకునికి రవిగ్రహము ఇచ్చిన ఆయుర్ధాయము.

## 2. చంద్రుడు

| | సం. | నె. | రో. | గం. | ని. |
|---|---|---|---|---|---|
| 17 డిగ్రీలు | 5 | 1 | 6 | 0 | 0 |
| 52 ని॥లు | | 3 | 3 | 16 | 24 |
| | 5 | 4 | 9 | 16 | 24 |

చంద్రుడు రవికి 10డిగ్రీలు దాటి ఉండుట చేత అస్తంగత దోషములేదు. మిత్రక్షేత్రము కనుకు మరణము లేదు.

## 3. కుజుడు

| | సం. | నె. | రో. | గం. | ని. |
|---|---|---|---|---|---|
| $1^0$ డిగ్రీ | 0 | 3 | 18 | 0 | 0 |
| 20 ని॥లు | 0 | 1 | 6 | 2 | 0 |
| | 0 | 4 | 24 | 2 | 0 |
| కుజుడు అంశలో ఉచ్చలో ఉండుటచేత రెట్టింపు చేయగా | 0 | 9 | 18 | 4 | 0 |

**4. బుధుడు**

| | సం. | నె. | రో. | గం. | ని. |
|---|---|---|---|---|---|
| $28^0$ డిగ్రీ | 8 | 4 | 24 | 0 | 0 |
| 41 ని॥లు | | 2 | 13 | 21 | 12 |
| | 8 | 7 | 7 | 21 | 12 |
| బుధుడు అంశయందు ఉచ్చస్థితి | | | | | |
| పొందుటచేత 2రెట్లు | 17 | 2 | 14 | 42 | 24 |

**5. గురుడు**

| | సం. | నె. | రో. | గం. | ని. |
|---|---|---|---|---|---|
| $12^0$ డిగ్రీ | 3 | 7 | 6 | 0 | 0 |
| 8 ని॥లు | 0 | 1 | 2 | 11 | 0 |
| | 3 | 8 | 8 | 11 | |
| గురుడు అంశలో ఉచ్చ 2 రెట్లు | | 7 | 4 | 16 | 22 |

**6. శుక్రుడు**

| | సం. | నె. | రో. | గం. | ని. |
|---|---|---|---|---|---|
| $18^0$ డిగ్రీ | 5 | 4 | 24 | | |
| 49 ని॥లు | | 2 | 28 | 6 | 48 |
| | 5 | 7 | 22 | 6 | 48 |
| శుక్రుడు అంశలో నీచ | 2 | 10 | 7 | 3 | 24 |

**7. శని**

| | సం. | నె. | రో. | గం. | ని. |
|---|---|---|---|---|---|
| $14^0$ డిగ్రీ | 4 | 2 | 12 | 0 | 0 |
| 23 ని॥లు | 0 | 1 | 11 | 11 | 36 |
| | 4 | 3 | 23 | 11 | 36 |
| శని స్వనావాంశ 2రెట్లు | 8 | 7 | 16 | 12 | 12 |

| | సం. | నె. | రో. | గం. | ని. |
|---|---|---|---|---|---|
| రవిగ్రహ దత్త శుద్ధాయు: | 2 | 4 | 24 | 23 | 12 |
| చంద్రగ్రహదత్త శుద్ధాయు: | 5 | 4 | 09 | 16 | 24 |
| కుజగ్రహదత్త శుద్ధాయు: | | 9 | 18 | 04 | 0 |
| బుధగ్రహదత్త శుద్ధాయు: | 17 | 2 | 14 | 42 | 24 |
| గురుగ్రహదత్త శుద్ధాయు: | 7 | 4 | 16 | 22 | 0 |
| శుక్రగ్రహదత్త శుద్ధాయు: | 5 | 7 | 22 | 06 | 48 |
| శనిగ్రహదత్త శుద్ధాయు: | 8 | 07 | 16 | 12 | 12 |
| మొత్తం ఆయువు | 47 | 6 | 27 | 14 | |
| జననం | 1944 | 08 | 20 | | |
| | 1992 | 03 | 17 | | |

రాజీవ్‌గాంధీ 1991.5.21న మరణించారు. సుమారు 10నెలలు మాత్రమే తేడావచ్చినది.

## 9. పితృభావం

**శ్లో॥ భాగ్యస్థే పరమోచ్చస్థే భాగేజీవ సమన్వితే**
**లగాచ్చతుష్టయే శుక్రే పితుర్దీర్ఘాయురాదిశేత్॥**

- జా.అమృ॥ సా

**తా॥** నవమాధిపతి పరమోచ్చయందును, నవమములో గురుడూ చతుర్ధమందు శుక్రుడున్న ఎడల జాతకుని తండ్రి పూర్ణాయుర్దాయము కలవాడగును.

**శ్లో॥ పితృకర్మగృహే జాతః పితృతుల్య గుణాన్వితః।**
**పితృజన్మ తృతీయర్క్షే జాతః పితృధనాశ్రితః॥**

**తా॥** తండ్రి లగ్నమునకు గాని, రాశికి గాని, దశమ రాశి లేదా దశమ లగ్నమందు జన్మించినవాడు తండ్రి గుణములను పొందును. తృతీయ రాశి, లగ్నమందు జన్మించినవాడు తండ్రి ధనమును పొందును.

శ్లో॥ పంచమే నవమేయస్య జన్మకాలే రవిస్థితః॥
స్యాజ్జన్మకాలికే శౌరిదశా చేత్పుత్రనాశినీ॥

**తా॥** జన్మలగ్నమునకు 5-9 స్థానములందు సూర్యుడున్నపుడు, జన్మ సమయమున శనిదశ జరుగుచున్నచో పితృమారకము కలుగును.

శ్లో॥ అహన్యర్కోనిశాయాంతు మందస్యాత్పుత్రకారకౌ।
రాహుకేతూతయోశ్చత్రు తాభ్యమాశ్రిత్యరాశికౌ
కారకేణాన్వితస్తస్య దశాయాంపితృనాశనమ్॥

**తా॥** పగలు జన్మించినవారికి సూర్యుడు, రాత్రి జన్మించిన వారికి శని పితృ కారకులగుదురు. రాహు కేతువులు ఉన్న రాశ్యాధిపతులు, రవి, శనులతో కలసిన వారి దశలయందు పితృమారకము కలగును.

ఇద్దరు లేక ముగ్గురు కుమారులకు ఒకే సమయములో రాహు-కేతు-రవి-కుజ-శని దశలలో ఒకకి దశ జరుగునపుడు పితృమారకము అగును.

పితృస్థానాధిపతికి శుభార్గళము పట్టి గురు-శుక్రులచే చూడబడిననూ, వీరిలో ఎవరితోనైనా కలసిననూ జాతకుని తండ్రి పూర్ణాయుర్దాయము కలవాడగును.

లగ్నము కంటే నవమ స్థానము బలమై యున్నచో జాతకుడు, తండ్రికి అనువర్తి అగును.

భాగ్యాధిపతి శుభుడై, కారకుడు పాపగ్రహసంబంధము లేక, నవమస్థానమందు శుభగ్రహములున్న ఎడల జాతకుని తండ్రి దీర్ఘాయుర్ధాయము కలవాడగును.

## 10. దశమ భావం

# వృత్తి - వ్యాపారములు

మానవ జీవితం కర్మబద్ధం. పురాకృత కర్మవశముచేత శరీరము ధరించిన మానవుడు వివిధ వృత్తి, వ్యాపారాదుల వల్ల జీవనం పొందటం జరుగుతుంది. ఆగర్భ శ్రీమంతులైనా ఏదో వ్యాపకములో కాలంగడపడం, పదిమందికీ ఉపయోగపడి,

సమాజంలో వివిధరంగాలలో ధనముతోబాటు, చిరస్థాయికమైన యశస్సు పొందడం మనం చూస్తూనే వున్నాము. ఏ పనీ చేయక నిర్వ్యాపారంగా వున్నవాళ్ళూ ఉన్నారు. ఈ విధమైన వృత్తీ, వ్యాపారం, ఉద్యోగం, రాజకీయం, కళారంగం, ఇత్యాది కర్మ క్షేత్రాలలో ఎవరు ఏరంగంలో రాణిస్తారు? ఏ వృత్తివ్యాపారాలు నిర్వహిస్తారు అనేది జ్యోతిషశాస్త్రం ద్వారా తెలుసుకొనే విధానాలు ప్రాచీన జ్యోతిష గ్రంధాలలో ఉల్లేఖించబడ్డాయి.

జ్యోతిషశాస్త్రంలో జననాది మరణ పర్యంతమూ మానవుని సర్వవిధావస్థలు తెలుసుకోవచ్చు. జాతకుని జన్మ సమయము ననుసరించి నిర్దిష్టమైన రాశిచక్రము, నవాంశ చక్రము, 12 భావములు, దశాశేషము, గుణించిన తరువాత జాతకుని జీవన విధానము ఎట్లుండునో తెలుసుకొనుటకు "దశమ స్థానము" పరిశీలించాలి. జీవనకారకుడు "శనిగ్రహము" భావము. కారకుడు, భావాధిపతి, ఆ దశమ భావమును చూచుచున్న గ్రహములు, ఆ దశమ భావాధిపతితతో కలసిన గ్రహములు వీరందరూ, మానవుని జీవన వ్యాపారములను తెలియచేస్తారు.

–వరాహమిహిరుడు – ఈ దశమభావమును లగ్నము నుంచి చంద్రరాశినుంచి, రవి రాశినుంచి పరిశీలించాలని పేర్కొన్నాడు. ముందుగా ఈ దశమ భావ విషయంలో ప్రాచీనుల అభిప్రాయాలు పరిశీలించి చర్చించిన, అనంతరము ఆధునిక కె.పి. స్టెల్లర్, విధానమును, గ్రహముల కారకత్వముల ననుసరించి, మానవుని వృత్తి వ్యాపారాదులను ఖచ్చితముగా తెలియచేసే విధానం వివరిస్తాను.

ప్రాచీనుడైన పరాశరుడు హోరాశాస్త్రమందు ఇట్లు పేర్కొన్నాడు.

**శ్లో॥ "అథః పరంతు శ్రోతవ్యంత్వయా కర్మభవం ఫలం**
**చతుర్ముఖాదిభిర్యచ్చ ప్రోక్తంలోకహితైషిభిః॥**
**స్వరాశ్యంశోచ్చగే పూర్ణబలోపేతోతు కర్మపే**
**పితృసౌఖ్యాన్వితో జాతః పుణ్యకర్మాసుకీ ర్తిమాన్॥**

కర్మాధిపో బలోనేశ్చేత్ కర్మవైకల్యమాదిశేత్
రాహుః కేంద్ర త్రికోణస్థో జ్యోతిష్టోమాదియాగకృత్
సౌమ్యయుక్తే శుభస్థానే సంస్థితే కర్మపేసతి
వాణిజ్యతో రాజతోవా లాభోహానిర్వపర్యయే॥

**తాత్పర్యము:** దశమాధిపతి స్వక్షేత్ర, స్వనవాంశ ఉచ్చలయందుండి, శుభత్వము పొంది బలవంతుడైనచో జాతకుడు పుణ్యకర్మలు చేయును. కీర్తి, తండ్రి వలన సుఖమును ఐశ్వర్యమును పొందును. దశమాధిపతి దుర్బలుడు పాపత్వమును పొందినవాడైనచో ఏ పనిచేయనివాడు. లేదా పాప కర్మలు చేయువాడు అగును. రాహువు కేంద్ర–కోణ స్థానములందున్న జాతకుడు జ్యోతిష్టోమము, అగ్నిషోమీయము మొదలగు యాగములు చేయును. దశమాధిపతి శుభత్వము పొంది శుభస్థానము లందున్నపుడు వ్యాపారమువలన, లేదా ఉన్నతపదవి యందున్న వారి ఆశ్రయము వలనగాని జీవన లాభమును పొందును. పాపయుతుడై, పాపస్థానములందున్నచో వ్యతిరేక ఫలితములు జరుగును. దశమ–ఏకాదశ భావములు పాపత్వమును పొందినచో జాతకుడు చెడుపనుల ద్వారా ఆర్జన చేయును.

ఇచ్చుట ప్రాచీనుల మతము ప్రకారము యాగాది కర్మలు ఫలితముగా చెప్పి నపుడు, వాటిని ఆధునిక కాలమునకు అన్వయం చేసుకొని, దేవాదాయ ధర్మాదాయ శాఖలు ట్రస్టుబోర్డులు, వీటియందు సత్కర్మలు చేయుట, పూజాదికములు నిర్వహించుట మున్నగు ఫలితములు చెప్పవలెను.

కాలపురుష చక్రమునందు 9–10–11–12 స్థానములు ధర్మ–అర్థ– కామ–మోక్షములను తెలియజేయును. మేషాదిగా నవమ భావము ధనస్సు అగును. దీనికి అధిపతి గురుడు ఈ గురుగ్రహమే జీవశక్తి ప్రదాత. కావుననే గురుగ్రహమునకు "జీవ" అని పేరు. దశమము మకరము దీనికి అధిపతి శని అందువలననే శని జీవన కారకుడు. లాభస్థానమునకు అధిపతి కూడా శనియే, కామము. ఇహలోక వాంఛా సఫలత్వమును కూడా శనిగ్రహమే తీర్చుచున్నది. ఆయుష్కారకత్వము కూడా

శనిగ్రహమునకు నిర్దేశించబడినది. వ్యయము, మోక్షస్థానము ఇది గరుగ్రహాధీనమైనది. ప్రాణము నిర్గమించుట, తిరిగి ఆ జీవి సుకృత దుష్కృతానుసారముగా పునర్జన్మ పొందుట అనునది పంచమ భావమును బట్టి తెలియును.

దశమమందున్న గ్రహములననుసరించి వివిధ ఫలితములు, వివిధ జ్యోతిష శాస్త్రవేత్తలు నిర్వహించారు.

**కొన్నిటిని పరిశీలిద్దాం-**

గురు-శుక్రులు దశమస్థానమందు బలవంతులైయున్నచో, గురుకారకత్వము ననుసరించి, విద్యాలయములు, న్యాయస్థానములు, దేవాలయములు, గొప్ప ప్రజోప యోగ సంస్థలు వీటియందు జీవనము పొందుతాడు.

శుక్రుడు దశమమందున్నచో, శుక్రకారకత్వము ననుసరించి, కళారంగము, సంగీత-నృత్య-అభినయ అలంకరణ పానీయ-సుగంద-దివ్యవస్త్రమధుర పదార్థములు - రత్నముల వ్యాపారము - వీటిద్వారా జీవనం పొందుతాడు.

నీచగ్రహముతో కూడిన శని, కర్మస్థానమందున్నచో ఆ దశమాధిపతి కూడా పాపగ్రహయుక్తుడైనచో, జాతకుడు ఏ పనీ చేయనివాడు, వ్యర్థుడు అగును. చంద్రుడు చంచలత్వమునకు కారకుడు, ఇట్టి చంద్రుడు దశమమందున్నచో, జాతకుడు ఏ వృత్తియందునూ స్థిరత్వము 35-38 సం॥ల వరకూ పొందలేడు. వివిధ వృత్తులు, ఉద్యోగములు మారుటకు అవకాశము కలదు.

**సర్వార్థ చింతామణి**యందు వెంకటేశ దైవజ్ఞుడు, ఈ విధముగా తెలిపెను.

గురు-బుధ-శుక్రులు 6-8-12 స్థానములందున్న, పాపగ్రహములచే చూడబడిన జాతకుడు మంచి ఉద్యోగము పొందలేడు. అర్హతలున్నను యోగ్యమైన ఉద్యోగము కాని వ్యాపారముగాని చేయడు. దశమాధిపతి దశమస్థానము నందున్నా, మృద్వంశ పొందినా, బుధ-గురు శుక్రులలో ఒకరితోనైనా కలసి శుభ దశమస్థాన

మందున్న జాతకుడు ప్రజోపయోగములు చేయును, ఉన్నతపదవి పొందును. జీర్ణదేవాలయములు బాగుచేయును. దశమమందు కుజుడుగాని, రవి గానియున్న, గొప్ప శాసకుడగును. అతనిమాట ఆజ్ఞవలె పాటించబడును. గురు–చంద్రులకు చతుర్థ దశమ సంబంధము బట్టిననూ, పరస్పర సమసప్తక స్థితియందున్ననూ గజకేసరి యోగముబట్టి చిరస్థాయి అయిన కీర్తిని, ఘనకార్యములను చేయును.

షష్ఠాధిపతి దశమము నందుండి, దశమాధిపతితో కలసి షష్ఠాధిపతితో సంబంధ త్రయము (ఆధిపత్యము–స్థితి–దృష్టి) పట్టినచో జాతకుడు అనేక సేవకులను – పని వారలను పొందును.

దశమాధిపతియున్న నవాంశాధిపతికి శని సంబంధము కల్గినా, కేంద్రకోణ గతులయినా, జాతకుడు పదిమంది పనివారలను పోషించును. దశమమున పాప గ్రహమున్న మోకాలు నెప్పులు (కీళ్ళవాతము) కలుగును. ఇట్టి దశమమున 4 గ్రహములున్న సన్యాస జీవితము గడుపును.

సారావళియందు కళ్యాణవర్మ దశమస్థానము గూర్చి **"కర్మచింత"** యను అధ్యాయము వ్రాశాడు. ముందు దశమస్థాన విషయములోనే, లగ్న–చంద్ర రాశులలో బలమైన దానిని నిర్ణయించి, దానికి దశమమే కర్మస్థానముగా పరిశీలించాలని పేర్కొన్నాడు. దశమ రాశి, ద్విపాద – చతుష్పాద–కీటక–ఉభయ రాశులలో ఏ భాగమునకు చెందునో గమనించి, కర్మస్థానము, ఆ రూప–స్వభావాదులలో నుండునని తెలిపాడు. దశమస్థానమందున్న గ్రహము ననుసరించి ధనలాభములను ఈ విధంగా పేర్కొన్నాడు. రవి దశమమందున్న తండ్రి వలన, చంద్రుడున్న తల్లివలన, కుజ, గురులున్న సోదరమూలమున, శుక్రుడున్న స్త్రీలవలన, శనియున్న సేవకులవలన ధనప్రాప్తి, సంపాదన కలుగుతాయి. ఆ లాభము అధికమా? స్వల్పమా? అనునది ధనస్థాన బలమును బట్టి నిర్ణయించాలి.

ఇతర ప్రాచీన గ్రంథములలోనూ అనేక విషయాంతరములున్నవి. గ్రహముల కారకత్వములు, స్వభావ, శుభత్వముల ననుసరించి వారు ఫలితములనిత్తురు.

దశమస్థానమును మెరిడియన్ కస్పు అందురు. ఇది స్థిరమైనది. గ్రహములలో సప్తగ్రహములకూ ఆధిపత్య రాశులున్నవి. రాహుకేతువులు ఛాయాగ్రహములుగా వరాహమిహిరాదులు వీరికి ప్రాధాన్యమీయలేదు. పాశ్చాత్యులు వీరిని నోడ్స్ అందురు. పాశ్చాత్య జ్యోతిష శాస్త్రవేత్త **"అలెన్ లియో"** తన 1001 నోటబుల్ హారోస్కోప్స్ నందు, రాహు, కేతువులను పరిగణనలోనికి తీసుకోలేదు. అయితే భారతీయ జ్యోతిష శాస్త్రమందు **"శనివద్రాహుః– కుజవత్కేతుః"** అని చెప్పారు. అనగా రాహు కారకత్వ స్వభావములు, శనిని పోలి యుండునుగాన, రాహువు శనివంటివాడని, కేతువు కుజునివంటివాడని తెలిపారు. వీరికి ఉచ్ఛస్థానములు కూడా నిర్ణయించారు. రాహువు ఉచ్ఛ, వృషభము కేతువునకు ఉచ్ఛ వృశ్చికము అగును. ఇందు మతభేదమున్నది. సూర్యచంద్రులకు గ్రహణకారకులు రాహు– కేతువులు –చంద్రగ్రహము పూర్ణిమనాడే సంభవిస్తుంది. వృషభం చంద్రునికి ఉచ్ఛరాశి, అందు రాహువునకు ఉచ్ఛ చెప్పినపుడు, చంద్రునకు వృశ్చికము నీచరాశియగును కాన, పూర్ణచంద్రుని గ్రహణముపట్టు, రాహువునకు వృషభమునే ఉచ్ఛస్థానముగా గ్రహించుట సమంజసమే అగును.

నాడీగ్రంథములలో కూడా దశమస్థానమును బట్టియు, గ్రహములను బట్టి వృత్తి, మరియు జీవనము నిర్ణయించు పద్ధతులనేకము కలవు. **ధృవనాడి**యందు రాశి చక్రము నవాంశ చక్రము రెండింటినీ గ్రహించి, రాశిచక్రములోని లగ్నమును, నవాంశ చక్రములో లగ్నస్థానముగా గ్రహించి తన్వాది ద్వాదశ భావములను ఫలితములు చెప్పు విధానము కలదు.

**ఉదాహరణ:–** రాశిచక్రములో వృశ్చికము లగ్నమయినపుడు, నవాంశమునందు కుంభము లగ్నమయినపుడు నవాంశ చక్రములో వృశ్చికమును లగ్నముగా గ్రహించి ఫలితములను చెప్పవలెను. ఇది అనుభవములో బాగుగా సరిపోవుచున్నది. ఈ **"ధృవనాడి"** గ్రంథము మద్రాస్ ఒరియంటల్ మాన్యూస్క్రిప్ట్ లైబ్రేరి యందు కలదు. ఇది 48 వాల్యూమ్స్‌గా నున్నది.

కొన్ని నాడి గ్రంథములందు శనిగ్రహమును, జీవన కారకునిగా గ్రహించి నూతన విధానముతో ఫలితములు చెప్పారు. ఈ పద్ధతిలో లగ్నము అవసరము లేదు. దశమ స్థానము కూడా అవసరము లేదు. శనిగ్రహమున్న రాశి అనంతర రాశులలో ఉండు ఇతర గ్రహముల స్థితిని అనుసరించి ఫలితాలుంటాయి. శనికి అనంతర రాశులలో అనగా 2-3-4-5 రాశులలో, ఆ తరువాత రాశులలోగాని ముందుగా కుజగ్రహమున్నచో, అట్టి జాతకుడు కుజగ్రహ కారకత్వము ననుసరించి, వ్యవసాయము, యంత్రములు, కంట్రాక్టులు, ఇంజనీరింగ్ శాఖలోల జీవనము పొందుతాడు. శని అనంతర రాశులలో గురుడున్న, విద్యాలయములు, న్యాయ స్థానములు, దేవాలయములు, ప్రభుత్వ పదవులు పొందును. గురు – కేతువులున్న వేదపండితుడు, లేదా జ్యోతిషము మంత్ర శాస్త్రము ద్వారా జీవించువాడగును.

శుక్ర-బుధుల వలన వ్యాపారము, ధనసంబంధమైన సంస్థలు, బ్యాంకులు, రవి రాహువుల వలన రాజకీయ రంగము, చంద్రుని వలన 35 సం॥ల వరకు అస్థిరత్వము కలుగును, శని అనంతర రాశులలో ముందుగా ఒంటరి రాహువును గోచారరీత్యా పొందునట్లయితే జాతకుడు తక్కువ జీతముతో జీవనము ప్రారంభించి క్రమేణ ఉన్నతస్థితిని పొందును. కుజ-కేతువుల వల్ల పారిశ్రామికరంగము తెలియబడును. శుక్ర-శనుల వల్ల ఖరీదైన నూని (పెట్రోలు బంకులు), శుక్ర-కుజుల వల్ల, రవాణాశాఖ, వాహన వ్యాపారములు వీటివల్ల జాతకుడు జీవనము పొందును.

పాశ్చాత్యులు, దశమమందున్న గ్రహముతో పొందు ఇతర గ్రహములతో దుష్టులననుసరించి, కేంద్ర దృష్టి-కోణ దృష్టి మొదలగు వాని వల్ల, జీవనమును తెలుపుచున్నారు.

దశమమందు ఏ గ్రహమూ లేనిచో, దశమాధిపతియున్న నవాంశాధిపతి ననుసరించి, వృత్తి నిర్ణయము చేయవలెనని వరాహ మిహిరాదులు తెలిపిరి.

# స్టెల్లర్ పద్ధతి

ముందుగా గ్రహములు, భావములు స్ఫుటము చేసి హారోస్కోప్ తయారు చేయవలెను. ఈ స్టెల్లర్ విధానమును పూజ్యశ్రీ **కె.కృష్ణమూర్తి**గారు పరిశోధించి ఆవిష్కరించారు. ఇందు గ్రహములను గుణించునపుడు కె.పి. అయనాంశలనే, ఉయోగించవలెను. వారి ఎఫిమెరిస్‌నే ఉపయోగిస్తే మంచిది. ఖచ్చితమైన గ్రహస్థితులు, భావములు ఏర్పడతాయి. ఇతరుల అయనాంశలు ఉపయోగించరాదు. **శ్రీ బి.వి.రామన్** ఎఫిమెరీస్ ఉపయోగించదలచినచో, బి.వి.రామన్ అయనాంశలకు 1.21లను కలపవలెను. అప్పుడు కృష్ణమూర్తి అయనాంశ వచ్చును.

30(భాగలు) డిగ్రీలు కల రాశియందు, 3 నక్షత్రములుండును. 9పాదములు, ఒక్కొక్క పాదమునకు $3^0$20-నిముషములుండును. ఈ విధముగా ఒక రాశిలో రాశ్యాధిపతి - నక్షత్రాధిపతితో బాటు $13^0$20 నిముషములను 9 గ్రహములకూ విభజించి, వింశోత్తరీ దశావిధానక్రమముగా కొంత సమయమును కేటాయించి వీటికి సబ్‌లార్డ్ అనిపేరు పెట్టారు. ఈ సబ్‌లార్డ్ వల్లే సకల ఫలితములు, సమయము తెలుస్తుందని **శ్రీ కె.ఎస్. కృష్ణమూర్తి** నిరూపించారు.

భావములకు కూడా Cusp డిగ్రీలు కట్టిన తరువాత సబ్‌లార్డ్ పొజిషన్స్ కట్టాలి, ఆ రాశిలో ఆ భావము ఎన్ని డిగ్రీలలో పడిందో చూచి దానికి సబ్ లార్డ్‌ను "249 పట్టిక" ద్వారా నిర్ణయించాలి.

ఉదాహరణ:- **శ్రీ ఎం.సంపత్‌కుమార్** 1957-5-21 తేదీ రాత్రి 7.50 (IST) ని॥లకు జననం, జన్మస్థలం కాకినాడ, లాంగ్ 82 ఇ 13' లాట్ 16 ఎన్ 57', కె.పి. అయనాంశాలు $23^0$ 10' కుంభరాశి, వృశ్చికలగ్నం.

## 12(IST) భావములు

| భావం | డి.ని. | రాశి | నక్షత్రం | సబ్ |
|---|---|---|---|---|
| I | 236°17 | కు | బు | గు |
| II | 268.21 | గు | ర | చ |
| III | 300.24 | శ | కు | బు |
| IV | 332.28 | గు | గు | రా |
| V | 0.24 | కు | కే | కే |
| V | 28.21 | కు | ర | చ |
| VII | 56.17 | శు | కు | గు |
| VIII | 88.21 | బు | గు | శు |
| IX | 120.24 | ర | కే | కే |
| X | 152.28 | బు | ర | గు |
| XI | 180.24 | శు | శు | బు |
| XIII | 208.21 | శు | గు | శు |

## గ్రహస్థితి

| గ్రహము | డిగ్రీలు | నక్షత్రం | నక్షత్రాధిపతి | సబ్ |
|---|---|---|---|---|
| రవి | 36°.54′ | కృత్తిక–4 | ర | బు |
| చంద్ర | 305.39 | ధనిష్ఠ–4 | కు | చ |
| కుజ | 17.17 | ఆర్ద్ర–4 | రా | శు |
| బుధ | 16.53 | భరణి–2 | శు | చ |
| గురు | 248.29 | ఉత్తర–1 | ర | కు |
| శుక్ర | 46.40 | రోహిణి–3 | చ | శ |
| వక్రి–శని | 228.29 | జ్యేష్ట–1 | బు | కే |
| రాహు | 205.54 | విశాఖ–2 | గు | కే |
| కేతు | 25.54 | భరణి–4 | శు | కే |

| | | | |
|---|---|---|---|
| | బుధ<br>కేతు | రవి<br>శుక్ర **7** | కుజ |
| చంద్ర<br>**4** | **రాశి చక్రము** | | |
| | **కుజదశా శేషం**<br>**0-6-12 రోజులు** | | **10** గురు |
| | **లగ్నం-1**<br>శని | రాహు | |

ఇపుడు దశమభావం పరిశీలిద్దాం. దశమభావం కన్యారాశిలో ఉన్నది. $152^{0}28$ ఇది రాశిచక్రములో సింహమగుచున్నది. కాని భావచక్రములో దశమభావము ప్లాసిడస్ పద్ధతి ప్రకారము, కన్యలో $2^{0}28$. నిముషముల నుండి ప్రారంభమగును. ఈ డిగ్రీలకు "249 పట్టిక" ననుసరించి బుధరాశి-రవి నక్షత్రము (ఉత్తర) గురుడు సబ్ వచ్చినవి.

జాతకుని యొక్క వృత్తి నిర్ణయమును, కర్మ క్షేత్రమును ఈ సబ్ లార్డ్ గురుడు నిర్ణయించును. ముందుగా జాతకుడు స్వతంత్రముగా జీవించునా? లేదా ఉద్యోగము చేసి ఒకరి క్రింద పనిచేయుచూ జీవించునా? అనునది పరిశీలించవలయును. కె.పి. స్టెల్లర్ విధానములో దశమ భావ సబ్‌లార్డ్ ఏ నక్షత్రములో ఉన్నాడో పరిశీలించాలి. ఆ నక్షత్రాధిపతి 6 భావమునకు సంబంధించినచో అట్టి జాతకుడు ఉద్యోగము చేయును. ఆ నక్షత్రాధిపతి 7 భావమునకు సంబంధించినచో, జాతకుడు వ్యాపారము చేయును.

దశమభావ సబ్‌లార్డ్ రవిఅయి, 2-6-10-11 స్థానములకు సంబంధించినచో, జాతకుడు తండ్రి యొక్క వృత్తి వ్యాపారములకు, ఇత్తడి, బంగారము మొదలగు లోహ వ్యాపారములను చేయును.

దశమ భావ సబ్‌లార్డ్ చంద్రుడైనచో అతడు 2-6-10-11 స్థానములకు సంబంధించిన, జాతకుడు నౌకా సంస్థలు, సరస్సులు, చెరువులు, పెట్రోలు, బ్రాందీ షాపులలో ఉద్యోగములు చేయును. స్వతంత్ర వ్యాపారమైనచో పాలు, హోటల్ వ్యాపారములు చేయును. 36-38 సం॥ వరకూ స్థిరత్వముండదు. దశమభావ సబ్‌లార్డ్ కుజుడై 2-6-10-11 స్థానములకు సంబంధించినచో జాతకుడు, పోలీస్, మిలటరీ, అగ్నిమాపక, డిస్టిలరీ శాఖలయందు ఉద్యోగము చేయును. సబ్ లార్డ్ స్వతంత్ర జీవనము సూచించినచో వైద్యము, వ్యవసాయము, మాంస విక్రయం, కిచెన్‌పని, అగ్ని యంత్రములు బాగుచేయుట, తయారుచేయుట, లేదా విక్రయించు వ్యాపారములు చేయును.

దశమభావ సబ్‌లార్డ్ బుధుడై, ఉద్యోగమును సూచించనచో, రేడియో, సినిమా, విద్యాశాఖ పన్నులశాఖ, జర్నలిజం, రెవెన్యూ రాయబారి కార్యాలయములందు ఉద్యోగము చేయును. స్వతంత్ర జీవనము సూచించినచో, జ్యోతిష శాస్త్రము, డిజైన్, ప్రెస్, వార్తాపత్రికలు, ఫోటోగ్రఫీ వృత్తులు చేయును.

దశమభావ సబ్‌లార్డ్ గురుడై ఉద్యోగమును సూచించినచో, కాలేజీలు, యూనివర్శిటీలు, బ్యాంకులు, ట్రెజరీలు దేవాదాయ శాఖలు వీటిలో ఉద్యోగము పొందును వ్యాపారము సూచింపబడినచో విద్యాసంస్థలు స్థాపించుట. ధాన్యం వ్యాపారం, షేర్ల వ్యాపారం, చిట్‌ఫండ్స్, కమీషన్ ఏజెన్సీ వడ్డీ వ్యాపారం, మధుర పదార్థముల తయారీ, మున్నగునవి చేయును.

దశమభావ సబ్‌లార్డ్ శుక్రుడై ఉద్యోగమును సూచించినచో రవాణాశాఖ, బట్టలమిల్లులు, సినిమా రంగము వీటియందు ఉద్యోగము చేయును. వ్యాపారమును సూచించినచో నటన, సంగీతము, ప్లాస్టిక్ వస్తువులు, ఫ్యాన్సీ, బట్టలు ఆడవారికి సంబంధించిన వస్తువులు అమ్మట, హస్తకళలు, సినిమా నిర్మాణం అలంకరణ సామాగ్రి, నగలు, హోటల్స్, లాడ్జి, అభ్రకము, రత్నాల వ్యాపారం, పాలు, బ్రాందీ మొదలగు శాఖలలో వ్యాపారము, వృత్తులు చేయును.

దశమభావ సబ్‌లార్డ్ శని అయి, ఉద్యోగమును సూచించినచో ఇనుముకు సంబంధించిన పెద్ద పెద్ద ఫ్యాక్టరీలు, అటవీశాఖ, వాహనములు బాగుచేయు సంస్థ. రోడ్లు శాఖ, సిమ్మెంటు ఫ్యాక్టరీలు, నూని కర్మాగారములు, మ్యూజియంలు వీటియందు ఉద్యోగము పొందును. వ్యాపారము స్వతంత్ర జీవనము సూచింపబడినచో ప్రత్తిమిల్లు, త్రాళ్ళు, నల్లని వస్తువులు తయారు చేయుట, ఇనుము, నూని, రద్దు–పాత సామాన్లు, బొగ్గులు, శానిటరీ వస్తువులు కలప వ్యాపారం మొదలగునవి చేయును.

దశమభావ సబ్‌లార్డ్ రాహువు అయి ఉద్యోగమును సూచించినచో, రాహువున్న స్థానాధిపతి, రాహువుతో కలసిన గ్రహముల ననుసరించి ఫలితములు చెప్పాలి? ఉద్యోగమా? వ్యాపారమా? అనునది కూడా పరిశీలించాలి. అనుభవములో చూడగా, రాహువు సబ్‌లార్డ్ అయినవారు స్వతంత్ర జీవనములో, రాజకీయ రంగము, వైద్యము స్మగ్లింగ్ వస్తువులు అమ్ముట, పవర్ బ్రోకరేజి, మీడియేటర్ షిప్ నిర్వహించుచున్నారు.

ఈ విధమైన వృత్తి నిర్ణయ విధానము జన్మ చక్రమును పరిశీలించాలి. ఇది లేనివారికి Horary చక్రము ద్వారా ఫలితములు చెప్పిన ఖచ్చితముగా సరిపోవును. జాతక చక్రము లేనివారు, ఉద్యోగము వచ్చునా? ఎప్పుడు వచ్చును? ఏ విధమైన జాబ్ వచ్చును? అని ప్రశ్నించినపుడు, అట్టి జాతకుడు 1 నుంచి 249లోపు సంఖ్యను తెలుపవలెను. ఆ సంఖ్యకు గల డిగ్రీలననుసరించి Horary Chart వేయాలి. ఎక్కువ మంది Significaters వచ్చినపుడు, సమయ నిర్ధారణలో Ruling Planets ను గ్రహించాలి.

**దశమ భావము కేవలం వృత్తిని, జీవనమును మాత్రమే తెలియచేస్తుంది. అంతేగాని దాని ద్వారా జాతకుడు లాభము పొందుతాడా? పొందాడా?** అనునది తెలియచేయదు, అది లాభస్థానం తెలియజేస్తుంది. దశమభావం లాభ భావానికి వ్యయం కనుక, దశమభావం **"కర్మస్థానం"** కనుక జాతకుడు చేయుపనిని మాత్రమే తెలియచేయును. కర్మవల్ల సంభవించు కీర్తిని తెలియజేయును.

దశమభావం సబ్‌లార్డ్ 6-8 భావములకు సంబంధించినచో జాతకుడు, ఒకరివద్ద ఉద్యోగము చేయును. 7-10 భావములకు సంబంధించినచో వ్యాపారము, స్వతంత్ర జీవనము చేయును. భావములకూ, 7-10 భావములకూ సంబంధించినచో అట్టి జాతకుడు కొంతకాలము ఉద్యోగము చేసి, పిమ్మట వ్యాపారము చేసి, స్వతంత్రముగా జీవించును అట్టి సమయము సంబంధిత భావముల దశాంతర్దశల ననుసరించయుండును. **దశమభావము కేవలం 7-10-11 భావములకు సంబంధించి 6-8 భావముల సంబంధం లేనిచో అట్టి జాతకుడు జీవితాంతము స్వతంత్ర జీవనము, వ్యాపారము చేయును.**

7వ భావం స్వతంత్ర జీవనం. వ్యాపారము సూచించును. ఆ వ్యాపారం ఏ విధంగా ఉంటుంది అనేది ఆ భావమందున్న గ్రహములపై ఆధారపడి ఉంటుంది. రవి 7భావముందుండి జాతకుని 10వ భావ సబ్‌లార్డు వ్యాపారమును సూచించి నట్లయితే వ్యాపారం స్థిరంగా చేయడం జరుగుతుంది. కాని కొన్ని ఆటంకములు, సమస్యలు ఎదురౌతాయి, అయినా ఫరవాలేదు.

7నందు చంద్రుడున్నట్లయితే వ్యాపారములు అనేకం చేయడం జరుగుతుంది. రాబడికూడా అస్థిరంగా ఉంటుంది. కొన్ని సార్లు వ్యాపార స్థలం లేదా షాపుకూడా మారే అవకాశముంది. కారణం ఏమిటంటే చంద్రుడు బహుచంచలమైన వేగవంతమైన గ్రహం కాబట్టి ఇలా జరిగే అవకాశం ఉంది.

7నందు కుజుడుంటే వ్యాపారారంభంలోనూ, నిర్వహించడంలోనూ బహు తొందరపాటుతనం మాటవిసురు ఉంటాయి. అంతేగాక ఎంతో ఆర్భాటంగా ప్రారంభించి ఒకేసారి ఎత్తేయడం జరుగుతుంది. దీని గూర్చి **కె.పి. స్టెల్లర్**లో ఇలా చెప్పబడింది. Start in a Flash, to end in a Crash.

7నందు బుధుడుంటే అతి తక్కువ సమయంలో ఎక్కువ టర్నోవర్, అధికలాభాలు వ్యాపార నిర్వహణా చాతుర్యం, కార్యసాధకత్వం, జయం కలుగుతాయి.

7నందు గురుడుంటే, ఎంతో నిజాయితీగా, నమ్మకంతో వ్యాపారం చేయడం జరుగుతుంది. ఇతరములైన బ్రాంచీలు విస్తరణ జరిగి అభివృద్ధి, లాభాలు పొందడం జరుగుతాయి.

7నందు శుక్రుడు ఉంటే గొప్ప అదృష్టం. వ్యాపారం బాగా ప్రసిద్ధి పొందుతుంది. బ్రాండ్ నేమ్, గుడ్‌విల్ అత్యంత గణనీయమైన ఉన్నతస్థాయిలో ప్రఖ్యాతమౌతాయి. అదృష్టం అందలం ఎక్కిస్తుంది.

**7నందు శని ఉంటే మంచిది కాదు. నష్టం, అపఖ్యాతి, చిక్కులు కలుగు తాయి. పాశాత్యులు కూడా వారి జ్యోతిషరీత్యా సప్తమశని వ్యాపారానికి అసలు మంచిది కాదు.**

7నందు యురేనెస్, నెప్ట్యూన్‌లు ఉండటం కూడా మంచిదికాదు. తలవని తలంపుగా చెడుసంఘటనలు, జరిగే అవకాశం ఉంది.

ఉద్యోగమునందైనా, వ్యాపారమునందైనా అన్యాయమార్గంలో అత్యంత ధనమార్జించే వాళ్ళుంటారు. ఇటువంటి జాతకులకు శని, బుధుల ద్విస్వభావ రాశుల సంబందం వారి వృత్తివ్యాపారాలకు ఉంటుంది.

**"పార్టనర్‌షిప్"**ను కూడా 7వ భావం సూచిస్తుంది. 10వ భావ సబ్‌లార్డ్ 8వ భావమునకు కూడా Significater అయితే భాగస్వామ్యం వారసత్వం వీటివల్ల జాతకుడు లాభం పొందుతాడు. ఇటువంటి జాతకులకు వివాహానంతరం అదృష్టం క్రమేణ అభివృద్ధిలోనికి తీసుకువస్తుంది. 8వ భావం కళత్రభావానికి ధనస్థానం కావడమే దీనికి కారణం.

ముందు ఉదహరించిన జాతక చక్రములో దశమభావము బు-ర-గు-సబ్‌లు వచ్చినవి. సబ్‌లార్డ్ అయిన గురుడు రవి నక్షత్రమందున్నాడు. రవి 10వ స్థానాధిపతి అయి, 6వ భావమందున్నాడు. సబ్‌లార్డ్ అయిన గురుడు సింహరాశిలో ఉత్తర నక్షత్రమందున్నాడు. కనుక గురుడు 6వ భావమును సూచించుచున్నాడు. రవికూడా రవినక్షత్రమందే యుండుటవలన, ఇట్టి రవి దశమాధిపతి అగుటచేత 6-10 స్థానములు సూచించుట చేత, ఈ జాతకుడు కొంతకాలము ఉద్యోగమూ, స్వతంత్ర జీవనము చేయును.

**మరొకసారి:-**

దశమభావ సబ్‌లార్డ్ గురుడు రవి నక్షత్రమందున్నాడు. ఇట్టి రవి తన నక్షత్రమునందే ఉండుటవలన, రవి Strong Significater అయ్యాడు. ఈ రవి 10వ స్థానాధిపతి అయి 6వ భావమందుండుట వలన ఒకే గ్రహమునకు రెండు సూచనలు వచ్చుటవలన జాతకుడు ఒకేసారి రెండూ నిర్వహించును. అనగా ఉద్యోగము చేయుచూ స్వతంత్రముగా వ్యాపారముగాని మరొక విద్యద్వారా గాని జీవించును.

**ఏ వృత్తి చేయను? ఏ వ్యాపారము చేయును?** అను విషయము తెలుసుకొన దలచినచో దశమాధిపతి దశమభావ నక్షత్రాధిపతి వీరిరువురి కారకత్వములు ఆధిపత్య స్థానములు పరిశీలించి ఖచ్చితముగా నిర్ణయం చేయవచ్చును. దశమాధిపతి బుధుడయి, దశమభావ నక్షత్రము గురుడయినపుడు వీరిరువురి కారకత్వముల ననుసరించి విద్య, జ్యోతిషం, ప్రచురణలు వీటికి సంబంధించిన వృత్తి వ్యాపారములు చేయును.

## దశమ భావములు

**1. మేషం:-** దశమభావమై - భావనక్షత్రము అశ్వని అయినపుడు ఉద్యోగ మయితే - ఫ్యాక్టరీ, పోలీసు, మిలటరీ, వైద్యరంగము, రైల్వే, పోస్టల్ శాఖలలో జీవనము పొందును. స్వతంత్ర జీవనమైతే ప్రయివేటు వైద్యం, ఇనుము, మందుల షాపు, కొరియర్, కలప వ్యాపారములు చేయును.

భావనక్షత్రం భరణి అయినపుడు ఉద్యోగమయితే, సంగీతరంగము, బట్టల మిల్లులు, భవననిర్మాణము, వాహనములు నడుపుట, వీటియందు జీవనము పొందును.

స్వతంత్ర వృత్తులయినచో, పరిశ్రమ స్థాపించుట, సినిమాథియేటర్, హోటల్, పశువైద్యం, గృహోపయోగ సామాగ్రి, పాలు, రసాయనములు, రత్నముల వ్యాపారము మొదలగు వానివలన జీవించును.

భావనక్షత్రం కృత్తిక అయినచో, ఉద్యోగము సూచింపబడిన, రక్షణశాఖలు, రసాయన కర్మాగారములు, అగ్ని సంబంధ కర్మాగారములు, మొదలగు వాటిలో

జీవనము పొందును. స్వతంత్ర జీవనమయినచో టింబర్ డిపో, ఆయుధ తయారీ, భవన నిర్మాణమునకు సామాగ్రి సరఫరా చేయుట ఎలక్ట్రికల్ షాపు మొదలగునవి పొందును.

**2. వృషభం:-** దశమభావమై, కృత్తిక భావనక్షత్రమైనచో, ఉద్యోగము సూచింపబడితే నగల షాపు, ఫోటోగ్రఫీ, రెడీమేడ్ దుస్తులు, సాంస్కృతిక కార్యక్రమములు నిర్వహించుట. మెడికల్ షాపు మొదలగు శాఖలలో ఉద్యోగము చేయును. స్వతంత్ర జీవనము చేయును.

భావనక్షత్రము రోహిణి అయిన, ఉద్యోగమయితే హోటల్, బేకరీ, లాడ్జి, బట్టలు, ఉన్ని – నూలు, రవాణా, పార్లర్, నూని తయారుచేయు ఫ్యాక్టరీలు, రంగులు తయారు చేయు లేదా అమ్ము షాపులలో ఉద్యోగము చేయును. స్వతంత్ర జీవనమైనచో పై రంగములలోనే జీవనము వ్యాపారము చేయును.

భావ నక్షత్రం మృగశిర అయితే ఎస్టేట్లు, పురుగుల మందుల దుకాణములు, కర్మాగారములు, లాండ్రిలు, పొగాకు సంస్థలు, వ్యవసాయం, సినిమా ధియేటర్, ఆటోమొబైల్, ఇంజనీరింగ్, బ్రాందీ షాపులు, పండ్లు పూల దుకాణములు తోలు వస్తువులు తయారుచేయు ఫ్యాక్టరీ అలంకరణ సామాగ్రి తయారుచేయు ఫ్యాక్టరీలలో ఆయా భావముల ననుసరించి ఉద్యోగ, వ్యాపారములను పొందును.

**3. మిధునం:-** దశమభావమై మృగశిర భావ నక్షత్రమైనచో, స్పేర్ పార్ట్సు, ఎలక్ట్రికల్ వస్తువులు, మందులు తయారుచేయుట, బేకరీ, టెలిఫోన్, వైర్‌లెస్ సమాన్లు తయారు చేయుట మొదలగు వృత్తి వ్యాపారములు చేయును.

భావ నక్షత్రం ఆరుద్ర అయినచో పుస్తకములు షాపు యాడ్ బిజినెస్ – మెడికల్ షాపు, ఫైనాన్స్, టి.వి. రేడియో షాపులు, పోస్టలు & టెలిగ్రాఫ్, పురుగుమందులు, న్యూస్ పేపరు ఏజెన్సీ, ఇవే కాక రాహువున్న రాశ్యాధిపతి కారకత్వములు, రాహువుతో జేరిన గ్రహముల కారకత్వముల ననుసరించి ఉద్యోగ వ్యాపారములు జేయును.

భావనక్షత్రము పునర్వసు అయినచో, జ్యోతిషం, రచనా వ్యాసంగం. పత్రికా నిర్వహణ, ఇంజనీరింగ్, ఎక్స్‌పోర్ట్సు, కమీషన్ రంగం, విద్యాబోధన, ఇన్సూరెన్స్,

పోస్టల్ శాఖ, రాయబార కార్యాలయాలు, రాజకీయం మొదలగు రంగములలో ఉద్యోగ స్వతంత్ర జీవనములు చేయును.

**4. కర్కాటకము :-** దశమభావమై, భావనక్షత్రము పునర్వసు నక్షత్రమైతే, ఫైనాన్స్–దేవాలయం–మత సంబంధ వృత్తులు వైద్యం, నీటి పారుదల శాఖ, బ్యాంకులు షిప్పింగ్ ఏజెన్సీలలో ఉద్యోగ వ్యాపారములు చేయును.

భావనక్షత్రము పుష్యమి అయినచో కార్పోరేషన్ – ఇంజనీర్–పెట్రోలు బంక్ – బ్లడ్ బ్యాంకు – అయిలు షాప్, దుప్పట్లు, ఉన్ని షాపులు – ద్రవ్వకపు సంస్థలు, కాంట్రాక్టులు మొదలగు శాఖలలో ఉద్యోగ వ్యాపారముల ద్వారా జీవనము గడుపును.

భావనక్షత్రము ఆశ్లేష అయినచో, ప్రింటింగ్ ప్రెస్ కళారంగము లాటరీషాపులు, సినిమా థియేటర్లలో టిక్కట్లు ఇచ్చుట, రంగులు వేయుట, బట్టల మిల్లులు, సైన్‌బోర్డులు వ్రాయుట, ట్రావెల్ ఏజెన్సీ నిర్వహించుట మొ॥గు ఉద్యోగ వ్యాపారములు చేయును.

**5. సింహము :-** దశమభావమై, భావనక్షత్రము మఖ అయినచో, న్యాయవాది, వైద్యుడు, సెక్యూరిటీ ఆఫీసరు ప్రభుత్వ శాఖలలోను, షిప్పింగ్, రసాయనములు, నగలు, షాపులు, గనులు, జర్నలిజం, టైపిస్టు, సి.ఐ.డి., మెరైన్ శాఖలలో ఉద్యోగ స్వతంత్ర జీవనములు పొందును.

భావనక్షత్రము పూర్వఫల్గుణి అయినచో వాహనములు నడుపుట రేడియో– టి.వి. షాపులు, సేల్సుమేన్, ఎలక్ట్రికల్ షాపు, రవాణాశాఖ విద్యాబోధన ఆటో మొబైల్సు, సినిమాహాళ్ళు నడుపుట, మొదలగు శాఖలలో ఉద్యోగ స్వతంత్ర జీవనములు పొందును.

భావనక్షత్రము ఉత్తరఫల్గుణి అయినచో కలెక్టరు ఐ.జి. ప్రభుత్వ శాఖలలో క్రింద స్థాయి నుంచి ప్రమోషనులపై ఉన్నత స్థానమును చేరుకొనుట, జ్యోతిషం, కాంట్రాక్టులు, పెద్ద పెద్ద ఎలక్ట్రికల్ షాపులు, భారీస్థాయిలో హోర్డు వేరు షాపు, స్టీలు ఫ్యాక్టరీ, కోట్లాదిరూపాయాలతో పెద్ద పెద్ద ఇనుపసంబంధ వస్తువుల తయారీ ఫ్యాక్టరీ నిర్వహణ మొదలగు వాటిలో ఉద్యోగ స్వతంత్ర జీవనములు పొందును.

**6. కన్య:-** దశమభావమై, భావ నక్షత్రము ఉత్తర ఫల్గుణి అయినచో జ్యోతిష పండితుడు, సాముద్రికము చెప్పుట – రసాయనములు తయారుచేయుట. స్పీకర్లు తయారుచేయుట, కళాశాలయందు లెక్చరర్, రాయబారి, ప్రభుత్వమునందు ఉన్నతపదవులు మొదలగునవి నిర్వహించును.

భావ నక్షత్రం హస్త అయినచో న్యాయవాది, కళాకారుడు, బట్టలషాపు, పొగాకు సంస్థలు, లాండ్రీ, ఎక్స్‌పోర్ట్, ఇంపోర్ట్, షిప్పింగ్, నేవీ, చెరువులు మొదలగు జీవన విధానములుండును.

భావనక్షత్రము చిత్త అయినచో, సేల్స్ టాక్స్ డిపార్టుమెంట్, ఎక్కౌంటెంట్, న్యాయాలయములలో గుమాస్తా శాఖలు, ఇంజనీరింగ్, ప్రింటింగ్ ప్రెస్, ఎలక్ట్రికల్ సామాన్లు, నగలషాపులు, న్యాయవాదిత్వము మొదలగునవి జాతకుడు పొందు అవకాశమున్నది.

**7. తుల:-** దశమభావమై, భావనక్షత్రము చిత్త అయినచో, ఆటోమొబైల్ స్పేర్‌పార్ట్స్, టైర్ రీట్రేడింగ్–ఎలక్ట్రికల్ వస్తువులు, నగలవర్తకం, న్యాయస్థానములు, రక్షణ శాఖలు, ఇంజనీర్, సాంస్కృతిక సంస్థలు, మొదలగు వృత్తి వ్యవహారములు జాతకుడు పొందును.

భావనక్షత్రము స్వాతి అయినచో హాస్టల్స్, వైద్య రంగము, ట్రాన్స్‌పోర్టు ఏజెన్సీ, ఎక్స్–రే పరికరములు, అలంకరణ సామాగ్రి, స్త్రీల వస్తువులు – ఎగ్జిబిషన్‌లు నిర్వహించుట నూలు మిల్లులు, వాహనములు నడుపుట మున్నగు వ్యాపకములు, రాజకీయ రంగము, గూఢ వ్యవహారములు వీటియందు జీవనము పొందుతాడు.

భావనక్షత్రము విశాఖ అయినచో, ట్రావెల్ ఏజెన్సీ, రియల్ ఎస్టేట్ – నావికుడు – రెవిన్యూ, బ్యాంకులు, ఫైనాన్స్ బట్టల మిల్లులు – షాపులు, చిట్‌ఫండ్స్, పిండిమిల్లులు టూరిజం, శాఖలలో జాతకుడు వృత్తి వ్యాపారములు చేయును.

**8. వృశ్చికము :-** దశమభావమై, భావనక్షత్రము విశాఖ అయినచో ఎస్టేటు యజమాని – షేర్ మార్కెట్, రసాయనములు, మందలు తయారుచేయుట – భూస్వామి

– లాయర్ జడ్జీ – ఇన్సూరెన్స్ అధికారి – కస్టమ్స్ – రక్షణ శాఖలు – గ్రామాధికారి మొదలగు జీవనములుండును.

భావనక్షత్రము అనూరాధ అయినచో బట్టలమిల్లు నూనె, పెట్రోలు – డీజిల్ విక్రయం – ఎరువులు, ఇనుప స్క్రాప్ – కాస్టింగ్ – ఇంజనీరింగ్ – బట్టనేయుట, బ్రాందీ షాపులు, మందుల షాపులు, వీటివలన జీవనము పొందును మరియు వీటికి సంబంధించిన పరిశ్రమలు స్థాపించును.

భావనక్షత్రము జ్యేష్ఠ అయినచో, ప్రింటింగ్ ప్రెస్ – ఎలక్ట్రికల్ యాడ్స్ – వైద్యం – కంప్యూటర్స్ – టి.వి.లు అమ్మట – తయారుచేయుట – బట్టల మిల్లులకు పరికరములు సరఫరా చేయుట మున్నగు జీవనములు పొందడం జరుగుతుంది.

**9. ధనస్సు:-** దశమభావమై, భావనక్షత్రము మూల అయినపుడు – విద్యా బోధన–న్యాయవాది, జడ్జి, మంత్రి, ప్రభుత్వ రాయబారులు, మత సంస్థలలో ఉన్నత పదవులు – ఆయుర్వేద వైద్యులు – మందుల షాపు, డిపార్టుమెంటల్ స్టోర్స్ – ఫల – పుష్ప దుకాణములు వీటివలన జీవనము జాతకుడు పొందును.

భావనక్షత్రము పూర్వాషాఢ అయినచో, న్యాయవాది – బ్యాంకులు – ఆడిట్ సంస్థలు, వెల్ఫేర్ ఆఫీసులు, శిశుసంక్షేమ శాఖలు – ప్రభుత్వ వెటర్నరీ డాక్టరు – ఎక్కౌంటెంటు, రెస్టారెంట్ – బస్ సర్వీస్ – ఎక్స్‌పోర్టు – మార్కెటింగ్ మొదలగు జీవనములు జాతకుడు పొందును.

భావనక్షత్రము ఉత్తరాషాఢ అయినచో ఆయుర్వేద వైద్యం, అటార్నీ, బ్యాంకులు – న్యాయవాది – రాయబారి, కస్టమ్స్, జైళ్ళు – ఎక్స్‌పోర్ట్సు – పబ్లిక్ ప్రాసిక్యూటరు మొదలగు జీవనములు పొందును.

**10. మకరము:-** దశమభావమై, భావనక్షత్రము ఉత్తరాషాఢ అయినచో రియల్ ఎస్టేట్ – స్టీలు మెటీరియల్ సప్లై ఇంజనీరింగ్ విడి భాగములు – ప్రాచీన వైద్యం వృద్ధసదనముల నడుపుట – మున్సిపల్ కార్పోరేషన్లు – పబ్లిక్ శానిటేషన్ మొదలగు జీవనములు పొందును.

భావనక్షత్రము శ్రవణమైనచో, గనులు – గ్రానైట్ రాళ్ళు – నూని మిల్లులు – పెట్రోలు బంకులు – కూల్ డ్రింకుల తయారీ, ఆనకట్టలు, డామ్‌వద్ద పనులు – కాలువలు త్రవ్వుట – షిప్‌లో పనులు మొదలగు జీవనములు పొందుట జరుగును.

భావనక్షత్రము ధనిష్ఠ అయినపుడు, రక్షణ శాఖలు పెద్ద ఫ్యాక్టరీలు – జూనియర్ ఇంజనీర్ – ప్రభుత్వ విద్యుత్ సంస్థలు –వ్యవసాయం – టీతోటలు – తోలు పరిశ్రమ – మాంస వ్యాపారము మొదలగు వృత్తి వ్యాపారము జీవనముగా పొందుట జరుగును.

**11. కుంభము:-** దశమభావమై, ధనిష్ఠ భావ నక్షత్రమైనచో ఇంజనీరింగ్, రైల్వే – ఎరువులు – గణితము – ఆర్కెష్ట్రా – జ్యోతిషం – పురావస్తుశాఖ – లైబ్రరీ – ఆస్ట్రో ఫిజిక్స్ – ఫిజిక్స్ – వ్యాయామశాఖ – మెరైన్, రాజకీయం – ఫోటోగ్రఫీ – ఫింగర్ ప్రింట్స్ వివరించుట మొదలగు శాఖలలో జీవనము గడచును.

భావనక్షత్రము శతభిషమైనచో, పరిశోధన, ప్రాచీనగ్రంధ పరిశోధన, హస్త సాముద్రికమునందు విశేష ప్రజ్ఞ– గ్లాస్ వస్తువుల తయారీ, మందులు, రసాయనములు మెంటల్ ఆసుపత్రులు, సెన్సార్ బోర్డ్ – జ్యోతిషం – జైళ్ళు మరియు రాహువు ఉన్న రాశ్యాధిపతి రాహువుతో చేరిన గ్రహముల కారకత్వము ననుసరించి, జాతకుడు ఆయా వృత్తి వ్యాపారములవల్ల జీవనము సాగించును.

భావనక్షత్రము పూర్వాభాద్ర అయినచో సాముద్రికము. జ్యోతిషము – ఫైనాన్స్ – బ్యాంకులు – ప్లీడర్లు – మున్సిపాలిటీ – గణాంకశాఖ – పైలట్లు – పిండిమిల్లులు – ప్రాచీన భాషా గ్రంధాలయాలు మున్నగు శాఖలలో జాతకుడు వృత్తి – వ్యాపారాదులు నిర్వహించును.

**12. మీనము:-** దశమభావమై, భావనక్షత్రము పూర్వాభాద్ర అయినచో, రాజకీయములలో చురుకైన పాత్ర, దేవస్థానములు – ట్రావెల్ – సంస్థలు – రైస్ హోల్ సేల్ – బ్యాంకులు – ప్రొఫెసర్ – కౌన్సిలర్ – జడ్జి – ఉన్నత పదవులు వీటి వల్ల జాతకుని కర్మ నిర్వహించబడును.

భావనక్షత్రము ఉత్తరాభాద్ర అయినచో సిఐడి – రక్షణశాఖలు – రాయబారులు – ప్రభుత్వ వైద్యసంస్థలు – ఇన్సూరెన్స్ – మత్స్యశాఖ – దేవాదాయశాఖయందు ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ – ఇంజనీర్ – రెస్టారెంట్ – డిపార్టుమెంటు స్టోర్స్ క్లబ్‌లు, ఎక్స్‌పోర్ట్ – ఇంపోర్టు వ్యాపారము, మొదలగు సంస్థల వల్ల జాతకుని జీవితము గడచును.

భావనక్షత్రము రేవతి అయినచో, జడ్జి, శాసనసభ్యత్వము – ప్రభుత్వ రంగములో పెద్ద ఉద్యోగములు, లాయర్లు, రాయబారులు, కస్టమ్స్ మరియు ఎక్సైజ్‌శాఖ, జర్నలిజం, జ్యోతిషం – ఆడిట్ – యాడ్స్ – షేర్ మార్కెట్ – బ్యాంకులు – చిట్‌ఫండ్స్ – కొరియర్ – ప్రింటింగ్ – మొదలగు వృత్తి వ్యాపారములవల్ల జాతకుని జీవనము గడచును.

**ఇన్ని వృత్తులలోనూ, ప్రతివృత్తిలో స్థాయీ భేదం ఉంటుంది. అత్యున్నత స్థాయి, ఉన్నతస్థాయి, మధ్యమస్థాయి, అధమస్థాయి, అధమాధమ స్థాయి ఉంటాయి. ఎంతమేర జాతకుడు స్థాయిని పొందగలడు?** అనునది లగ్నము. లగ్నాధిపతిని బట్టి ఉంటుంది. లగ్నములు చర–స్థిర–ద్విస్వభావములని 3 విధములుగా ఉన్నాయి. చరలగ్నములకు, లగ్నాధిపతి 2–3–6–7–10 భావములకు సంబంధించి, 8వ భావ సంబంధము లేనట్లయిన జాతకుడు అత్యున్నత స్థాయికి లేదా ఉన్నత స్థాయిని పొందును. లగ్నాధి పతికి 2–10 భావసంబంధమున్నచో మధ్యమస్థాయి పొందును. లగ్నాధిపతి 2–10 భావములు మరియు 8వ భావమునకు సంబంధించినచో అధమస్థాయి చెందును. లగ్నాధిపతికి 2–6–10 సంబంధము లేక కేవలము 8వ భావ సంబంధమున్న జాతకుడు అధమాధమస్థాయి పొందును. చరలగ్న జాతకులకు 11వ భావ సంబంధము, పనికి రాదు. కారణమేమనగా చరలగ్నములకు 11వ స్థానము బాధక స్థానమగును. స్థిరలగ్నజాతకులకు 9వ స్థాన సంబంధము, ద్విస్వభావ లగ్న జాతకులకు 7వ స్థానసంబంధము పనికి రాదు మిగిలినందతయూ లగ్న–లగ్నాధిప బల నిర్ణయములో సమానమే.

## కొన్ని ఉదాహరణ జాతకములు పరిశీలిద్దాం!

**1) శ్రీ ఎన్.టి.రామారావు** -1923-5-28, జనన సమయం 4.43 P.M. (1st) Lat 16$^0$N 25.1, Long 81$^0$E00.

### భావములు

2-కు॥బు॥శు॥

6-గు॥బు॥చ॥

7-కు॥శు॥గు॥

10-చ॥బు॥శు॥

11-ర॥శు॥గు॥

దశమభావ సబ్‌లార్డు, శుక్రుడు అవడం చేత ఇట్టి శుక్రుడు, మేషరాశిలో 150-34 డిగ్రీలలో భరణీ నక్షత్ర (శుక్రుడు)లో రవి సబ్‌లో ఉన్నాడు. అందుచేత శుక్రకారకత్వమైన కళారంగంలోనే ఈ జాతకుని జీవనం గడిచింది. ఇట్టి శుక్రుడు సప్తమభావంలో నక్షత్రాధిపతి కావడం వల్ల సినిమా వ్యాపారం చేయడం లాభాధిపతి అయిన రవిసబ్‌లో ఉండటం వల్ల విశేష ధనసంపాదన, ద్వితీయ భావ సబ్‌లార్డు కూడా శుక్రుడే కావడం వల్ల పరిపూర్ణ ధనసంపాదనకు కారకుడయ్యాడు.

**2) శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ-** 1930-7-6, జనన సమయం 6.40 P.M. (1ST) Lat 17$^0$N 25.1, Long 84$^0$E

### భావములు

2-శు॥కు॥గు

10-శు॥కు॥శు

11-కు॥గు॥రా

దశమభావ సబ్‌లార్డు శుక్రుడై, కర్కాటకంలో బుధుని నక్షత్రంలో ఉండి, కంఠస్థానమైన ద్వితీయ మకర రాశిని చూస్తుండడం వల్ల కళారంగంలో గాత్ర సంగీతంలో నిష్ణాతులు, నూతన మార్గ ప్రవర్తకులూ అయ్యారు.

**3. శ్రీ బి.వి.రామన్-** 1912-8-8, జనన సమయం 7.42P.M. (1ST) $12^0$N 59, $77^0$E40.

**భావములు**

7- ర॥శు॥శు

10-కు॥ బు॥ కే

11-గు॥ శు॥ శు

దశమభావ సబ్‌లార్డ్ కేతువు. చంద్రుని నక్షత్రమందు బుధుని రాశియందు ఉన్నాడు. కేతువు జ్ఞానమునకు, గుప్తవిద్యలకు కారకుడు, అంతేగాక కేతువు వున్న రాశ్యాధిపతి బుధుడు జ్యోతిష విద్యకు కారకుడు, కావున భావసబ్‌లార్డు జ్యోతిషశాస్త్రమందు జీవనము సూచిస్తున్నాడు. గ్రంధ రచనలకు 3-11 భావములు బుధగ్రహము, వీటి సంబంధము ఉండాలి. గ్రంధ ప్రచురణకు తద్వారా లాభమునకు 2-3-11 భావములు, గురుగ్రహ సంబంధము ఉండాలి. శ్రీరామన్‌కు, ఇవి సమృద్ధిగా ఉండుట చేత, రచన, ప్రచురణ సంస్థలవల్ల లబ్ధి, ప్రతిష్ట పొందారు.

**4) శ్రీ సుభాష్ చంద్రబోస్-** 1897-1-23 జననసమయం 11-24 A.M. (LMT) Lat 20N 38, Long 5E 44 అయనాంశలు $22^0$19 (K.P)

**భావములు**

10- గు॥ ర॥ రా

దశమభావ సబ్‌లార్డు రాహువు, దశమమందు మకరరాశిలో, కుజుడి నక్షత్ర మందుండుట చేట, రాజకీయ రంగములో, యుద్ధమునుండి పోరాటపటిమ ప్రదర్శించు కుజుని కారకత్వ ఫలితములను, జీవన లక్ష్యంగా ఎంచుకొవడం జరిగింది.

**5) కుమారి జయలలిత–** 1948–2–24 జనన సమయం 2.34 P.M. (1ST) మద్రాస్, Lat 13 N 8 Long 80 E19

**భావములు**

10–గు॥బు॥కే

11–కు॥శు॥గు

దశమభావ సబ్‌లార్డు కేతువు. దశమభావ అధిపతి అయిన గురుని నక్షత్రమందున్నాడు. బుధుని సభలో ఉన్నాడు. గురుడు కేతువు నక్షత్రమందున్నాడు. ఇట్టి కేతువు తులారాశిలో ఉండుటచేత, శుక్ర కారతక్వము అయిన కళారంగము. లాభభావము శుక్ర నక్షత్రము. గురుని సబ్ అగుటచేత ప్రసిద్ధత్వమూ లభించాయి.

**6) పారిశ్రామికవేత్త** – 1950–8–20 జనన సమయం 6.21P.M Lat 16.57 Long 82.13.

**భావములు**

10–కు।శ॥గు

11–గు।కే।బు

దశమభావ సబ్‌లార్డు గురుడు. ధనస్థానంలో ఉన్న రాహువు నక్షత్రంలో ఉన్నాడు. రాహువు ఉత్తరాభాద్ర. (శని) నక్షత్రంలో ఉన్నాడు. దశమభావం కుజ–శని– భావ నక్షత్రంలో పడి సబ్ అయిన గురునికి ద్వితీయ, లాభముల సంబంధం కలగడం వల్ల ఆయిల్ ఫ్యాక్టరీ నిర్వహించడం, శనికారకత్వం వల్ల, నూనెవల్ల లాభం పొందడం జరిగింది.

**7) విద్యా సంస్థల స్థాపకుడు, ఉన్నత విద్యావేత్త,** 1960-12-30 జనన సమయం 7.30 P.M (IST) Lat $16^0$N Long 80E

## భావములు

2-శ॥కు॥కే

10-శు॥ రా॥ గు

11-కు॥ శ॥ బు॥

దశమభావ సబ్‌లార్డు అయిన గురుడు షష్ఠలాభాధిపతి అయి, ద్వితీయమందున్న శుక్రుని నక్షత్రమందున్నాడు. శుక్రుడు లాభభావాధిపతి అయిన కుజుని నక్షత్రమందున్నాడు. గురుకారత్వము ననుసరించి కళ్ళాఆల ప్రారంభించడం, శుక్ర, కుజ సంబంధము చేత రెసిడెన్షియల్ విద్యావిధానం, ఈ రంగమందు విజయం జాతకుని జీవన విధానంగా నిర్దేశిస్తున్నాయి.

**8)** గానకోకిల **లతామంగేష్కర్** 1929-9-28 జనన సమయం 9.51 P.M (IST) ఇండోర్ Lat $16^0$57 Long $82^0$13.

## భావములు

10-ర॥ ర॥ చ

11-బు॥ కు॥ శ

దశమభావ సబ్‌లార్డు చంద్రుడు కావడం వల్ల, వివిధమయిన వృత్తి వ్యాపారాలు జాతకుడు చేయడం జరిగింది. 36 సం॥ జ్యోతిష విద్యలో స్థిరపడ్డాడు. చంద్రుడు ద్వితీయ, పంచమాధిపతి అయిన గురుని నక్షత్రంలో ఉన్నాడు. ఈ గురుడు కేతువు నక్షత్రంలో ఉండటం చేత గురు-కేతు కారకత్వములవల్ల జ్యోతిషం, వేదవిహిత కర్మలవల్ల జీవనం రాణిస్తుంది.

మేషాది 12 రాశులకు సబ్‌లార్డు విభజన పద్ధతి 249 పట్టిక ద్వారా నిర్ణయించవచ్చు.

# మేషం

| రాశ్యాధిపతి | | నక్షత్రం | సబ్ | □□□□ | □□ |
|---|---|---|---|---|---|
| 1. | కుజ | కేతు | కే | 0-00-00 | 0-46-40 |
| 2. | కు- | కే- | శు | 0-46-40 | 3-0-0 |
| 3. | కు- | కే- | ర | 3-0-0 | 3-40-0 |
| 4. | కు- | కే- | చ | 3-40-0 | 4-46-40 |
| 5. | కు- | కే- | కు | 4-46-40 | 5-33-20 |
| 6 | కు- | కే- | రా | 5-33-20 | 7-33-20 |
| 7. | కు- | కే- | గు | 7-33-20 | 9-20-0 |
| 8. | కు- | కే- | శ | 9-20-0 | 11-26-40 |
| 9. | కు- | కే- | బు | 11-26-40 | 13-20-0 |
| 10. | కుజ | శుక్ర | శు | 13-20-0 | 15-33-20 |
| 11. | కు- | కు- | ర | 15-33-20 | 16-13-20 |
| 12. | కు- | శు- | చ | 16-13-20 | 17-20-0 |
| 13. | కు- | శు- | కు | 17-20-0 | 18-6-40 |
| 14. | కు- | శు- | గు | 20-6-40 | 21-53-20 |
| 15. | కు- | శు- | గు | 20-6-40 | 21-53-20 |
| 16. | కు- | శు- | శ | 21-53-20 | 24-0-0 |
| 17. | కు- | శు- | బు | 24-0-0 | 25-53-20 |
| 18. | కు- | శు- | కే | 25-53-20 | 26-40-0 |
| 19. | కు- | రవి | ర | 26-40-0 | 27-20-0 |
| 20. | కు- | ర- | చ | 27-20-0 | 28-26-40 |
| 21. | కు- | ర- | కు | 28-26-40 | 29-13-20 |
| 22. | కు- | ర- | రా | 29-13-20 | 30-0-0 |

# వృషభం

| రాశ్యాధిపతి | నక్షత్రం | సబ్ | □□□□ | □□ |
|---|---|---|---|---|
| 23. శు– | ర– | రా | 0–0–0 | 1–13–20 |
| 24. శు– | ర– | గు | 1–13–20 | 3–0–0 |
| 25. శు– | ర– | శ | 3–0–0 | 5–6–40 |
| 26. శు– | ర– | బు | 5–6–40 | 7–0–0 |
| 27. శు– | ర– | కే | 7–0–0 | 7–46–40 |
| 28. శు– | ర– | శు | 7–46–40 | 10–0–0 |
| 29. శు– | చ– | చ | 10–0–0 | 11–6–40 |
| 30. శు– | చ– | కు | 11–6–40 | 11–53–20 |
| 31. శు– | చ– | గు | 13–53–20 | 15–40–0 |
| 32. శు– | చ– | గు | 13–53–20 | 15–40–0 |
| 33. శు– | చ– | శ | 15–40–0 | 17–46–40 |
| 34. శు– | చ– | బు | 17–46–40 | 19–40–0 |
| 35. శు– | చ– | కే | 19–40–0 | 20–26–40 |
| 36. శు– | చ– | కు | 20–26–40 | 22–40–0 |
| 37. శు– | చ– | ర | 22–40–0 | 23–20–0 |
| 38. శు– | కు– | కు | 23–20–0 | 24–6–40 |
| 39. శు– | కు– | రా | 24–6–40 | 26–6–40 |
| 40. శు– | కు– | గు | 26–6–40 | 27–53–20 |
| 41. శు– | కు– | శ | 27–53–20 | 30–0–0 |

# మిధునం

| రాశ్యాధిపతి | నక్షత్రం | సబ్ | □□□□ | □□ |
|---|---|---|---|---|
| 42 బు– | కు– | బు | 0–00–00 | 1–53–20 |
| 43 బు– | కు– | కే | 1–53–20 | 2–40–00 |
| 44 బు– | కు– | శు | 2–40–00 | 4–53–20 |
| 45 బు– | కు– | ర | 4–53–20 | 5–33–20 |
| 46 బు– | కు– | చ | 5–33–20 | 6–40–00 |
| 47 బు– | రా– | రా | 6–40–00 | 8–40–0 |
| 48 బు– | రా– | గు | 8–40–00 | 10–26–40 |
| 49 బు– | రా– | శ | 10–26–40 | 12–33–20 |
| 50 బు– | రా– | బు | 12–33–20 | 14–26–40 |
| 51 బు– | రా– | కే | 14–26–40 | 15–13–20 |
| 52 బు– | రా– | శు | 15–13–20 | 17–26–40 |
| 53 బు– | రా– | ర | 17–26–40 | 8–6–40 |
| 54 బు– | రా– | చ | 18–6–40 | 19–13–20 |
| 55 బు– | రా– | కు | 19–13–20 | 20–0–0 |
| 56 బు– | రా– | కు | 19–13–20 | 20–0–0 |
| 57 బు– | గు– | శ | 21–26–40 | 23–53–20 |
| 58 బు– | గు– | బు | 23–53–20 | 25–46–40 |
| 59 బు– | గు– | కే | 26–33–20 | 28–46–40 |
| 60 బు– | గు– | శు | 26–33–20 | 28–46–40 |
| 61 బు– | గు– | ర | 28–46–40 | 29–26–40 |
| 62 బు– | గు– | చ | 29–26–40 | 30–0–0 |

# కర్కాటకం

| రాశ్యాధిపతి | నక్షత్రం | సబ్ | □□□□ | □□ |
|---|---|---|---|---|
| 63. చ– | గు– | చ | | 0–33–20 |
| 64. చ– | గు– | కు | 0–33–20 | 1–20–0 |
| 65. చ– | గు– | రా | 1–20–0 | 3–20–0 |
| 66. చ– | శ– | శ | 3–20–0 | 5–26–40 |
| 67. చ– | శ– | బు | 5–26–40 | 7–20–0 |
| 68. చ– | శ– | కే | 7–20–0 | 8–6–40 |
| 69. చ– | శ– | శు | 8–6–40 | 10–20–00 |
| 70. చ– | శ– | ర | 10–20–00 | 11–0–0 |
| 71. | చ– | చ | 11–0–0 | 12–6–40 |
| 72. చ– | శ– | కు | 12–6–40 | 12–53–20 |
| 73. చ– | శ– | రా | 19–53–20 | 14–53–20 |
| 74. చ– | శ– | గు | 14–53–20 | 16–40–0 |
| 75. చ– | బు– | బు | 16–40–0 | 18–33–20 |
| 76. చ– | బు– | కే | 18–33–20 | 19–20–0 |
| 77. చ– | బు– | శు | 19–20–0 | 21–33–20 |
| 78. చ– | బు– | చ | 22–13–20 | 23–20–00 |
| 79. చ– | బు– | చ | 22–13–20 | 23–20–00 |
| 80. చ– | బు– | కు | 23–20–0 | 24–6–40 |
| 81. చ– | బు– | రా | 24–6–40 | 26–6–40 |
| 82. చ– | బు– | గు | 26–6–40 | 27–53–20 |
| 83. చ– | బు– | శ | 27–53–20 | 30–0–0 |

# సింహం

| రాశ్యాధిపతి | నక్షత్రం | సబ్ | □□□□ | □□ |
|---|---|---|---|---|
| 84. | కే– | కే | 0–0–00 | 0–46–40 |
| 85. ర– | కే– | శు | 0–46–40 | 3–0–0 |
| 86. ర– | కే– | ర | 3–0–0 | 3–40–0 |
| 87. ర– | కే– | చ | 3–40–0 | 4–46–40 |
| 88. ర– | కే– | కు | 4–46–40 | 5–33–20 |
| 89. ర– | కే– | రా | 5–33–20 | 7–33–20 |
| 90. ర– | కే– | గు | 7–33–20 | 9–20–0 |
| 91. ర– | కే– | శ | 9–20–0 | 11–26–40 |
| 92. ర– | కే– | బు | 11–26–40 | 13–20–0 |
| 93. ర– | శు– | ర | 15–33–20 | 16–13–20 |
| 94. ర– | శు– | ర | 15–33–20 | 16–13–20 |
| 95. ర– | శు– | చ | 16–13–20 | 17–20–0 |
| 96. ర– | శు– | కు | 17–20–0 | 18–6–40 |
| 97. ర– | శు– | రా | 18–6–40 | 20–6–40 |
| 98. ర– | శు– | గు | 20–6–40 | 21–53–20 |
| 99. ర– | శు– | శ | 21–53–20 | 24–0–0 |
| 100. ర– | శు– | బు | 24–0–0 | 25–53–20 |
| 101. ర– | శు– | కే | 25–53–20 | 26–40–0 |
| 102. ర– | ర– | ర– | 26–40–0 | 27–20–0 |
| 103. ర– | ర– | చ | 27–20–0 | 28–26–40 |
| 104. ర– | ర– | కు | 28–26–40 | 29–13–20 |
| 105. ర– | ర– | రా | 29–13–20 | 30–0–0 |

# కన్య

| రాశ్యాధిపతి | నక్షత్రం | సబ్ | □□□□ | □□ |
|---|---|---|---|---|
| 106. బు– | ర– | రా | 0–0–00 | 1–13–20 |
| 107. బు– | ర– | గు | 1–13–20 | 3–0–0 |
| 108. బు– | ర– | శ | 3–0–0 | 5–6–40 |
| 109. బు– | ర– | బు | 5–6–40 | 7–0–0 |
| 110. బు– | ర– | కే | 7–0–0 | 7–46–40 |
| 111. బు– | ర– | శు | 7–46–40 | 10–0–0 |
| 112. బు– | చ– | చ | 10–0–0 | 11–6–40 |
| 113. బు– | చ– | కు | 11–6–40 | 11–53–20 |
| 114. బు– | చ– | రా | 11–53–20 | 15–40–0 |
| 115. బు– | చ– | గు | 13–53–20 | 15–40–0 |
| 116. బు– | చ– | శ | 15–40–0 | 17–46–40 |
| 117. బు– | చ– | బు | 17–46–40 | 19–40–0 |
| 118. బు– | చ– | కే | 19–40–0 | 20–26–40 |
| 119. బు– | చ– | శు | 20–26–40 | 22–40–0 |
| 120. బు– | చ– | ర | 20–40–0 | 23–20–0 |
| 121. బు– | కు– | కు | 23–20–0 | 24–6–40 |
| 122. బు– | కు– | రా | 24–6–40 | 26–6–40 |
| 123. బు– | కు– | గు | 26–6–40 | 27–53–20 |
| 124. బు– | కు– | శ | 27–53–20 | 30–0–0 |

# తుల

| రాశ్యాధిపతి | నక్షత్రం | సబ్ | □□□□ | □□ |
|---|---|---|---|---|
| 125. శు- | కు- | బు | 0-0-00 | 1-53-20 |
| 126. శు- | కు- | కే | 1-53-20 | 2-40-0 |
| 127. శు- | కు- | శు | 2-40-0 | 4-53-20 |
| 128. శు- | కు- | ర | 4-53-20 | 5-33-20 |
| 129. శు- | కు- | చ | 5-33-20 | 6-40-0 |
| 130. శు- | రా- | రా | 6-40-0 | 8-40-0 |
| 131. శు- | రా- | గు | 8-40-0 | 10-26-40 |
| 132. శు- | రా- | శ | 10-26-40 | 12-33-20 |
| 133. శు- | రా- | బు | 12-33-20 | 14-26-40 |
| 134. శు- | రా- | కే | 14-26-40 | 15-13-20 |
| 135. శు- | రా- | శు | 15-13-20 | 17-26-40 |
| 136. శు- | రా- | ర | 17-26-40 | 17-26-40 |
| 137. శు- | రా- | చ | 18-6-40 | 19-13-20 |
| 138. శు- | రా- | కు | 19-13-20 | 20-0-0 |
| 139. శు- | గు- | గు | 20-0-0 | 21-46-40 |
| 140. శు- | గు- | శ | 20-46-40 | 23-53-20 |
| 141. శు- | గు- | బు | 23-53-20 | 25-46-40 |
| 142. శు- | గు- | కే | 25-46-40 | 26-33-20 |
| 143. శు- | గు- | శు | 26-33-20 | 28-46-40 |
| 144. శు- | గు- | ర | 28-46-40 | 29-26-40 |
| 145. శు- | గు- | చ | 29-26-40 | 30-0-0 |

# వృశ్చికం

| రాశ్యాధిపతి | నక్షత్రం | సబ్ | □□□□ | □□ |
|---|---|---|---|---|
| 146. కు– | గు– | చ | 0–0–00 | 0–33–20 |
| 147. కు– | గు– | కు | 0–33–20 | 1–20–0 |
| 148. కు– | గు– | రా | 1–20–0 | 3–20–0 |
| 149. కు– | శ– | శ | 3–20–0 | 5–26–40 |
| 150. కు– | శ– | బు | 5–26–40 | 7–20–0 |
| 151. కు– | శ– | కే | 7–20–0 | 8–6–40 |
| 152. కు– | శ– | శు | 8–6–40 | 10–20–0 |
| 153. కు– | శ– | ర | 10–20–0 | 11–0–0 |
| 154. కు– | శ– | చ | 11–0–0 | 12–6–40 |
| 155. కు– | శ– | కు | 12–6–40 | 12–53–20 |
| 156. కు– | శ– | రా | 12–53–20 | 14–53–20 |
| 157. కు– | శ– | గు | 14–53–20 | 16–40–0 |
| 158. కు– | బు– | బు | 16–40–0 | 18–33–20 |
| 159. కు– | బు– | కే | 18–33–20 | 19–20–0 |
| 160. కు– | బు– | శు | 11–20–0 | 21–33–20 |
| 161. కు– | బు– | ర | 21–33–20 | 22–13–20 |
| 162. కు– | బు– | చ | 22–13–20 | 23–20–0 |
| 163. కు– | బు– | కు | 23–20–0 | 24–6–40 |
| 164. కు– | బు– | రా | 24–6–40 | 26–6–40 |
| 165. కు– | బు– | గు | 26–6–40 | 27–53–20 |
| 166. కు– | బు– | శ | 27–53–20 | 30–0–0 |

# ధనస్సు

| రాశ్యాధిపతి | నక్షత్రం | సబ్ | □□□□ | □□ |
|---|---|---|---|---|
| 167. గు– | కే– | కే | 0–0–0 | 0–46–40 |
| 168. గు– | కే– | శు | 0–46–40 | 3–0–0 |
| 169. గు– | కే– | ర | 3–0–0 | 3–40–0 |
| 170. గు– | కే– | చ | 3–40–0 | 4–46–40 |
| 171. గు– | కే– | కు | 4–46–40 | 5–33–20 |
| 172. గు– | కే– | రా | 5–33–20 | 7–33–20 |
| 173. గు– | కే– | గు | 7–33–20 | 9–20–0 |
| 174. గు– | కే– | శ | 9–20–0 | 11–26–40 |
| 175. గు– | కే– | బు | 11–26–40 | 13–20–0 |
| 176. గు– | శు– | శు | 13–20–0 | 15–33–20 |
| 177. గు– | శు– | ర | 15–33–20 | 16–13–20 |
| 178. గు– | శు– | చ | 16–13–20 | 17–20–0 |
| 179. గు– | శు– | కు | 17–20–0 | 18–6–40 |
| 180. గు– | శు– | రా | 18–6–40 | 20–6–40 |
| 181. గు– | శు– | గు | 20–6–40 | 21–53–20 |
| 182. గు– | శు– | శ | 21–53–20 | 24–0–0 |
| 183. గు– | శు– | బు | 24–0–0 | 25–53–20 |
| 184. గు– | శు– | కే | 25–53–20 | 26–40–0 |
| 185. గు– | ర– | ర | 26–40–0 | 27–20–0 |
| 186. గు– | ర– | చ | 27–20–0 | 28–26–40 |
| 187. గు– | ర– | కు | 28–26–40 | 29–13–20 |
| 188. గు– | ర– | రా | 29–13–20 | 30–0–0 |

# మకరం

| రాశ్యాధిపతి | నక్షత్రం | సబ్ | □□□□ | □□ |
|---|---|---|---|---|
| 189. శ– | ర– | రా | 0–0–0 | 1–13–20 |
| 190. శ– | ర– | గు | 1–13–20 | 3–0–0 |
| 191. శ– | ర– | శ | 3–0–0 | 5–6–40 |
| 192. శ– | ర– | బు | 5–6–40 | 7–0–0 |
| 193. శ– | ర– | కే | 7–0–0 | 7–46–40 |
| 194. శ– | ర– | శు | 7–46–40 | 10–0–0 |
| 195. శ– | చ– | చ | 10–0–0 | 11–6–40 |
| 196. శ– | చ– | కు | 11–6–40 | 11–53–20 |
| 197. శ– | చ– | రా | 11–53–20 | 13–53–20 |
| 198. శ– | చ– | గు | 13–53–20 | 15–40–0 |
| 199. శ– | చ– | శ | 15–40–0 | 17–46–40 |
| 200. శ– | చ– | బు | 17–46–40 | 19–40–0 |
| 201. శ– | చ– | కే | 19–40–0 | 20–26–40 |
| 202. శ– | చ– | శు | 20–26–40 | 22–40–0 |
| 203. శ– | చ– | ర | 22–40–0 | 23–20–0 |
| 204. శ– | కు– | కు | 23–20–0 | 24–6–40 |
| 205. శ– | కు– | రా | 24–6–40 | 26–6–40 |
| 206. శ– | కు– | గు | 26–6–40 | 27–53–20 |
| 207. శ– | కు– | శ | 27–53–20 | 30–0–0 |

# కుంభం

| రాశ్యాధిపతి | నక్షత్రం | సబ్ | □□□□ | □□ |
|---|---|---|---|---|
| 208. శ- | కు- | బు | 0-0-0 | 1-53-20 |
| 209. శ- | కు- | కే | 1-53-20 | 2-40-0 |
| 210. శ- | కు- | శు | 2-40-0 | 4-53-20 |
| 211. శ- | కు- | ర | 4-53-20 | 5-33-20 |
| 212. శ- | కు- | చ | 5-33-20 | 6-40-0 |
| 213. శ- | రా- | రా | 6-40-0 | 8-40-0 |
| 214. శ- | రా- | గు | 8-40-0 | 10-26-40 |
| 215. శ- | రా- | శ | 10-26-40 | 12-33-20 |
| 216. శ- | రా- | బు | 12-33-20 | 14-26-40 |
| 217. శ- | రా- | కే | 14-26-40 | 15-13-20 |
| 218. శ- | రా- | శు | 15-13-20 | 17-26-40 |
| 219. శ- | రా- | ర | 17-26-40 | 18-6-40 |
| 220. శ- | రా- | చ | 18-6-40 | 19-13-20 |
| 221. శ- | రా- | కు | 19-13-20 | 20-0-0 |
| 222. శ- | గు- | గు | 20-0-0 | 21-46-40 |
| 223. శ- | గు- | శ | 21-46-40 | 23-53-20 |
| 224. శ- | గు- | బు | 23-53-20 | 25-46-40 |
| 225. శ- | గు- | కే | 25-46-40 | 26-33-20 |
| 226. శ- | గు- | శు | 26-33-20 | 28-46-40 |
| 227. శ- | గు- | ర | 28-46-40 | 29-26-40 |
| 228. శ- | గు- | చ | 29-26-40 | 30-0-0 |

# మీనం

| రాశ్యాధిపతి | నక్షత్రం | సబ్ | □□□□ | □□ |
|---|---|---|---|---|
| 229. గు- | గు- | చ | 0-00-00 | 0-33-20 |
| 230. గు- | గు- | కు | 0-33-20 | 1-26-0 |
| 231. గు- | గు- | రా | 1-20-0 | 3-20-0 |
| 232. గు- | శ- | శ | 3-20-0 | 5-26-40 |
| 233. గు- | శ- | బు | 5-26-40 | 7-20-0 |
| 234. గు- | శ- | కే | 7-20-0 | 8-6-40 |
| 235. గు- | శ- | శు | 8-6-40 | 10-20-0 |
| 236. గు- | శ- | ర | 10-20-0 | 11-0-0 |
| 237. గు- | శ- | చ | 11-0-0 | 12-6-40 |
| 238. గు- | శ- | కు | 12-6-40 | 12-53-20 |
| 239. గు- | శ- | రా | 12-53-20 | 14-53-20 |
| 240. గు- | శ- | గు | 14-53-20 | 16-40-0 |
| 241. గు- | బు- | బు | 16-40-0 | 18-33-20 |
| 242. గు- | బు- | కే | 18-33-20 | 19-20-0 |
| 243. గు- | బు- | శు | 19-20-0 | 21-33-20 |
| 244. గు- | బు- | ర | 21-33-20 | 22-13-20 |
| 245. గు- | బు- | చ | 22-13-20 | 23-20-0 |
| 246. గు- | బు- | కు | 23-20-0 | 24-6-40 |
| 247. గు- | బు- | రా | 24-6-40 | 26-6-40 |
| 248. గు- | బు- | గు | 26-6-40 | 27-53-20 |
| 249. గు- | బు- | శ | 27-53-20 | 30-0-0 |

శ్లో॥ చంద్రోగురు భృగుస్సౌమ్యాః కేంద్రస్థానేషుగా యది।
ధనంవిద్యాసుఖంభోగః శాస్త్రాభ్యాసన తత్పరః॥ -జా.అ. సారం

**తా॥** చంద్ర-గురు-శుక్ర-బుధులు కేంద్రములందున్నచో జాతకుడు విద్యావంతుడు, ధనవంతుడు, భోగి అగును.

లగ్నమునకు దశమాంశ గుణించి, నవగ్రహములకు దశమాంశ కట్ట వలయును. రాశియందుగల దశమాధిపతి దశాంశమందు ఏ స్థానములో ఉండెనో అతని కారకత్వములో జాతకుని జీవన వ్యవహారముండును. దశమాంశ చక్రములో దశమస్థానమునుబట్టి కూడా జాతకుని వృత్తి నిర్ణయించవచ్చును. లగ్నము-దశమాంశ లగ్నములో బలవత్తరమైనది గ్రహించవలయును.

శ్లో॥ భాగ్యాధిపశ్చాష్టమస్థ స్తద్దాయేనైనవయోగదః।
భాగ్యాధిపోపిచ గురుహ్యాస్టమస్థోతి భాగ్యదః॥

**తా॥** 9వ స్థానాధిపతి 8లోఉన్న భాగ్యాధిపతి దశయోగించదు. కాని గురుడు నవమాధిపతియై అష్టమందున్న జాతకుడు విశేషయోగము పొందును. వృత్తి-వ్యాపార-ఉద్యోగములు రాణించును.

శ్లో॥ తృతీయాష్టమ భాగ్యస్థో గురుర్యోగ ప్రదోభవేత్।
రాజ్యేశ పంచమే శేతౌ తత్రైవాధిక్యయోగదే॥

**తా॥** 3-8-9- స్థానములందు గురుడు యోగించును. 10-5 స్థానములందున్నచో గొప్పయోగమును కలుగజేయుదురు.

కర్మాధిపతి 6-8-12 స్థానములోనున్ననూ, బుధరాహువులు 10లో ఉన్నచో జాతకుడు గొప్ప ఉద్యోగముగాని, మంచి వ్యాపారముగాని చేయును.

దశమమందు రవిశనులున్న జాతకుడు అపకీర్తి పొందును. ఇది వృశ్చికలగ్నము నకు వర్తించదు.

శ్లో॥ కర్మస్థానేతు చత్వారౌ గ్రహాస్తిష్ఠంతి చేత్తదా।
పశ్యంతి యదివాజాతః ప్రవ్రజాయోగమాదిశేత్॥

**తా॥** దశమమందు 4 గ్రహములున్ననూ, 4 గ్రహములు దశమమును చూచిననూ జాతకుడు జ్ఞానిగాని, సన్యాసిగాని అగును.

దశమము జాతకుని, వృత్తి–ఉద్యోగ–వ్యాపార రంగములను తెలియజేయును. ఏ కర్మవలన జాతకుడు జీవనము పొందును. ఏ రంగములో జీవితము గడచును. ఈ విషయములు లగ్న–చంద్రరాశి రవిరాశి నుంచి పరిశీలించవలయును. దశమాంశ చక్రము వలన కూడా చెప్పవచ్చును.

5–10 అధిపతులు కేంద్రకోణములందు విశేషయోగము చేయుదురు.

## 11. లాభ భావము

**శ్లో॥ లాభస్థానే గురుయుతే ధనే చంద్ర సమన్వితే।**
**భాగ్యస్థానం గతే శుక్రే షట్ సహస్రాధికో భవేత్‌॥ – జా.అమృతం**

**తా॥** 11లో గురుడు 2లో చంద్రుడు ఉండి 9లో శుక్రుడున్న జాతకుడు 6లక్షల ధనవంతుడగును.

లాభస్థానమందున్న గ్రహ స్వభావ జీవ కారకత్వముల ననుసరించి జాతకుడు ఆయా పదార్థముల వలన, వారి వారి జీవబంధువుల వలన ధనలాభము పొందును.

## 12. వ్యయ భావం

**శ్లో॥ వ్యయాధిపే షష్ఠ సంస్థే షష్ఠేశే వ్యయభావగే।**
**ఋణంకృత్వావ్యయం కుర్యాన్మాన హాని మావాప్నుయాత్‌॥**

**తా॥** 12–6 అధిపతులకు పరివర్తనయోగము కలిగినచో జాతకుడు అప్పుచేసి పప్పుకూడు తినును. బాకీ ఇచ్చిన వారి వలన అవమానములు పొందును.

**శ్లో॥ వ్యయ రాజ్యాధిపత్యోశ్చ సంబంధోయది విద్యతే।**
**దేవాంశకస్థితే వాపి జ్ఞానసిద్ధి మవాప్నుయాత్‌॥ జా.అ.**

**తా॥** 12–10 అధిపతులకు సంబంధమ్నుచో, జాతకుడు జ్ఞానసిద్ధిపొందును. వీరు దేవాంశలయందున్ననూ జాతకుడు గొప్ప జ్ఞాని అగును.

వ్యయమందు చంద్రుడు, బుధుడు, గురుడు, శుక్రుడు, శీఘ్ర సంపాదనా – త్వరిత వ్యయము అగును.

వ్యయాధిపతి లాభమందున్న ఎడల జాతకుడు పిసినారి అగును. దశమాధిపతి వ్యయమందున్న ఎడల అభిమానవంతుడు, డాబుసరి ఖర్చులు చేయువాడు అగును. ధనవ్యయము చేసి అవమానములకు గురియగును.

లగ్నాధిపతి వ్యయమునుండి, షష్ఠాధిపతిచే చూడబడిన, శని రాహువులతో కలసిన జాతకునికి శయన సుఖముండదు.

**శ్లో॥ వ్యయస్థానే కేతుగురూ శుభగ్రహ నిరీక్షితౌ।**
**అనాయాసేన మరణం జాతకస్య న సంశయః॥**

**తా॥** వ్యయస్థానమందు కేతుగురులుండి, శుభగ్రహములచే చూడబడిరేని జాతకునికి అనాయాసమరణము కలుగును. పాపగ్రహసంబంధమున్నచో చాలా బాధపడి మరణించును.

వ్యయమందు పాపగ్రహములున్నచో శ్రమపడి మరణించి, పునర్జన్మ పొందును. లగ్నవ్యయాధిపతులకు, కర్మాధిపతి సంబంధమున్నచో జాతకుడు యోగాబ్యాసి అగును. 10-12 అధిపతులకు సంబంధమున్నచో జాతకుడు జ్ఞానవంతుడగును.

**శ్లో॥ పుణ్యంవా పృథపాపరూపమపివా కర్మార్జితం ప్రాగ్భవేత్।**
**తత్ పాకోత్రతుఖేచరస్య హిదశా భుక్త్యాదిభిర్జ్ఞాయతే॥**

**తా॥** పూర్వజన్మమందు చేసిన శుభ శుభకర్మ ఫలితములు, ఈ జన్మమునందు దశాంతర్దశలలో గ్రహములు సూచించును.

అనిష్టఫలములు సూచింపబడినపుడు జప-దాన-అర్చనాదుల వలన, మణి-మంత్ర-ఔషధుల వలన శాంతిని చేసుకొని సుఖము పొందవలయును.

# వర్గోత్తమాంశ

**శ్లో॥ రాశితశ్చాంశత ఖేటః ఏకస్థానగతోయది**
**వర్గోత్తమాంశం తం ప్రాహుః జ్యోతిషార్ణవపారగాః॥**

**తా॥** ఏ గ్రహమైనా, రాశియందును, అంశచక్రమునందును ఒకే రాశి యందున్నచో, ఆ గ్రహము వర్గోత్తమాంశపొందినట్లు భావించవలయును.

# జ్యోతిషశాస్త్రము తప్పుటకు 5 కారణములు

శ్లో॥ అనేక వక్త్రోద్భవ భిన్నభావైః
పంచాంగభేదైశ్చ, కలినా చ కించిత్
అనిచ్ఛతా గర్భగతేన వక్తుం
అనుల్బణం జాతక భాగమజ్ఞైః॥

**తా॥** జ్యోతిష శాస్త్రమందలి జాతక ఫలితముల తప్పుగుటకు 5 కారణములున్నవి. 1-పూర్వ ఋషులలో అభిప్రాయ భేదములు 2.పంచాంగ భేదములు (ఉదాహరణ:- కె.పి.అయనాంశ బి.వి.రామన్ అయనాంశలకు 1 డిగ్రీ 20ని॥ల తేడా ఉన్నది. దీనివలన జన్మకాలదశాశేషము తేడావచ్చును). 3.కలికాల మహిమ 4.శాస్త్ర రహస్యములను శిష్యులకు, గురువులు పూర్తిగా చెప్పకపోవుట. 5.శాస్త్ర పాండిత్యము పూర్తిగా తెలియనివారు జ్యోతిషము చెప్పుట ఈ ఐదు జాతక ఫల వైఫల్యమునకు హేతువులగుచున్నవి.

# వీరికి జాతకఫలము చెప్పరాదు

శ్లో॥ నోదీరయే దుక్తమపివృధాతత్
విశ్వాసహీనాయచ నాస్తికాయ।
అనర్థదాయావినయాయ నిత్యం
కుశంకినే వా బహుగర్వ్యావాచే॥

**తా॥** నమ్మకము లేనివారికి, దేవుడు లేదను నాస్తికులకు - డబ్బు ఇవ్వనివారికి - వినయము లేనివారికి - అన్నింటినీ సందేహించు వారికి - అతిగా మాట్లాడువానికి - జాతకము చెప్పరాదు. చెప్పినచో ఫలించదు.

# దరిద్రయోగములు

శ్లో॥ లగ్నాధీశో వ్యయస్థోవై సక్రూరోవా విశేషతః
నిర్బలోస్తంగతో సౌమ్యః నిర్ధవ్యో జాయతే నరః।
సకలకేంద్రగతాః ఖలఖేచారః రిపురాక్రమలాభగతాః

శుభాః సకలవీర్యపరాక్రమ వర్జితాఃసుఖలయోర్మనుఖలునిర్ధనః
లగ్నాధినాధోధ సుఖాధినాధః కర్మాధినాభోధ ధనాధిపశ్చ
వ్యయేరిపేకాలమందేగృహేచ గతావివీర్యాఃఖలునిర్ధనోజనః॥
- యవనాచార్యులు

**తా॥** లగ్నాధిపతి 12వ స్థానములో నుండి క్రూర సంబంధం పొందిననూ, బుధుడు అస్తంగతుడైననూ జాతకుడు దరిద్రుడగును. పాపులు 1-4-7-10లో నుండి శుభులు 6-11లో శుభులు బలహీనులైన దరిద్రుడగున. లగ్న-చతుర్ధ-దశమ- ధనాధిపతులు 12-6- శనిగృహములలో బలహీనులై యుండినను జాతకుడు నిర్ధనుడగును.

శ్లో॥ నీచస్థితా జన్మనియేగ్రహేంద్రాః
స్వోచ్చాంశగా రాజసమాన భాగ్యాః।
ఉచ్చస్థితా చేదపి నీచభాగాః
గ్రహోన కుర్వంతి తథైవ భాగ్యమ్॥ - సర్వార్థ చింతామణి

**తా॥** జాతకుని జన్మకాలమందు రాశిలో నీచలోనున్న గ్రహము అంశలో ఉచ్చలో నున్నచో రాజతుల్యమైన భోగములునిచ్చును. రాశిలో ఉచ్చలో ఉండి అంశలో నీచలొ నున్నచో జాతకుడు నిర్ధనుడగును.

# షడ్జన్మ నక్షత్రములు

శ్లో॥ జన్మభం జన్మనక్షత్రం దశమం కర్మ సంజ్ఞకం
సాంఘాతికమితిప్రోక్తం ఋక్షం షోడశ సంఖ్యయా।
ఏకోన వింశదీధానం త్రయోవింశద్వి నాశనం
అష్టాదశంచ నక్షత్రం సాముదాయక సంజ్ఞికం।
జాతిర్దేశోభిషేకస్తు చతుర్భానుస్త్రయోదశం
పంచవింశం మానసంచ సప్తమం నైధనం స్మృతమ్॥ -కర్ణామృతం

**తా॥** జన్మ నక్షత్రము నుండి 6 జన్మనక్షత్ర సంజ్ఞలు కలవు. వీటి యందు శుభకర్మలు జాతకుడు ఆచరించరాదు.

| ఉదాహరణము | జన్మ నక్షత్రము | ధనిష్ట |
|---|---|---|
| ధనిష్ఠా నక్షత్రం | | |
| నుండి | 10 కర్మ | మృగశిర |
| | 16 సాంఘాతికం | పుబ్బ |
| | 19 ఆధానం | చిత్త |
| | 23 వైనాశికం | జ్యేష్ఠ |
| | 18 సాముదాయం | హస్త |
| | 4 జాతి | ఉత్తరాభాద్ర |
| | 12 దేవం | పునర్వసు |
| | 13 అభిషేకం | పుష్యమి |
| | 25 మానసం | పూర్వాషాఢ |
| | 7 నైధనం | భరణి |

## వక్రగతి

గోచారములో సూర్యుదున్న నక్షత్రము నుండి 10-11 నక్షత్రములందు కుజుదు సంచరించునపుడు దండవేధ అందురు. దీనినే అనువక్రమందురు.

12-13-14 నక్షత్రములందు సంచరించునపుడు వక్రగతి పొందును. శనికి కూడా ఇట్లే చూడవలయును.

## అశుభ ఫలం

**శ్లో ॥ జన్మత్త్రయ స్థితస్సౌరీ క్షేమాయాం రాహుభూమి జౌ।**
**మిత్రాతి మిత్రగే సూర్యే జాయతే వధ బంధనం॥**

**తా॥** జాతకునికి జన్మతారయందు శని- క్షేమతారలందు రాహు-కుజులు, మిత్ర పరమమిత్ర తారలందు రవి గోచారమందుయుండెనేని, అనేక కష్టములు కలుగును.

## శుభ ఫలం

**శ్లో ॥ జన్మత్రయే గరుర్యస్య క్షేమాయాం బుధ భార్గవౌ।**
**మిత్రాతిమిత్రగే చంద్రే సంపదాయుష్య వర్ధనం॥**

**తా॥** గోచారరీత్యా జన్మతార యందు గురుడు, క్షేమతారలందు బుధ–శుక్రులు, మిత్ర–పరమమిత్ర తారలందు చంద్రుడు సంచరించునపుడు, జాతకుడు సంపత్ – సుఖ సంతోషములు పొందును.

**మేడవరపు సంపత్ కుమార్**

## గోచార దృష్టులు

**శ్లో ॥ జన్మర్క్ష్యో భానుదృష్టశ్చేత్ సర్వకార్య వినాశనం**
**జ్ఞేజీవే శుక్ర దృష్టశ్చేత్ సంపదాయుష్య వర్ధనమ్॥**

**తా॥** గోచార రీత్యా బుధ– గురు– శుక్రులు, జాతకుని జన్మ నక్షత్రమును చూచినచో సకల కార్యములు నెరవేరును రవి– కుజ–శనులు చూచినచో కష్టములు – అనారోగ్యం కలుగును.

**మేడవరపు సంపత్ కుమార్**

# అనుభవ - జ్యోతిష - నాడీ సూత్రములు

1. సూర్యుడు–శుక్రునితో కలసి, శుక్ర మిత్ర క్షేత్రంలో ఉంటే జాతకుని తండ్రి, వారసత్వపు ఆస్తి పొంది వుంటాడు.
2. సూర్య–శుక్రుల కలయిక, తండ్రి భోగజీవియని తెలియచేస్తుంది. జాతకుని వైవాహిక జీవితం కొంత అసంతృప్తిగా ఉంటుంది.
3. సూర్య–శనులు కలసి ఉంటే ప్రభుత్వోద్యోగం చేయడం గాని, ప్రభుత్వ ధనము కొంత అనుభవించడం గాని జరుగుతుంది.
4. సూర్య–కుజ–రాహువులు కలసియున్న చర్మరోగము.
5. సూర్యునకు 2వరాశిలో బుధ–చంద్రులున్న జాతకుడు సవితి తల్లిని కలిగినవాడగును.
6. సూర్యుడు–గురునితో కలసియున్న జాతకుడు దైవభక్తి కలవాడు – నమ్మదగిన వ్యక్తి అగును.
7. సూర్య–బుధ–రాహువులు ఒకే రాశియందున్న జాతకుని తండ్రి కష్టజీవి అయివుండును.

8. సూర్యుడు మేషరాశిలో ఉండి వృషభంలో శుక్రబుధులున్న జాతకుని తండ్రి వస్త్ర వ్యాపారి, రత్న వ్యాపారి అయి వుండును.
9. సూర్య–శనులు తులయందున్న, జాతకుని జన్మ సమయమునగాని, జన్మించిన కొద్దిరోజులలో గాని జాతకుని తండ్రి గొప్ప కష్టములు పొందును. లేదా ధన నష్టమైననూ పొందియుండును.
10. సూర్య–బుధులు కలసిఉన్న – ఉన్నత విద్యాయోగము.
11. కన్యారాశిలో సూర్యుడుండి – తులలో బుధ–శుక్రలున్న జాతకుని తండ్రి వస్త్ర వ్యాపారము చేయును.
12. సూర్య–శుక్రులు కలసియున్నచో జాతకునికి చెల్లెళ్ళు ఉండరు.
13. సూర్య–కేతువులు కలసియున్న పిత్రార్జితం ఎక్కువగా నిలవదు. స్త్రీ జాతకములో 42–44 సం॥ల మధ్య భర్తకు అరిష్టము కలుగును.
14. సూర్య–కేతువులు కలసియుండి, వీరికి 2వస్థానములో బుధ–శుక్రులున్న జాతకుని తండ్రికి రెండు వివాహములగును.
15. సూర్యునికి వెనుక రాశిలో శనియున్న జాతకుడు – తన తండ్రి యొక్క వృత్తి – ఉద్యోగ – వ్యాపారములను తాను నిర్వహించును.
16. సూర్య–శుక్రులు కలసియుండి, వీరికి సప్తమమున శనియున్న జాతకునికి బాల్యమునందు పితృవియోగము కాని, తండ్రికి దూరముగా పెరుగుట గాని సంభవించును.
17. సూర్య–కుజులు కలసియున్న జన్మించిన గృహమునందు బావియుండును.
18. సూర్యుడు జలరాశులలో ఉన్నచో జాతకుడు, తన సంతానమువల్ల సమస్యలను ఎదుర్కొనును.
19. సూర్య–శుక్ర–శనులు కలసియున్న జాతకుడు – తన తండ్రికి యోగము కలిగించును. జాతకుని 2–9 సం॥నందు తండ్రికి గొప్పయోగము కలుగును.
20. సూర్య – బుధ – శుక్రులు కలసియున్న జాతకుడు – గొప్ప ధనవంతుడగును. వారసత్వపు ఆస్తిలో కొంత వివాదముండును. బంధువుల వల్ల కొన్ని సమస్యలుండును.

21. సూర్యుడు పితృకారకుడు కనుక, ఈ గ్రహమునకు ద్వితీయమునందు బుధుడు – తృతీయమునందు చంద్రుడున్న జాతకుని తండ్రి, ఉపాధ్యాయ లేదా న్యాయవాద వృత్తిలో జీవనము కలవాడగును.
22. సూర్య శుక్రులు ఒకే నక్షత్రములో నుండి 3 డిగ్రీలు మాత్రమే తేడా ఉన్నచో జాతకునికి స్త్రీ సంతానము ఎక్కువుగా నుండును. 2 కుమార్తెలు 1 కుమారుడు.
23. సూర్యుడు – శుక్రుని రాశులయిన వృషభ–తులలందున్నచో, జాతకుని తండ్రి వేదశాస్త్రములందు విశ్వాసమున్నవాడుగును.
24. సూర్యునకు ద్వితీయమందు గురుడున్నచో, జాతకుని తండ్రి నీతిమంతుడు – పవిత్రుడు అగును.
25. చంద్రునికి సప్తములో శుక్రుడున్నచో జాతకునికి యోగభంగమగును.
26. కుజ – రాహువులు కర్రపనిలేదా మిల్లుపని పేపర్‌మిల్లు మొదలగు వానిని సూచిస్తారు.
27. కుజగురులు మకరరాశి యందున్న జాతకుడు వారసత్వ రీత్యా భూములు, ఆస్తులు పొందును.
28. కుజ–బుధులు పరివర్తన చెందిన సోదరుని ద్వారా ధనలబ్ధి కలుగును.
29. కుజ–శనులు కలసియున్న జాతకుడు ఉద్యోగము పొందుటలో అనేక కష్టములు – ఇబ్బందులు పొందును.
30. కుజునకు 12లో శుక్రుడున్న జాతకునికి, వివాహము చాలా ఆలస్యముగా అగును. తనకంటే ముందుగా తమ్మునికి వివాహమగును.
31. బుధుడు విద్యకు కారకుడు – బుధుడు శత్రురాశిలో యుండి, బుధునికి 3వరాశిలో రాహువు – తదనంతర రాశిలో కుజుడు యున్న జాతకుని విద్య ఆటంకములతో యుండును.
32. బుధ–కేతువుల కలసియున్న గ్రంధకర్త యగును. మనోవిచారముండును. బహుగ్రంధవేత్త.
33. బుధునికి 7లో చంద్రుడున్నచో, జాతకుని తల్లి అపఖ్యాతి పొందును. లేదా దీర్ఘరోగం.

34. బుధుడు – ధనుస్సు రాశిలోనున్నచో, జాతకుని బుద్ధి చురుకుతనము కోల్పోవును. తల్లిదండ్రుల పెంపకము సక్రమముగా నుండదు.

35. గురుడు జాతకుని పేరు ప్రతిష్ఠలు – జీవన విధానం తెలియజేస్తాడు. జాతకుని జాతకచక్రములో గురుడున్న స్థితిని, ఒక రాశి వెనుకకు వేసిన అది జాతకుని గత జన్మను తెలియచేయును. సాధారణముగా గత జన్మకు – ప్రస్తుత జన్మకు 1సం॥ము అంతరముండును.

36. గురుని 1రాశి వెనుకకు జరిపినపుడు, గురుని రాశిలో 12లో రాహువు ఉన్నచో, అట్టి జాతకుడు తన కోర్కెలు తీర్చుకొనుటకు గత జన్మలో అనేక పాపములు చేసియుండును. దాని ఫలితముగా ఈ జన్మలో బాల్యము నందు తండ్రి మరణము లేదా తండ్రికి దూరముగా నుండుట లేదా స్వంత గృహము లేకపోవుట – బంధువులతో శతృత్వము – భార్యతో విరోధము – తల్లితో కలహము – సంభవించును. ఈ దోష పరిహారమునకు నారాయణ అష్టాక్షరి జరిపించవలయును.

37. గురునికి 12లో గ్రహములు లేనిచో జాతకుడు ప్రధమ సంతానమని గ్రహించవలయును.

38. గురుడు కుజునిరాశిలో నుండి, 2లో కేతువు వున్నచో జాతకుడు రైతు కుటుంబమునందు జన్మించెను.

39. గురు–కుజులు సమసప్తకములో నున్నచో జాతకుడు దుఃఖ ప్రదమైన వైవాహిక జీవితము కలవాడగును.

40. గురుడు – కేతువుతో కలసిన సుబ్రహ్మణ్యుని తెలియజేయును. జన్మస్థల సమీపములో దేవాలయముండును.

41. గురునికి 7లో శనియున్న, సత్వగుణము కలవాడు. బాల్యంలో కష్టములు. 29–33–37సం॥లలో ఇబ్బందులు. 30–36–42–43 సం॥లు యోగించును.

42. గురుడు వక్రించిన జాతకుడు దూరప్రాంతములో గొప్ప ఉద్యోగము చేయును.

43. గురునికి 5లో సూర్య – బుధ – కేతువులున్న 1 కుమారుడు – 2 కుమార్తె కలుగుదురు.

44. గురు-సూర్యులు సమసప్తకములో నున్న జాతకుని తండ్రి ప్రసిద్ధ వ్యక్తియని తెలియవలెను.
45. గురునికి 5లో చంద్రరాహువులున్న మాతృసౌఖ్యం తక్కువ.
46. గురుని దృష్టి రాహువు పైనున్న జాతకుని తాత జీవించియుండును.
47. గురునికి 7లో శుక్ర-శనులున్న గొప్ప జాతకము.
48. గురు - బుధులు కలసియున్న ఉన్నత విద్యావేత్తయగును. వీరికి 2లో కుజుదున్న, మెకానికల్ ఇంజనీరింగ్ చేయును.
49. గురుని అనంతరాశులలో చంద్రుడున్న జాతకుడు - ఇతర ప్రాంతములలో జీవనము పొందును.
50. గురు - శుక్రులు కలసియుండి, శుక్రుడు - చంద్రునితో పరివర్తన చెందిన భార్యకపట ప్రవర్తన కలది.
51. గురుచంద్రులు సమసప్తకమై ఒకటి జలరాశి అయినచో జాతకుని జననము ఒక చెరువు సమీపమున జరిగియుండును.
52. గురుడు తన అనంతర రాశిలో కుజుని కలిగియుండిన జాతకునికి తమ్ముడు ఉండును.
53. గురుడు కర్కాటకంలో ఉండి - బుధ, శుక్రులు మేషమందున్నచో జాతకుడు చాలా ప్రసిద్ధుడగును.
54. గురుడు తన అనంతర రాశులలో ముందుగా రాహువును, తరువాత కుజుని కలిగియున్నచో జాతకుడు మంత్రవేత్త అగును.
55. గురు-శుక్ర-కేతువులు ఒకే రాశియందున్న, గొప్పవాదనా పటిమ కలగును.
56. గురునికి 2వరాశిలో రాహువున్న పురాతన గృహములో జన్మించియుండును.
57. గురు-శనులు మానవుని జీవనమును తెలుపుదురు. వీరు కలసియున్న రాశికి 2లో కేతువు వున్నచో జ్యోతిష-వైద్యరంగములో జీవనము కలగును. గురు-శనులకు సప్తమములో శుక్రుడున్న జాతకుడు ఉన్నత పదవి పొందును.
58. గురు-బుధ-కుజులు కలసియున్న వైద్యుడగును. శస్త్ర చికిత్సా నిపుణుడగును.

59. గురు – బుధ – శుక్రులు కలసిన జాతకుడు విద్యాలయ స్థాపకుడు – యూనివర్శిటీలో ప్రొఫెసర్ అగును.
60. గురు – కేతువులు కలసియున్న సాధుస్వభావము కలవాడు. భక్తి– జ్ఞాన– వైరాగ్యములు కలవాడు అగును.
61. గురు – శుక్రులు పరస్పరం 6 – 8 స్థానములలో నున్న జాతకుడు కొంత కాలము భార్యతో ఎడబాటు పొందును.
62. గురుడు కర్కాటకంలో ఉన్న జాతకుని నాసిక చాలా అందముగా నుండును. (ఉచ్ఛ డిగ్రీలలో ఉండాలి)
63. కన్యారాశిలో గురు–కేతువులు కలసిన లేదా గురునికి వెనుక సింహరాశిలో కేతువు వున్న జాతకుడు మతాచారములను బాగుగా పాటించును.
64. గురు–శుక్రులు కలసిన జాతకునికి ఒక సోదరియుండును.
65. గురుడు గోచారరీత్యా జన్మకాల బుధునిరాశిలో సంచరించునపుడు శుభ ఫలితములు అభివృద్ధి కలుగును.
66. గురునికి 2లో రాహువు – 4లోశని – 5లో చంద్రుడు ఉన్న జాతకుడు అతి మూత్రవ్యాధి గలవాడగును. లేదా 48సం॥లో వాత వ్యాధులు కలుగును.
67. వక్రించిన గురుని – శుక్రుడు చూచినచో జాతకుడు తాను జన్మించిన గృహము నందు గాని – నగరము నందు గాని ఉండడు. దూరప్రాంతములో నివసించును.
68. గోచారారీత్యా గురుడు – జన్మకాల కర్కాటక శుక్ర గ్రహముపై సంచరింపునపుడు – వ్యసనములు – కలహములు కలుగును.
69. గురు – శనుల పరివర్తన స్వతంత్ర జీవనం.
70. ధనుర్మీన రాశులలో గురు–శనులు కలసి యుండి – అనంతర రాశులలో కేతువువున్న జాతకుడు స్వతంత్ర జీవనము కలవాడగును. పసుపు–ఎరుపు వస్తువుల వలన జీవించును.
71. గురు – కుజులు మీనంలో ఉండి అనంతర రాశులోల శని కేతువులున్న జాతకుడు 25 లేదా 32 సం॥లో వివాహితుడగును. జాతకుని సోదరులు ఉన్నత స్థానములో నుందురు.

72. మీన గురునికి 2లో శని కేతువులున్న సన్యాసయోగము. లేదా వైవాహిక జీవితం అసంతృప్తి సంతానం లేకపోవడం జరుగును.

73. గురు – బుధ – శుక్రులు సూర్యునితో కలసిన తండ్రి ధనికుడు – వ్యాపారమందు లాభములు పొందువాడగును.

74. గురునికి వెనుకరాశిలో శని–ముందు రాశులలో కేతువు వున్నచో జాతకునికి ఉదరకోశ వ్యాధులుండును.

75. గురు – రాహువులు జలరాశిలో యుండి, వారికి 2లో సూర్య – శుక్రులున్న ఆహార సంబంధమైన సంస్థల వలన జీవనము పొందును.

76. గురునకు 12లో రవియున్న, జాతకుని మధ్యవయస్సు వరకు మాత్రమే అతని తండ్రి జీవించును.

77. తుల – వృషభ రాశులలో గురు – శుక్రులు కలసిన గొప్ప వంశములో జన్మించుటగాని – గొప్ప ధనవంతుడు గాని అగును.

78. గురునకు 7లో కుజ – శుక్రులున్న జాతకుడు – బ్యాంక్ – చిట్‌ఫండ్ – ఫైనాన్స్ సంస్థలలో జీవనము పొందును. ఉన్నత స్థానమును పొందును.

**79. గురునిపై శనిదృష్టియున్న జాతకుడు - ఈశ్వరానుగ్రహమువలన జన్మించిన వాడని తెలియవలయును. సంతానము కొరకు తల్లిదండ్రులు ఇష్ట దైవమును - శివుని సేవించి సంతానము పొందినారని గ్రహించవలెను.**

80. గురుని వెనుక రాశిలో శుక్రుడున్న జాతకుడు షుగర్ వ్యాధిగాని – ఆసనరోగము గాని పొందును. గురు–శుక్రులు కలసియున్న జాతకునకు ఒకే మగ సంతానముండును.

81. శుక్రునికి 12లో గురుడున్న వైవాహిక జీవితము కొంత దుఃఖప్రదముగా నుండును.

82. శుక్రుడు కర్కాటకములో నున్న చంచల స్వభావి.

83. శుక్రునికి 2వ రాశిలో కుజుడున్న వివాహం ఆలస్యం.

84. చంద్ర–శుక్ర–శనులు ఒకేరాశియందున్న – భార్యకు తరచుగా అనారోగ్యము కలుగుచుండును.

85. శని వున్నరాశికి – అనంతర రాశిలో రాహువు వున్నచో జాతకుని జీవనం, స్వల్పస్థాయినుంచి ప్రారంభం అవుతుంది. అదే 2 లేక 3 రాశుల తరువాత ముందుగా చంద్రుడున్నచో, జాతకుడు 36 సం॥ల వరకు స్థిరమైన జీవనము పొందలేడు. అనేక విధముల వృత్తి–వ్యాపారములు చేయును.

86. శనికి 2వ రాశిలో సూర్య – బుధ – శుక్రులున్నచో గౌరవప్రదమయిన మంచి ఉద్యోగము పొందును.

87. శని అనంతర రాశులలో బుధ–శుక్రులున్నచో తరువాత రాశులలో సూర్య–కుజ – రాహులున్న జాతకుడు వడ్డీ వ్యాపారి – నగల వ్యాపారి యగును.

88. శనికి 2వ రాశిలో శుక్రుడున్న ఫైనాన్స్ – బ్యాంకుల యందు జీవనమును సూచించును. శనికి 2లో శుక్రుడు 4లో సూర్య బుధులున్న ప్రభుత్వ సంస్థలలో ఉద్యోగము పొందును.

89. శనికి 2–12 రాశులలో గ్రహములేవియు లేనిచో, జాతకుడు అనేక ఉద్యోగములు చేయును. స్థిరత్వముండదు.

90. శనికి 2లో సూర్య బుధులుండి, 7లో గురు–కేతువులున్న జాతకుడు పౌరోహిత్యము – జ్యోతిష వృత్తిలో జీవించును. తండ్రి ఆస్తిపొందును.

91. శని–గురులు కలసియుండి–ఇద్దరూ వక్రించిన జాతకుడు ధర్మ–కర్మ భ్రష్టుడగును.

92. శని–సూర్యులు, బుధరాశిలో నుండి, బుధుడు చంద్రరాశిలోనున్న జాతకుడు చిత్రకారుడగును.

93. శనికి 7లో కుజుడున్న నీచసేవ చేయును. వివాహము ఆలస్యమగును. 36–37 సం॥ల నుండి ఆర్థికముగా బాగుండును.

94. శని, మిధున–కన్యలయందున్న జాతకుడు – విద్య, వైద్యరంగములలో జీవనము పొందును. ఈ శనికి 2లో కేతువు వున్నచో అనేక ఆటంకములు జీవితములో ఏర్పడును.

95. శని–కేతువులు సింహమందున్న తండ్రి ప్రభుత్వోద్యోగము చేయువాడగును.

96. వక్రించిన శని వెనుక కేతువు వున్నచో–జాతకుడు మత సంబంధ విద్యావంతుడగును.

97. శని–మిధున, కన్యలలో, రాహు–గురులతో కలసి యన్నచో జాతకుడు, తాత పోలికలు, తా జీవన వ్యాపారము చేయువాడగును.

98. శని–శుక్రులు పరివర్తన పొందిన జాతకుడు–అనేక వృత్తివ్యాపారములు చేయును.

99. శని–చంద్రులు తులలో యుండి, అనంతరాశులలో గురు–కేతువులున్నచో – జాతకుడు మత సంస్థలలో ఉద్యోగము గాని – వేదపండితుడు – పురోహితుడు గాని అగును. ధార్మిక సంస్థ స్థాపించును.

100. కుజ–శనులకు వెనుక చంద్రుడున్న జాతకుడు గత జన్మలో తల్లి శాపము పొందినవాడని తెలియును.

101. శనికి అనంతర రాశులలో – చంద్రుడు – కేతువు సన్యాస జీవితము సూచించును. తీర్థయాత్రల వలన అనేక విషయములు తెలుసుకొనును.

102. శనికి అనంతర రాశులలో గురుడున్న విద్యారంగమందు – బుధుడున్న వ్యాపార రంగమందు శుక్రుడున్న ద్రవపదార్థములు, రసాయనములు – కళారంగమందు సూర్యుడున్న రాజకీయరంగమందు రాహువు వున్న గొప్ప ప్రభుత్వ సంస్థలందు జీవనము పొందును.

103. శని – కేతువులు వృశ్చికమందు జాతకుడు తత్త్వవేత్త యగును.

104. శనికి 11లో సూర్యుడున్న ప్రభుత్వోద్యోగము 7లో సూర్యుడున్న స్వతంత్ర జీవనము.

105. శని ధనస్సులో నుండి 2–12లో గ్రహ శూన్యమైనచో జాతకునికి తమ్ముళ్ళు ఉండరు. సామాన్య విద్య చెడు స్నేహములు, దోషపరిహారముగా నరసింహ కవచము పఠించాలి.

106. శని–గురులు కలసియుండి వీరికి 2వ రాశిలో కేతువు వున్న జాతకుడు దైవానుగ్రహము కలవాడని తెలియవలయును.

107. శని–కేతువులు కలసియుండి వీరికి 2వ రాశిలో శుక్రుడున్న లిక్కర్ వ్యాపారం 27 సం॥రాల నుండి అభివృద్ధి.

108. శని–శుక్రులు కలసి వృషభంలో ఉన్న జాతకుడు ధనవంతుడు, ప్రసిద్ధుడు అగును. మంచి వాహనముండును.

109. శనికి 7లో రవి-శుక్రులున్న పితృసౌఖ్యం తక్కువ.

110. శని-శుక్రుల సమసప్తకం సుఖప్రదమైన జీవితం

111. శని-శుక్ర-రాహువులు కలసిన అక్రమ సంపాదన

112. శని-శుక్రుల సమసప్తకం సుఖప్రదమైన జీవితం

113. శనికి 2వ రాశిలో చంద్రుడున్న విదేశంలోగాని, దూరప్రాంతంలోగాని ఉద్యోగము చేయును.

114. శనికి అనంతర రాశులలో చంద్రుడు, 3లో కేతువు ఉన్నచో జాతకుడు అనేక విషయములలో పండితుడగును. ఆలస్యముగా ప్రఖ్యాతి పొందును.

115. వనికి 12లో గురుడు - 2లో కేతువు ఉన్నచో వైరాగ్యవంతుడగును. 41-44 సం॥లలో గృహము నిర్మించును. శివభక్తుడగును. 41సం॥ల నుండి 60సం॥ల వరకు ధన సంపాదన చేయును. 75 సం॥లు జీవించును.

116. శని కామకారకుడు, శనికి 2లో రాహువున్న భౌతిక సుఖములపై కాంక్ష ఎక్కువగా నుండును. కేతువు ఉన్నచో వేదాంతి అగును.

117. శని-గురుల పరివర్తన స్వతంత్ర జీవనం. వీరు ధనుమీన రాశులలో కలసిననూ ఇదే ఫలితము.

118. శని-కేతువులు మేషంలో ఉండి మీనంలో గురుడున్న జాతకుడు బ్రహ్మచారిగా నుండును. వేరొక స్త్రీతో జీవించును. దీర్ఘాయువు.

119. శని అనంతర రాశులలో రాహువు - తరువాత చంద్రుడు ఉన్నచో వైద్యవృత్తి ద్వారా గాని మందుల వ్యాపారము ద్వారా జీవనము పొందును. తక్కువ స్థాయిలో జీవనము ప్రారంభమై ధనవంతుడగను.

120. శని - కుజ - శుక్రులు మేషమందు కలసియున్న ఇంజనీరింగ్ ఇండస్ట్రీని సూచించెదరు.

121. శని-గురు-చంద్రులు కలసియున్న ఉపాధ్యాయ వృత్తి. వీరు వక్రించిన అనేక వృత్తి వ్యాపారములు చేయును.

122. శని-రాహువుల మధ్య గురుడున్న జాతకుడు 39-47సం॥లో అనారోగ్యము పొందును. ఇతని కుమారుడు తండ్రి వ్యాపారమునే చేయును.

123. శని - కుజులు కలిన జాతకుడు గూఢముగా పాపములు చేయును. పరహింసకుడు.

124. శనికి 2-12లో రాహువు-కుజుడు ఉన్నచో ప్రయాణములలోను, రాత్రివేళలో ప్రమాదముజరుగుటకు అవకాశమున్నది.

125. శని-కుజులు వృషభములో నున్న జాతకుడు, ఎకౌంట్స్ శాఖలో జీవనము పొందును. గోచార శని గురుడున్న రాశి చేరినపుడు ధనలాభములు కలుగును.

126. శనికి 12లో కుజుడు, 2లో రవి కేతువులున్న బంధుద్వేషి, సామాన్యజీవితము గడుపును.

127. శని సింహరాశిలో వున్న, తండ్రియొక్క వృత్తి తండ్రి వంటి లక్షణములను స్వభావమును పొందును.

128. సింహశనుకి 2లో కుజ-కేతువులున్న వ్యవసాయం జలసంబంధ వృత్తులలో జీవించును.

129. శని-రవులు ఇద్దరూ ఉచ్చస్థితి పొందిన జాతకునికి పితృసౌఖ్యము ఉండదు.

130. శని-శుక్రులు కలసి తులలో ఉండి, కన్యలో బుధుడున్నచో గొప్ప ధనయోగము. దీర్ఘాయువు

131. శని రాహు కుజులు కలసిననూ, శని, రాహు-కుజులిద్దరినీ చూచిననూ పారిశ్రామికవేత్త అగుటగాని, గొప్ప గొప్ప ప్రఖ్యాత సంస్థలలో జీవనము పొందుట గాని జరుగును.

132. శని-శుక్రులు పరివర్తన పొంది, శుక్రుడు కుజునితో కలసి యున్న 2 వివాహము లగును. ఇరువురూ జీవించియుందురు.

133. శని-రవులు కలసియుండి, వీరికి 12లో రాహువున్న బంధనయోగం కలుగును.

134. శనికి అనంతర రాశులలో గురుడున్న జాతకుడు గొప్పవాడగును.

135. శని అనంతర రాశులలో చంద్ర - బుధ - కేతువులున్న జాతకుడు 35సం॥ల వరకు స్థిర జీవనము పొందలేడు.

136. శని - చంద్ర - శుక్రులు స్వస్థానములలోనున్న కనీసం 10లక్షల కధిపతి అగును. అనేకమందిని పోషించును.

137. శని-రవులు సింహంలోనున్న ప్రభుత్వోద్యోగము చేయును.
138. శని-శుక్రులు కలసియుండి, వీరికి 12లో కుజుదున్న గర్భకోశ వ్యాధులుండును.
139. శని-శుక్రులు వృషభంలో కలసియున్న గొప్ప ఉద్యోగము.
140. శనికి 2లో చంద్రుడు, 3లో కేతువు ఉన్నచో వైరాగ్యము కలవాడగును.
141. శని, గోచారరీత్యా జాతకములోనున్న స్వక్షేత్రములోనున్న శుక్రుని రాశియందు సంచరించు కాలములో జాతకుడు కీర్తి-ప్రతిష్ఠలు పొందును. అభివృద్ధి కల్గును.
142. శనికి 2లో గురు-రవులున్న జాతకుడు గొప్ప సంస్థలలో ఉద్యోగము చేయును.
143. రాహువునకు 2వ స్థానములో గురడున్న జాతకుడు తల్లిదండ్రులకు ఒకే కుమారుడై యుండును.
144. రాహువు గురునిచే చూడబడిన జాతకుడు తాతను కలిగియుండును.
145. రాహువు తులలో ఉన్న జాతకుడు దూర ప్రయాణములు ఎక్కువగా చేయును. అనేక విద్యలు నేర్చును. 3-4 భాషలు వచ్చును. 40-42 సం॥లో స్వగృహ యోగము కలుగును. ఇద్దరు సంతానము 76సం॥లు జీవించును.
147. కేతువుతో గురు-శుక్రులు కలిసియున్న జాతకుడు గొప్పవాదనాపటిమ కలవాడగును.
148. కేతువుతో వృశ్చిక రాశియందు శనియున్న జాతకుడు గొప్ప వేదాంత జ్ఞానము కలవాడగును.
149. కేతు-గురులు కలసియున్న జాతకుడు మృదు స్వభావము కలవాడగును.
150. కేతువుతో శుక్రుడు కలసియున్న జాతకుని భార్య 45-46 సం॥నందు మనోవేదన పొందును.

# అష్టకవర్గు

అష్టకవర్గమనగా సప్తగృహములు, లగ్నము కలిపి లెక్కించిన గణిత విధానము. జననకాల రాశిచక్రము ననుసరించి ఆయా గ్రహములకు వచ్చిన బిందువులను లెక్కించాలి. ఇవి గోచారఫలములను చెప్పుటకు కూడా ఎంతో ఉపకరిస్తాయి. వరాహమిహిరుడు కూడా అష్టకవర్గు గూర్చి ప్రత్యేకంగా ఒక అధ్యాయం రచించాడు.

శ్లో॥ స్వాదర్కః ప్రథమాయబంధు నిధన ద్వ్యాజ్ఞాత పోద్యూనగో
వక్రాత్స్వాదివ తద్వదేవరవిజాచ్ఛుక్రాత్ స్మరాంత్యారిషు।
జీవాద్ధర్మసుతాయ శతృషుదశ త్ర్యాయారిగ శ్శీతగో
రేష్వేవాంత్యత పస్సుతేషుచ బుధాల్లగ్నాత్యం బంధ్వంత్యగః॥

## రవ్యష్టకవర్గు

| | |
|---|---|
| రవియున్న రాశి మొదలు | 1–2–4–7–8–9–10–11 |
| చంద్రుడు రాశి మొదలు | 3–6–10–11 |
| కుజుడు రాశి మొదలు | 1–2–4–7–8–9–10–11 |
| బుధుడు రాశి మొదలు | 3–5–6–9–10–11–12 |
| గురుడురాశి మొదలు | 5–6–9–11 |
| శుక్రుడు రాశి మొదలు | 6–7–12 |
| శని రాశి మొదలు | 1–2–4–7–8–9–10–11 |
| లగ్నము నుండి రాశి మొదలు | 3–4–6–10–11–12 |

## చంద్రాష్టకవర్గు

శ్లో॥ లగ్నాత్ షట్ త్రిదశాయగ స్వధనధీ ధర్మేషు చారాశ్శశీ
స్వాత్సాస్తాదిషు సాష్టసప్తసురవేష్షట్త్ర్యాయ ధీస్థోయమాత్।
ధీత్ర్యాయాష్టమ కంటకేషు శశిజాజ్జీవాద్వ్యయా యాష్టగాః
కేంద్రస్థశ్చసితాత్తు ధర్మసుఖధీత్ర్యాయాస్పదానంగగః॥

| | |
|---|---|
| రవియున్న రాశి మొదలు | 3–6–7–8–10–11 |
| చంద్రుడు రాశి మొదలు | 1–3–6–7–10–11 |
| కుజుడు రాశి మొదలు | 2–3–5–6–9–10–11 |
| బుధుడు రాశి మొదలు | 1–3–4–5–7–8–10–11 |
| గురుడు రాశి మొదలు | 1–4–7–8–10–11–12 |
| శుక్రుడు రాశి మొదలు | 3–4–5–7–9–10–11 |
| శని రాశి మొదలు | 3–5–6–11 |
| లగ్నము నుండి రాశి మొదలు | 3–6–10–11 |

## కుజాష్టకవర్గు

శ్లో॥ వక్రస్తూపచయేష్వినాత్సతతనయే షాద్వ్యాధి కేషూదయా
చంద్రాద్ధిగ్విఫలేషు కేంద్రని ధనప్రాప్త్యర్థ గస్యాచ్ఛుభః।
ధర్మాయాష్టమ కేంద్రగోర్క తనయాత్ జాత్షట్ త్రిధోలాభగః
శుక్రాత్షడ్వ్యయ లాభమృత్యుషు గురోః కర్మాంత్య లాభారిషు॥

| | |
|---|---|
| రవియున్న రాశి మొదలు | 3-5-6-10-11 |
| చంద్రుడురాశి మొదలు | 3-6-11 |
| కుజుడు రాశి మొదలు | 1-2-4-7-8-10-11 |
| బుధుడు రాశి మొదలు | 3-5-6-11 |
| గురుడు రాశి మొదలు | 6-10-11-12 |
| శుక్రుడు రాశి మొదలు | 6-8-11-12 |
| శని రాశి మొదలు | 1-4-7-8-9-10-11 |
| లగ్నము నుండి రాశి మొదలు | 1-3-6-10-11 |

## బుధాష్టకవర్గు

శ్లో॥ ద్వ్యాద్యాయాష్టతపస్సుఖేషు భృగుజాద్సరతాత్మజేష్విందుజః
సాజ్ఞాస్తేషు యమారయోః వ్యయరిపుప్రాప్త్యష్టగోవాక్పతేః।
ధర్మాయారి సుతవ్యయే సవితుఃస్యాత్సాద్య కర్మత్రిగః
షట్స్వాయాష్ట సుఖాస్వదేషు హిమగోః సాద్యేషులగ్నాచ్ఛుభః।

| | |
|---|---|
| రవియున్న రాశి మొదలు | 5-6-9-11-12 |
| చంద్రుడు రాశి మొదలు | 2-4-6-8-10-11 |
| కుజుడు రాశి మొదలు | 1-2-4-7-8-9-10-11 |
| బుధుడు రాశి మొదలు | 1-3-5-6-9-10-11-12 |
| గురుడు రాశి మొదలు | 6-8-11-12 |
| శుక్రుడు రాశి మొదలు | 1-2-3-4-5-8-9-11 |
| శని రాశి మొదలు | 1-2-4-7-8-9-10-11 |
| లగ్నము నుండి రాశి మొదలు | 1-2-4-7-8-9-10-11 |

# గుర్వష్టకవర్గు

శ్లో॥ దిక్ స్వాద్యామదాయ బంధుషుకుజాత్సా తత్ర్తకేష్వంగిరా
సూర్యాత్ సత్తినవేషు ధస్వనవ దిగ్గాభారిగో భార్గవాత్।
జాయాయార్థన వాత్మజేషు హిమగోర్మందా త్రిషడ్డో వ్యయే
దిగ్ధీషట్ స్వసుఖాయ పూర్వనవగోజ్ఞాతస్మర శ్చేదయాత్॥

| | |
|---|---|
| రవియున్న రాశి మొదలు | 1–2–3–4–7–8–9–10–11 |
| చంద్రుడు రాశి మొదలు | 2–5–7–9–11 |
| కుజుడు రాశి మొదలు | 1–2–4–7–8–10–11 |
| బుధుడు రాశి మొదలు | 1–2–4–5–6–9–10–11 |
| గురుడు రాశి మొదలు | 1–2–3–4–7–8–10–11 |
| శుక్రుడు రాశి మొదలు | 2–5–6–9–10–11 |
| శని రాశి మొదలు | 3–5–6–12 |
| లగ్నము నుండి రాశి మొదలు | 1–2–4–5–6–7–9–10–11 |

# శుక్రాష్టకవర్గు

శ్లో॥ లగ్నాదాసుత లాభరంధ్ర నవగస్యాంత్యశ్శశాంకాత్సితః
స్వాత్సాజ్ఞేషు సుఖత్రిధీనవదశ ఛిద్రాప్తిగ స్సూర్యజాత్।
రంధ్రాయవ్యయగో రవేర్నవదశ ప్రాప్త్యష్టధీ స్థో గురోః
జ్ఞాధీత్ర్యాయ నవారిగ స్త్రీ నవషట్ పుత్రాగమాంత్యఃకుజాత్॥

| | |
|---|---|
| రవియున్న రాశి మొదలు | 8–11–12 |
| చంద్రుడురాశి మొదలు | 1–2–3–4–5–8–9–10–11 |
| కుజుడు రాశి మొదలు | 3–5–6–9–11–12 |
| బుధుడు రాశి మొదలు | 3–5–6–9–11 |

| | |
|---|---|
| గురుడు రాశి మొదలు | 5-8-9-19-11 |
| శుక్రుడు రాశి మొదలు | 1-2-3-4-5-8-9-10-11 |
| శని రాశి మొదలు | 3-4-5-8-9-10-11 |
| లగ్నము నుండి రాశి మొదలు | 1-2-3-4-5-8-9-11 |

## శన్యష్టకవర్గు

శ్లో॥ మందస్స్వాత్త్రిసుతాయ శతృష శుభజ్ఞాంత్యగో భూమిజాత్
కేంద్రాయాష్టధనేష్వినాదుపచయే స్వాధ్యేసుఖే చోదయాత్।
ధర్మాయారి దశాంత్యమృత్యు బుధాచ్చంద్రాత్త్రిషల్లాభగః
షష్ఠాయాంత్య గతస్సితాత్ సురగురోః ప్రాప్త్యంత్యధీ శతృష॥

| | |
|---|---|
| రవియున్న రాశి మొదలు | 1-2-4-7-8-10-11 |
| చంద్రుడురాశి మొదలు | 3-6-11 |
| కుజుడు రాశి మొదలు | 3-5-6-10-11-12 |
| బుధుడు రాశి మొదలు | 6-8-9-10-11-12 |
| గురుడు రాశి మొదలు | 5-6-11-12 |
| శుక్రుడు రాశి మొదలు | 6-11-12 |
| శని రాశి మొదలు | 3-5-6-11 |
| లగ్నము నుండి రాశి మొదలు | 1-3-4-6-10-11 |

## అష్టకవర్గు ఫలితము

శ్లో॥ ఇతి నిగదితమిష్టం నేష్టమన్యద్విశేషాత్
అధిక ఫలివిపాకం జన్మభాత్తత్రదద్యుః।
ఉపచయ గృహమిత్ర స్వోచ్చగైః పుష్టమిష్టం
త్వపచయ గృహనీచా రాతి గైర్నేష్ట సంపత్॥

**తా॥** ఎక్కువ బిందువులు వచ్చిన గ్రహము, తన దశాంతర్దశలలో శుభఫలిత మిచ్చును. అదే విధముగా, ఎక్కువ బిందువులు వచ్చిన రాశిలో మందగ్రహములైన గురు–శనులు గోచారరీత్యా సంచరించునపుడు శుభఫలితముల నిచ్చును.

| | | |
|---|---|---|
| 8 బిందువులు పొందిన గ్రహం | – | అధిక శుభం |
| 6–7 బిందువులు పొందిన గ్రహం | – | శుభం |
| 5–4 బిందువులు పొందిన గ్రహం | – | మధ్యమం |
| 3 బిందువులు వచ్చిన గ్రహం | – | సామాన్యం |
| 2–1 బిందువులు వచ్చిన గ్రహం | – | కష్టములు |
| రవికి మొత్తం బిందువులు | – | 48 |
| చంద్రునకు మొత్తం బిందువులు | – | 49 |
| కుజునకు మొత్తం బిందువులు | – | 39 |
| బుధునకు మొత్తం బిందువులు | – | 54 |
| గురునకు మొత్తం బిందువులు | – | 56 |
| శుక్రునకు మొత్తం బిందువులు | – | 52 |
| శనికి మొత్తం బిందువులు | – | 39 |
| మొత్తం | – | 337 |

ఉదాహరణ జాతకం – **ఎం.సంపత్ కుమార్** 1957.5.21



00 000 00 000 000 00
00000 00
000 రవి 000 00
00 00 00 00 000 000
00 00 00 00

0 000 000 00 000
00 00 00 000
000 000 చంద్ర 00 00
000 000 00 00 000 00
00 000 000

000 000 000 000 000
000 000 0000 000 000
000 శుక్ర 00 00
00000 000 00 000 000
000 0 00

000 000
0 00 000 000
000 00 0 00
00 00 00 00 000 00
00 గురు 00 00
000 0 00 0 000
00 00 00 0 00
00 0

00 000 00000
00 00 000
000 శని 0000
000 00 000 000 00
000 0

00 000 00 000
00 0 000 0
0 000 0
00 లగ్నం 000 000
00
000 00 0 00 000
00 00 00 0
00 00

| గ్రహములు | వచ్చిన బిందువులు | ఫలితం |
|---|---|---|
| రవి | 2 | అశుభం |
| చంద్ర | 6 | అధిక సుఖం |
| కుజ | 4 | సుఖం |
| బుధ | 4 | సుఖం |
| గురు | 5 | సుఖం |
| శుక్ర | 6 | అధిక సుఖం |
| శని | 4 | సుఖం |
| లగ్నం | 4 | సుఖం |

## ఇపుడు సర్వాష్టకవర్గు పరిశీలిద్దాం




30 దాటి బిందువులు వచ్చిన రాశియందు గోచారరీత్యా శుభగ్రహములు, యోగించు గ్రహములు సంచరించునపుడు జాతకుడు శుభఫలితములు పొందును. 20 నుంచి 30 వరకు బిందువులు వచ్చిన సామాన్యం, 20కంటే తక్కువ వచ్చిన రాశిలో గోచారం వల్ల కష్టములు – సమస్యలు – ధననష్టం – అనారోగ్యం.

అష్టకవర్గులో గ్రహములకు బిందువులేర్పరిచిన తరువాత, త్రికోణ శోధన చేయాలి. అది ఎలాగో వివరిస్తాను. 12రాశులకు 4 త్రికోణము లేర్పడతాయి.

1. **మేష-సింహ-ధనురాశులు**
2. **వృషభ - కన్యా - మకరములు**
3. **మిధున - తులా - కుంభాలు**
4. **కర్కాటక - వృశ్చిక - మీనములు**

## త్రికోణ శోధన

1. త్రికోణరాశులు మూడింటిలోనూ బిందువులు సమానంగా ఉంటే, 3చోట్ల శూన్యం వేయాలి.
2. త్రికోణరాశులలో ఒకదానిలో శూన్య బిందువు ఉన్నచో దానిని అలాగే ఉంచాలి.
3. 2 రాశులలో శూన్యం ఉంటే 3వ దానిలో కూడా శూన్యం వేయాలి.
4. మూడు స్థానములలో బిందువులున్నచో తక్కువ బిందువులు గల రాశితో మిగిలిన రెండు రాశులు సమం చేయాలి.

| | | |
|---|---|---|
| 2 / 5 | 5 | 3 / 5 |
| 3 | రవి | 5 |
| 4 / 4 | 2 | 6 / 4 |

| | | |
|---|---|---|
| 2 / 2 | 4 | 3 / 2 |
| 3 | త్రి. శో. | 2 |
| 4 / 2 | 2 | 4 / 3 |

| | | |
|---|---|---|
| 1 / 2 | 5 | 5 / 6 |
| 6 | చం | 4 |
| 6 / 2 | 4 | 2 / 6 |

| | | |
|---|---|---|
| 2 / 2 | 2 | 5 / 2 |
| 5 | త్రి. శో. | 1 |
| 2 / 1 | 2 | 2 / 5 |

| | | |
|---|---|---|
| 2 / 4 | 4 | 3 / 3 |
| 5 | కు | 3 |
| 3 / 5 | 2 | 3 / 2 |

| | | |
|---|---|---|
| 2 / 2 | 3 | 2 / 2 |
| 2 | త్రి | 2 |
| 3 / 2 | 2 | 3 / 2 |

| | | |
|---|---|---|
| 3 / 6 | 4 | 6 / 4 |
| 5 | బుధ | 5 |
| 7 / 7 | 1 | 6 / 3 |

| | | |
|---|---|---|
| 3 / 1 | 4 | 3 / 1 |
| 3 | త్రి | 3 |
| 1 / 3 | 1 | 4 / 3 |

| | | |
|---|---|---|
| 4, 5 | 4 | 7, 5 |
| 4 | గు | 5 |
| 5, 5 | 4 | 5, 3 |

| | | |
|---|---|---|
| 4, 4 | 4 | 3, 4 |
| 3 | త్రి | 4 |
| 4, 4 | 4 | 4, 3 |

| | | |
|---|---|---|
| 6, 6 | 4 | 6, 6 |
| 3 | శు | 4 |
| 5, 5 | 3 | 6, 3 |

| | | |
|---|---|---|
| 4, 3 | 4 | 2, 3 |
| 2 | త్రి | 4 |
| 4, 4 | 3 | 4, 2 |

| | | |
|---|---|---|
| 2, 2 | 5 | 5, 3 |
| 2 | శ | 4 |
| 3, 3 | 2 | 4, 4 |

| | | |
|---|---|---|
| 2, 2 | 3 | 2, 1 |
| 2 | త్రి | 3 |
| 3, 2 | 2 | 3, 2 |

| | | |
|---|---|---|
| 3, 3 | 6 | 2, 4 |
| 4 | ల | 6 |
| 5, 4 | 1 | 3, 4 |

| | | |
|---|---|---|
| 3, 1 | 3 | 2, 1 |
| 2 | త్రి | 3 |
| 3, 3 | 1 | 3, 2 |

| | వృ | ధ | మ | కు | మీ | మే | వృ | మి | క | సి | క | తు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ర | 3 | 4 | 2 | 2 | 3 | 4 | (2) | 2 | 3 | 4 | 2 | 2 |
| చ | 5 | 2 | 1 | (2) | 5 | 2 | 1 | 2 | 5 | 2 | 1 | 2 |
| కు | 2 | 3 | 2 | 2 | 2 | 3 | 2 | (2) | 2 | 3 | 2 | 2 |
| బు | 4 | 3 | 1 | 3 | 4 | (3) | 1 | 3 | 4 | 3 | 1 | 3 |
| గు | 3 | 4 | 4 | 4 | 3 | 4 | 4 | 4 | 3 | (4) | 4 | 4 |
| శు | 2 | 4 | 4 | 3 | 2 | 4 | (4) | 3 | 2 | 4 | 4 | 3 |
| శ | (2) | 3 | 2 | 2 | 2 | 3 | 2 | 2 | 2 | 3 | 2 | 2 |
| ల | (2) | 3 | 3 | 1 | 2 | 3 | 3 | 1 | 2 | 3 | 3 | 1 |

ఇందు 2 బిందువులు వచ్చిన గ్రహదశ సామాన్యం

3 బిందువులు వచ్చిన గ్రహదశ మధ్యమం

4 బిందువులు వచ్చిన గ్రహదశ – సుఖం

5 బిందువులు వచ్చిన గ్రహదశ – అధిక సుఖం

ఇది అనుభవమునందు, దశాంతర్దశల విషయములో బాగుగా ఉపకరించు చున్నది. గోచారవశాత్తుగా జన్మకాలిక గ్రహరాశలందు శుభ, పాపగ్రహములు సంచరించు నపుడు ఆయా ఫలితములు కలుగును.

## ఏకాధిపత్య శోధన

రవి – చంద్రులకు తప్ప మిగిలిన 5గ్రహములకు రెండేసి స్వక్షేత్రములున్నవి. రవి–చంద్రులకు వారి కర్కాటక – సింహరాశులలో బిందువులను అదే విధముగా నుంచి మిగిలిన రాశులను, త్రికోణశోధన చేసిన విధముగానే బిందుశోధన చేయాలి.

| | | |
|---|---|---|
| 6 / 6 | 4 | 5 / 3 |
| 6 | ఏ.శో | 3 |
| 4 / 6 | 0 | 5 / 2 |

2 ఆధిపత్యములో గ్రహమున్నచో శోధన చేయనవసరం లేదు. రెండింటియందు గ్రహములు లేక ఒకదానిలో శూన్యమున్ననూ యధా తధంగా ఉంచాలి. బందువులు రెండింటిలోనూ సమానంగా యుంటే రెండింటిలోనూ శూన్యం వేయాలి.

ఏకాధిపత్య శోధనలో గ్రహములకు ఈ విధముగా బిందువులు వచ్చాయి.

| | | |
|---|---|---|
| రవి | - | 6 |
| చంద్ర | - | 6 |
| కుజ | - | 6 |
| బుధ | - | 4 |
| గురు | - | 4 |
| శుక్ర | - | 6 |
| శని | - | 2 |

ఇది రాశిగ్రహగుణకారములకు ఉపయోగించును.

# స్త్రీ జాతకం

స్త్రీలకు పూర్వజన్మ కర్మ ఫలము, వివాహానంతరం భర్తకు కొంత సంక్రమించును. స్త్రీలకు లగ్నము, చంద్ర లగ్నమునుండి, శౌనక-నారదాదలు ఫలితములు చెప్పారు.

స్త్రీలకు 7వస్థానము వలన సౌభాగ్యము, చంద్రలగ్నమునుండి శరీర శుభా శుభములను 8వ స్థానము వలన వైధవ్యమును, 5వ స్థానము వలన పుత్ర సుఖమును తెలుసుకోవాలి.

7వ స్థానములో 3 శుభగ్రహములున్న గొప్ప ఇంటి ఇల్లాలగును. 2శుభ గ్రహములున్న ధనవంతురాలు, పతికి ఇష్టురాలు అగును.

7వ స్థానములో 1 పాపగ్రహము నుండి, మరొక పాపగ్రహముతో చూడబడిన పరపురుషులను కోరునది, 2 పాపగ్రహములున్న అధర్మమాచరించునది, 3పాప గ్రహములున్న భర్తను విడనాడి పరునితో వెళ్ళిపోవును.

7వ స్థానములో రవియున్న వియోగము, క్రోధవతి అగును. కుజుడున్న విధవ, శనియున్న 30-35 సం॥లో వివాహమగును.

7లోగాని, 3లోగాని చంద్రుడున్న స్థిరప్రకృతికలిగి రూప–గుణములు, పతియందు అనురాగము ఉండును.

లగ్నము – చంద్రుడు విషమరాశి, విషమనవాంశలలో ఉన్న పురుషుని వలె రూపము, కంఠధ్వని కలిగియుండును. శరీరమునందు కాళ్ళు చేతులపై వెంట్రుకలుండును. లేదా కురూపియగును.

7వ స్థానములో శుక్రుడు 2 శుభగ్రహములతో కలసియున్న స్త్రీ ఐశ్వర్యవతి, భర్తకు ఇష్టురాలు అగును. లగ్నమందు గురు–శుక్రులు, కన్యలో బుధుడు, మకరములో కుజుడు, కర్కాటకములో చంద్రుడు కలస్త్రీ గొప్ప సౌందర్యవతి యోగజాతకురాలు అగును.

వృశ్చికలగ్న జాతకురాలికి 7లో శుక్రుడున్న గొప్ప ఇంటి ఇల్లాలగును. ధనవంతురాలగును.

మకరలగ్నమునకు 7లో కుజుడు, కుంభలగ్నమునకు 7లో శని కుజులు వైధవ్యమును కలిగింతురు.

మీనలగ్నమునకు 7లో బుధుడున్న, భర్తకు ఇతరస్త్రీలతో సంబంధముండును.

7లో గురుడున్నచో గుణవంతురాలు, ధర్మకార్యములు చేయునది అగును.

కన్యాలగ్నమునకు 7లో శుక్రుడున్న భర్త ఉదారుడు, చతురుడు, కళలు తెలిసినవాడు అగును.

7లో శనియున్న భర్తరోగ పీడితుడగును లేదా దుర్బల శరీరుడగను.

7లో రాహువు వున్నచో సుఖసంతోషములు తక్కువగా ఉండును.

చంద్రరాశినుండి 7లో రవి, కుజ–శని–రాహువులున్న వైధవ్యయోగము. లగ్నమందు శతృరాశి యందు ఇదే ఫలము జరుగును.

## షోడశవర్గు

1. రాశి (క్షేత్రము), 2. హోర, 3. ద్రేక్కాణము, 4. చతుర్థాంశ, 5. సప్తమాంశ, 6.నవమాంశ, 7. దశమాంశ, 8. ద్వాదశాంశ, 9. షోడశాంశ, 10. వింశాంశ,

11. సిద్ధాంశ, 12. భాంశ, 13. త్రింశాంశ, 14. ఖవేదాంశ. 15. అక్షవేదాంశ, 16. షష్ట్యంశ.

గ్రహముల యొక్క బలాబలములను, భావములను నిశితముగా పరి శీలించుటకును ఇవి ఉపయోగబడును.

## ఉదాహరణము

1. **రాశి :-**లగ్నము వృశ్చిరాశి అయినది. కనుక క్షేత్రము వృశ్చికమైనది. వృశ్చికం కుజక్షేత్రం.

2. **హోర:-** లగ్నమునకు 2సమభాగములు చేయగా 2హోరలగును. లగ్న బేసిరాశి ఐనచో మొదటి భాగము రవిహోర – రెండభాగము చంద్రహోర అగును. లగ్నము సరిరాశి అయినచో మొదటి భాగము చంద్రహోర – రెండవ భాగము రవి హోర అగును.

   **ఉదా** – వృశ్చికలగ్నము సరిలగ్నముకావున మొదటి 150 డిగ్రీలు చంద్రహోర. జాతకుడులలో జన్మించెను కావున రెండవదైన రవిహోర అగుచున్నది.

3. **ద్రేక్కాణము:-** లగ్నమును మూడు సమభాగములుగా విభజించిన 3ద్రేక్కాణము లగును. మొదటి $10^0$ డిగ్రీలోల జననమైనచో లగ్నాధిపతి ద్రేక్కాణాధిపతి లగును. రెండవ భాగములో $10^0$ నుండి $20^0$ డిగ్రీలలో జననమైనచో పంచమా ధిపతి, మూడవభాగములో అయినచో నవమాధిపతి ద్రేక్కాణాధిపతు లగుదురు.

   ఉదా – లగ్నము – వృశ్చికము జననకాలమునకు $23^0$–$25^0$.కావున 3వ భాగములో జననమైనది. నవమాధిపతి చంద్రుడు ద్రేక్కాణాధిపతి అయ్యెను.

4. **చతుర్థాంశ:-** లగ్నమును 4 సమభాగములు చేసిన చతుర్థాంశ అగును. చతుర్ధాంశ ప్రమాణం $7^0$.30 'జననము 23–25' కనుక 4వ భాగములో అయినది. 1వ భాగమునకు లగ్నాధిపతి 2.చతుర్థాధిపతి 3.సప్తమాధిపతి 4.దశమాధిపతి, చతుర్ధాంశపతులగుదురు. ఇచట దశమాధిపతి రవి

**5. సప్తమాంశ:-** లగ్నమును 7 సమభాగములు చేసిన సప్తమాంశ అగును. లగ్నము బేసిరాసి అయిన ఆ రాశి మొదలుగాను, సరిరాశి అయిన ఆరాశికి 7వ రాశి మొదలుగాను లెక్కించవలయును.

1. 4.17    5. 21.25

2. 8.34    6. 25.42

3. 12.51    7. 30.00

4. 17.08

ఇచట లగ్నము 6వ భాగములో పడినది. వృశ్చికము సరిరాశి కావున దీనికి సప్తమమైన వృషభము నుండి 6వ రాశి సప్తమాంశ అగును.

## తుల- శుక్ర సప్తమాంశ

**6. నవమాంశ:-** లగ్నమును 9 భాగములు చేయగా నవాంశ మేర్పడును. మనము ఏరాశికి నవాంశకట్టదలతుమో అది మేషసింహ ధనుస్సులలో ఒకటైనచో మేషాదిగను లెక్కించాలి. వృషభ కన్యామకరములలో నున్న ఎడల మకరము నుండి లెక్చించాలి మిధున తులా కుంభములో నున్నచో తల మొదలు లెక్కించాలి. కర్కాట వృశ్చిక మీనములలో నున్నచో కర్కాటకమునుం గణించాలి.

లగ్న ప్రమాణం 30.00' డిగ్రీలు

1 నవాంశ 3.20

జననము 23.25

9 భాగములలో 8వ భాగములో అయినది.వృశ్చికం కావున కర్కాటకాదిగ 8 కుంభము అయినది.

## కుంభం శనినవాంశ

**7. దశమాంశ:-** లగ్నమును పదిభాగములు చేసినచో దశమాంశమగును. లగ్నము ఎక్కువ భాగమందు కలదో చూడాలి. బేసిరాశి అయినచో ఆ రాశి మొదలు గను, సరిరాశి అయినచో ఆ రాశికి తొమ్మిదవ రాశి మొదలుగను ఆ భాగాలను లెక్కించవలయును. ఆరాశ్యాధిపతియే దశమాంశాధిపతి. ఈ దశమాంశము వలన జాతకుడు ఏ వృత్తి – వుద్యోగములు చేయునో తెలుసుకొనవచ్చును.

ఉదా - 1 దశమాంశ $3^0$ డిగ్రీలు

జననం $23^0$-25'

జననం 8వ భాగములో పడినది. వృశ్చికం సరిరాశిగావున, దానికి తొమ్మిదవ రాశి కటకం నుండి 8వ దశమాంశ కుంభం అయినది.

**కుంభం - శనిదశమాంశ**

**8. ద్వాదశాంశ:-** లగ్నమునకు 12 సమభాగములు చేయవచ్చును.

1 ద్వాదశాంశ. $2^0$.30'

జననం - $23^0$.25'

జననం 11వ భాగయందు అయినది

లగ్నాదిగా 11వరాశి కన్య

**కన్య- బుధ ద్వాదశాంశ**

**9. షోడశాంశ:-** లగ్నమును 16 సమభాగములు చేయగా వచ్చును. లగ్నము చరరాశి అయినచో మేషాదిగాను, స్థిరరాశి అయినచో సింహాదిగను, ద్విస్వ భాగవరాశియందున్నచో ధనుస్సు మొదలుగాను లెక్కించవలయును.

1. షోడశాంశ - $1^0$.53'

- $23^0$.25'

**జననం**

| షోడశాంశ | డిగ్రీలు-ని. | షోడశాంశ | డిగ్రీలు-ని. |
|---|---|---|---|
| 1 | $1^0$.53' | 9 | 16.57 |
| 2 | 3.46 | 10 | 18.50 |
| 3 | 5.39 | 11 | 20.43 |
| 4 | 7.32 | 12 | 22.36 |
| 5 | 9.25 | 13 | 24.29 |
| 6 | 11.18 | 14 | 26.22 |
| 7 | 13.11 | 15 | 28.15 |
| 8 | 15.04 | 16 | 30.00 |

ఇందు జననం 13వ భాగమునందు పడినది. వృశ్చికము స్థిరరాశి గావున సింహాదిగా 13వ రాశి సింహమే అగుచున్నది.

## సింహము - రవిషోడశాంశ

**10. వింశాంశ:-** లగ్నమును 20 సమభాగములు చేయుటయే వింశాంశ. లగ్నము చరరాశి అయినచో మేషాదిగను, స్థితరాశి అయినచో సింహ మొదలుగాను, ద్విస్వభావరాశి అయినచో ధనుస్సు మొ॥గా లెక్కించవయును.

1 వింశాంశ 10.30'

జననం – 23.25

### పట్టిక

| వింశాంశ | డిగ్రీలు-ని. | వింశాంశ | డిగ్రీలు-ని. |
|---|---|---|---|
| 1 | $1^0.30'$ | 11 | 160.30 |
| 2 | 3.00 | 12 | 18.00 |
| 3 | 4.30 | 13 | 19.30 |
| 5 | 6.00 | 14 | 21.00 |
| 6 | 7.30 | 15 | 22.30 |
| 7 | 9.00 | 16 | 24.00 |
| 8 | 10.30 | 17 | 25.30 |
| 9 | 12.00 | 18 | 27.00 |
| | 13.30 | 20 | 30.00 |
| 10 | 15.00 | | |

ఇందు జననం 16వ వింశాంశ యందు పడినది. వృశ్చికము స్థిరరాశి కావున సింహాదిగ 16వ రాశి వృశ్చికమైనది.

## వృశ్చికము - కుజవింశాంశ

**11. సిద్ధాంశ: -** లగ్నమును 24 సమాన భాగములు చేసిన సిద్ధాంశ సిద్ధించును. ఇది కార్యసిద్ధి – మంత్రసిద్ధి తెలియచేయును. 24భాగములలో ఏ భాగములో లగ్నము పడినదీ తెలుసుకొని, అది అనగా ఆ రాశి గాని, గ్రహముగాని బేసి రాశియందున్న ఎడల సింహాదిగాను, సరిరాశియందున్న కర్కాటకాదిగాను గుణించవలెను.

ఇపుడు మన లగ్నము 23.25, 19వ సిద్దాంశ అయినది. వృశ్చికము సరిరాశి కావున కర్కాటకమునుండి 19వది మకరమైనది.

# మకరం - శని సిద్ధాంశ

**12. భాంశ:-** లగ్నమును 27 భాగములు చేసిన భాంశ వచ్చును. ఇది ఆగ్రహము ఉన్నరాశి నుండి, ఆ రాశి నుండి లెక్కించవలయును.

1 భాంశ 01.6.26 సుమారు అగును

| సిద్ధాంశ | డిగ్రీలు | సిద్ధాంశ | డిగ్రీలు | సిద్ధాంశ | డిగ్రీలు |
|---|---|---|---|---|---|
| 1 | 1.15 | 9 | 11.45 | 17 | 21.45 |
| 2 | 2.30 | 10 | 13.00 | 18 | 23.00 |
| 3 | 3.45 | 11 | 14.15 | 19 | 24.15 |
| 4 | 5.00 | 12 | 15.30 | 20 | 25.30 |
| 5 | 6.15 | 13 | 16.45 | 21 | 26.45 |
| 6 | 7.30 | 14 | 18.00 | 22 | 27.00 |
| 7 | 8.45 | 15 | 19.15 | 23 | 29.75 |
| 8 | 10.00 | 16 | 20.30 | 24 | 30.00 |

**13. త్రింశాంశ:-** లగ్నమును 30 సమభాగములుగా చేసిన త్రింశాంశ వచ్చును. ఆ గ్రహముగాని, ఆ రాశిగాని బేసిరాశియందున్న ఎడల ఈ క్రింది వరుసలో లెక్కించవలను.

| బేసిరాశి | సరిరాశి |
|---|---|
| కుజ - 5 | శుక్ర 5 |
| శని - 5 | బుధ 7 |
| గురు - 8 | గురు 8 |
| బుధా - 7 | శని 5 |
| శుక్ర - 5 | కుజ 5 |

1 త్రింశాశకు 1 డిగ్రీ అగును. మన లగ్నము వృశ్చికము 23.25 కావున 24వ త్రింశాశ అయినది. వృశ్చికము సరిరాశికావున శని త్రింశాంశ అయినది. త్రింశాంశ వలన స్వభావము తెలియును.

**14. ఖవేదాంశ:-** లగ్నమును 40 సమభాగములు చేయవలయును. బేసిరాశి అయిన మేషాదిగాను, సరిరాశి అయిన వృషబాదిగాను లెక్కించవలయును.

ఖవేదాంశ – 0.45

| ఖవేదాంశ | డిగ్రీలు |
|---|---|
| 1 | 0.45 |
| 2 | 1.30 |
| 3 | 2.15 |
| 4 | 3.00 |
| 5 | 3.45 |
| 6 | 4.30 |
| 7 | 5.15 |
| 8 | 6.00 |
| 9 | 6.45 |
| 10 | 7.30 |
| 11 | 8.15 |
| 12 | 9.00 |
| 13 | 9.45 |
| 14 | 10.30 |

| ఖవేదాంశ | డిగ్రీలు |
|---|---|
| 15 | 11.15 |
| 16 | 12.00 |
| 17 | 12.45 |
| 18 | 13.30 |
| 19 | 14.15 |
| 20 | 15.00 |
| 21 | 15.45 |
| 22 | 16.30 |
| 23 | 17.15 |
| 24 | 18.00 |
| 25 | 18.45 |
| 26 | 19.30 |
| 27 | 20.15 |
| 28 | 21.00 |

| ఖవేదాంశ | డిగ్రీలు |
|---|---|
| 29 | 21.45 |
| 30 | 22.30 |
| 31 | 23.15 |
| 32 | 24.00 |
| 33 | 24.45 |
| 34 | 25.30 |
| 35 | 26.15 |
| 36 | 27.00 |
| 37 | 27.45 |
| 38 | 28.30 |
| 39 | 29.15 |
| 40 | 30.00 |

మన వృశ్చికలగ్నము $23^0.25$, 32వ ఖవేదాంశలో ఉన్నది. వృశ్చికము సరిరాశిగావున వృషభము నుండి 32వది ధనుస్సు అయినది.

## ధనుస్సు- గురు ఖవేదాంశ

**15. అక్షవేదాంశ:-** లగ్నమును 45 సమానభాగములు చేయగా అక్షవేదాంశవచ్చును. ఆ గ్రహము చరరాశియందున్న మేషాదిగాను, స్థిరరాశి యందున్న సింహాదిగాను, ద్విస్వభావరాశి యందున్న ధనుస్సు మొదలుగాను లెక్కించవలయును.

# అక్షవేదాంశ - 0.40

| అక్ష వేధాంశ | డిగ్రీలు. ని | అక్ష వేధాంశ | డిగ్రీలు. ని |
|---|---|---|---|
| 1 | 0.40 | 23 | 15.20 |
| 2 | 1.20 | 24 | 16.40 |
| 3 | 2.00 | 26 | 17.20 |
| 4 | 2.40 | 27 | 18.00 |
| 5 | 3.20 | 28 | 18.40 |
| 6 | 4.00 | 29 | 19.20 |
| 7 | 4.40 | 30 | 20.00 |
| 8 | 5.20 | 31 | 20.40 |
| 9 | 6.00 | 32 | 21.20 |
| 10 | 6.40 | 33 | 22.00 |
| 11 | 7.20 | 34 | 22.40 |
| 12 | 8.00 | 35 | 23.20 |
| 13 | 8.40 | 36 | 24.00 |
| 14 | 9.20 | 37 | 24.40 |
| 15 | 10.00 | 38 | 25.20 |
| 16 | 10.40 | 39 | 26.00 |
| 17 | 11.20 | 40 | 26.40 |
| 18 | 12.00 | 41 | 27.20 |
| 19 | 12.40 | 42 | 28.00 |
| 20 | 13.20 | 43 | 28.40 |
| 21 | 14.00 | 44 | 29.20 |
| 22 | 14.40 | 45 | 30.00 |

**16. షష్ట్యంశ:-** లగ్నములు 60 భాగములు చేసిన షష్ట్యంశ వచ్చును. బేసిరాశి యందున్న ఎడల 1 అంశ నుండి లెక్కించవలెను. సరిరాశి అయినచో 60వ అంశము నుండి వెనుకకు లెక్కించవలయును. షష్ట్యంశ . $0^0.30$

| షష్ట్యంశము | పేరు | షష్ట్యంశము | పేరు |
|---|---|---|---|
| 1 | ఘోరాంశము | 20 | కోమలాంశము |
| 2 | రాక్షసాంశము | 21 | పద్మాంశము |
| 3 | దేవ భాగాంశము | 22 | లక్ష్మీకాంశము |
| 4 | కుబేరాంశము | 23 | వాగీశాంశము |
| 5 | రక్షోగణాంశము | 24 | దిగంబరాంశము |
| 6 | కిన్నరాంశము | 25 | దేవాంశము |
| 7 | హృష్టాంశము | 26 | ఇంద్రాంశము |
| 8 | కులఘ్నాంశము | 27 | కలినాశాంశం |
| 9 | గరళాంశము | 28 | క్షితీశ్వరాంశము |
| 10 | అగ్నిసంగాశము | 29 | మందాత్మజాంశం |
| 11 | మాయాంశము | 30 | కమలాకరాంశం |
| 12 | ప్రేతపురీశాంశము | 31 | మృత్యంశము |
| 13 | అపాంపత్యంశము | 32 | కాలంశము |
| 14 | దేవగణాంశము | 33 | దేవాగ్నంశము |
| 15 | కాలాంశము | 34 | ఘోరాంశము |
| 16 | ఆదిత్యాంశము | 35 | ఆమయాంశము |
| 17 | అమృతాంశము | 36 | కంటకాంశం |
| 18 | చంద్రాంశము | 37 | సుధాంశము |
| 19 | మృద్వంశము | 38 | అమృతాంశము |

| షష్ట్యంశము | పేరు | షష్ట్యంశము | పేరు |
|---|---|---|---|
| 39 | పరిపూర్ణాచంద్రాంశం | 50 | ఇందుముఖాంశము |
| 40 | విషప్రదష్టాంశము | 51 | ప్రవీణాంశము |
| 41 | కలినాశాంశము | 52 | కాలఘ్న్యాంశము |
| 42 | ముఖ్యాంశము | 53 | దండాయుధాంశము |
| 43 | వంశక్షయాంశము | 54 | నిర్మలాంశము |
| 44 | ఉత్పాతకాంశము | 55 | శుభాంశము |
| 45 | కాలరూపాంశము | 56 | అశుభాంశము |
| 46 | సౌమ్యాంశము | 57 | అతిశీతలాంశం |
| 47 | మృద్వంశము | 58 | సుతాపయోద్వాంశము |
| 48 | సుశీతలాంశము | 59 | భ్రమళాంశము |
| 49 | దంష్ట్రాకరాళాంశము | 60 | ఇందురేఖాంశము |

ఉదాహరణ లగ్నము వృశ్చికం 23.25 కావున 47వ దయినది. వృశ్చికము సరిరాశి కావున ఇందు రేఖాంశమునుంచి అనగా కిందనుంచి 47వది –దేవగణాంశము.

ఈ విధముగా జన్మలగ్నమునకు, నవగ్రహములకు 16వర్గులు కట్టగా, ఏ గ్రహమునకు 8 స్వవర్గులు వచ్చునో ఆ గ్రహము శభగ్రహమని, ఆదశ యోగించునని తెలుసుకొనవలయును. 8కంటె తక్కువ వచ్చిన గ్రహములు క్రమంగా తక్కువ ఫలితములనిచ్చును.

కనీసం 3 స్వవర్గులు రావలయును.

| | | |
|---|---|---|
| 2 స్వవర్గులు | పారిజాతాంశం | సామాన్యము |
| 3 స్వవర్గులు | ఉత్తమాంశ | సంపద |
| 4 స్వవర్గులు | గోపురాంశ | ధనం-విద్య |
| 5 స్వవర్గులు | సింహాసనాంశ | భూములు |
| 6 స్వవర్గులు | పారావతాంశ | శాస్త్రవేత్త |
| 7 స్వవర్గులు | దేవలోకాంశ | పదవి |
| 8 స్వవర్గులు | కుంకుమాంశ | సుఖము |
| 9 స్వవర్గులు | ఐరావతాంశ | పదవులు |
| 10 స్వవర్గులు | శివాంశ | ఐశ్వర్యం |
| 11 స్వవర్గులు | భాస్వదంశ | ముక్తి |
| 12 స్వవర్గులు | భాస్వదంశ | ముక్తి |
| 13 స్వవర్గులు | వైశేషికాంశ | ముక్తి |

శ్రీం

శ్రీ మహాగణాధిపతయే నమః
ఓం అశ్వలాయనాయ నమః

# నారద సంహిత

శ్లో॥ అణోరణుతరః సాక్షాదీశ్వరో మహతో మహాన్।
ఆత్మా గుహాయాం నిహితోస్య జంతో జయత్యతీంద్రియః॥

అణువుకంటే అణుతరమైన సూక్ష్మరూపుడు, మహత్ కంటే పెద్దదైన స్వరూపము గలవాడైన "ఈశ్వరుడు" ఇంద్రియములకు గోచరము కానివాడై, జీవుల ఆత్మయనెడి గుహయందు సర్వశ్రేష్ఠముగా భాసిల్లుచున్నాడు.

బ్రహ్మ, శివుడు, వశిష్ఠుడు, అత్రి, మనువు, పౌలస్త్యుడు లోమకుడు, మరీచి, అంగిరసుడు, వ్యాసుడు, నారదుడు, శౌనకుడు, భృగువు, చ్యవనుడు, యవనుడు, గర్గుడు, కశ్యపుడు, పరాశరుడు, ఈ 18మంది జ్యోతిషశాస్త్ర ప్రవర్తకులైనారు.

వేదమునకు జ్యోతిషశాస్త్రము నిర్మల నేత్రము వంటిది. ఇది సిద్ధాంతము, సంహిత, హోరా, అనెడి 3స్కంధములుగా విభజింపబడినది, ఇది వేదాంగముగా పిలవబడుచూ మానవాళికి, శుభాశుభములను తెలియపరచుచున్నది.

యజ్ఞము, అధ్యయనము, సంక్రాంతి, పుణ్యకాలము గ్రహస్థితులు, షోడశ కర్మలు, వీటి ముహూర్త నిర్ణయములు అన్నియు, జ్యోతిషశాస్త్రము వల్లనే సిద్ధించుచున్న అందుకొరకే బ్రహ్మ ఈ శాస్త్రమును సృష్టించెను. అనంతరము ప్రపంచహితమునకై నారదుడు స్కంధద్వయమును రచించి పిమ్మట ఈ హోరా శాస్త్రమును (నారదసంహిత రచించెను. ఇందు గ్రహచారము, సంవత్సర ఫలితములు తిథి, వార, నక్షత్రములు, యోగములు, ముహూర్తములు, ఉపగ్రహములు, సూర్య సంక్రాంతి ఫలము, గోచారము లగ్న వివరములు, ప్రధమ రజస్వలా వివరములు, ఆధానము పుం సవనము, సీమంత, జాతకర్మ, నామకర్మ, అన్న ప్రాశన చౌలకర్మ, మంగళాంకురార్పణ, మౌంజీబంధవ, వివాహ ప్రతిష్ఠ, వాస్తు, యాత్ర, వృష్టి, శాంతికర్మ, శ్రాద్ధ లక్షణములతో 32 అధ్యాయములుగా "నారద సంహిత" రచించబడినది.

స్కంధత్రయమును అధ్యయనముచేసి, వేదశాస్త్ర నిష్ణాతుడై, గర్వములేనివాడై, సత్యవాదియై, దైవస్వరూపమును తెలుసుకొన్నవాడు "దైవజ్ఞు" డగును.

## సంవత్సర ఫలములు

చైత్రాది మాసములందు క్రమముగా మేషాది సంక్రమణములు ఏర్పడును. అనగా చైత్రమునందు మేష సంక్రాంతి, వైశాఖమునందు వృషభ సంక్రాంతి కలుగును. చైత్రశుద్ధ పాడ్యమి ఏవారమునందు ఏర్పడునో ఆ వారాధిపతి ఆ సంవత్సరమునకు "రాజు" అగును.

**ఉదా:** చైత్రశుద్ధ పాడ్యమి శనివారమునాడు ఏర్పడినచో, ఆ సంవత్సరమునకు "శని" రాజగును.

మేష సంక్రాంతి ఏవారమున ఏర్పడునో ఆ వారాధిపతి అతడు ఆ సంవత్సరము నకు సేనాపతి అగును. కర్కట సంక్రాంతి ఏర్పడిన వారాధిపతి సస్యాధిపతి అగును. తులా సంక్రాంతి ఏర్పడిన వారాధిపతి రసాధిపతి అగును. మకర సంక్రాంతి ఏర్పడిన వారాధిపతి నీరసాధిపతి అగును అనగా బంగారము మొదలగు లోహథాతువులు, వస్త్రములు వీటికి అధిపతి అగును.

వర్షాధిపతి గాని, మంత్రిగాని, సస్యాధిపతిగాని సూర్యుడైనచో, ఆ సంవత్సరము నందు అధికారులకు క్రోధము, పంటలు తక్కువుగా పండుట. వర్షములు తక్కువ కురియుట బియ్యము ధరలు పెరుగుట జరుగును.

చంద్రుడైనచో గోధుమలు, బియ్యము బాగా పండును. కుజుడైనచో అగ్నిభయం, చోరబాధలు, కరువు-కాటకములు, వర్షములు పడకుండుట జరుగును. బుధుడైనచో ఈదురుగాలులు, స్వల్ప వర్షములు ఏర్పడును. వర్షాధిపతి మొదలగునవి గురుడైనచో యజ్ఞములు, సత్కర్మలు జరుగుట పంటలు, వర్షములు, ధనసంపతి కలుగును. శుక్రుడయినచో ధాన్యములు, చెరుకు బాగా పండును. శని రాజైనచో దుర్భిక్షము, వరదలు, యుద్ధభయం కలుగును.

దండాకారముగాగాని, కీలలుగాగాని, సూర్యునియందు మచ్చలు కనిపించినచో, భయము, దొంగల బాధ, ధననష్టం, ఉపద్రవములు భూమిపై కలుగును. గొడుగు,

జెండా వంటి మచ్చలు, పొగరేఖలు, సూర్యునియందు కనబడినపుడు దేశము నందు, జననష్టము ఏర్పడును. సూర్యకిరణములు భిన్న వర్ణములుగా గోచరించినపుడు తెలుపు బ్రాహ్మణులు, ఎరుపు రాజులు, పసుపు–వ్యాపారులు, నలుపు–కార్మికులు (పనివారు) నశించెదరు.

బూడిదరంగు కిరణములు మేఘములకు, అధోముఖముగా సూర్యునియందు కనబడినచో పరిపాలకులు నశింతురు. ఉదయ, సాయం సంధ్యలయందు కపిలవర్ణ కాంతి, శిశిరఋతువు నందు కనపించుట చాలా మంచిది. వసంత ఋతువునందు కుంకుమకాంతి, గ్రీష్మమునందు బంగారు, వర్షఋతువునందు వర్ణమిశ్రమముగల కాంతులు కనబడుట చాలా మంచిది, దేశక్షేమము కలుగును.

ఇంద్రధనస్సులు క్రమముగా పసుపు, నలుపు, ఎరుపు, రంగులతో ఏర్పడినపుడు, సూర్యునియందు కూడా ఈ రంగులు గోచరించినపుడు యుద్ధములు కలుగును.

నెమలి ఫించమువంటి కాంతి సూర్యుని నుండి కలిగినపుడు 12 సం॥ములు వర్షము పడదు. కుందేటి రక్తము వంటి ఎరుపురంగు, ఆకాశమునందు సూర్యునివలన సంభవించినపుడు యుద్ధములు ఏర్పడును. నలుపురంగుగా ఏర్పడినచో అంటువ్యాధుల భయము, బూడిరంగు అయినచో ప్రమాదములు సంభవిస్తాయి.

సూర్యమండలమందు రంధ్రం కనబడితే పాలకులు నశిస్తారు. తోరణము వంటి ఆకృతి కనబడినచో పట్టణమంతా నశిస్తుంది. సూర్యుడు ఖండితముగా కనబడిన దేశాధినేత మరణిస్తాడు. సూర్యోదయమందుగాని, సూర్యాస్తమయ సమయమునందు గాని నక్షత్రం రాలితే, పిడుగుపడినా యుద్ధభయం, పాలకమృతి ఏర్పడతాయి.

నెలపొడుపునందు, ఉదయకాలమందు మీనరాశి యందుగాని, మేషరాశి యందు గాని చంద్రుడు దక్షిణదిశగా శృంగోన్నతం ఏర్పడితే అశుభం జరుగుతుంది. అదే మిథున, మకరరాశులలో చంద్రుడు కుడిప్రక్కగా ఏర్పడితే చాలా శుభం కలుగుతుంది.

వృషభ, కుంభరాశులలో చంద్రుని యొక్క రెండు కొనలూ సమానంగా ఉన్నా, కర్కాటక–సింహ రాశులలో బాణాకారముగానున్నా, వృశ్చిక ధనురాశులలో స్థూలా కారముగానున్నా, కన్యా, తుల రాశులలో శూలాకారముగానున్నా శుభప్రదముగా

ఉంటుంది. దీనికి వ్యతిరేకంగా కనబడితే కరువు, కలహములు ఆనెల అంతా ఏర్పడతాయి.

పూర్వాషాఢ–ఉత్తరాషాఢ–జ్యేష్ఠ–మూల ఈ నక్షత్రములలో చంద్రుడు దక్షణ సంచారి అయితే అగ్నిభయం, జల, వనజంతువుల నాశనం కలుగుతుంది.

విశాఖ, అనూరాధల యందు, చంద్రుడు శుభప్రదుడు, ఆర్ద్ర నుండి 12 నక్షత్రములయందు మధ్యమప్రయాణం మంచిది.

భరణి–జ్యేష్ఠ–ఆశ్లేష శతభిషం–స్వాతి వీటిని అర్ధ నక్షత్రములు అంటారు. ధ్రువనక్షత్రము, పునర్వసు, నక్షత్ర అధ్యర్థ నక్షత్రములని పిలుస్తారు. శుక్లపక్షమందు పిపీలిక (చీమ) వలె మధ్యన సన్నగాఉన్న చంద్రుడు హానికారకుడు. కృష్ణపక్షమందు శుభదాయకుడు. దక్షిణ ప్రక్క స్థూలంగా ఉంటే వృద్ధిదాయకుడు అవుతాడు.

స్థూలంగా, సుందరంగా ఉన్న చంద్రుడు సుభిక్షం కలుగజేస్తాడు. కృశించిన చంద్రుడు దుర్భిక్ష కారకుడు. అథోముఖంగా బింబం ఉంటే యుద్ధభయం. ప్రమాదములు కలుగుతాయి. దండాకారముగానుంటే, ప్రజలలో కలహములు (సమ్మెలూ, విప్లవాలు) కలుగుతాయి.

చంద్రుని శృంగములు కుజునిచే వేధింపబడినచో క్షేమము, బుధునిచే నాశనము, గురునిచే ఆనందము, శుక్రునిచే అనావృష్టి, శనిచే పాలకుల మృతి, రవిచే ప్రజానాశనం కలుగుతాయి.

కుజుడు తాను ఉదయించిన, నక్షత్రము నుండి 7–8–9 నక్షత్రములలో వక్రించినట్లయిన, ఆ నక్షత్రముయందుండు నంతకాలము, ప్రజలకు అనేక బాధలు, అగ్నిభయం కలుగుతాయి. 10–11–12 నక్షత్రములలో వక్రించిన, ప్రజలకు సుఖసంతోషములు, అనావృష్టి కలుగుతాయి. 13వ నక్షత్రమందు వక్రించినచో, "వ్యాలవక్రీ" అంటారు. దీనివల్ల పంటలు బాగా పండుతాయి. సర్పభయం,15వ నక్షత్రమందు వక్రించినచో, "వ్యాలవక్రీ" అంటారు. దీనివల్ల పంటలు బాగా పండు తాయి. సర్పభయం 15వ నక్షత్రమందు వక్రించిన "రుధిరానన వక్రీ" అని పిలువ బడతాడు. దీనివల్ల సుభిక్షంగా ఉంటుంది, కాని రోగభయం. 17–18 నక్షత్రము

లందు, వక్రత్వం పొందితే, "అసిముసలవక్రి" అంటారు. దీనిఫలితం చోరబాధలు, దోపిడీలు జరుగుతాయి.

పుబ్బ, ఉత్తర, నక్షత్రములందు కుజ గ్రహము ఉదయించి ఉత్తరాషాఢయందు వక్రించి రోహిణి నక్షత్రమందు అస్తంగతుడైనచో 3లోకములను నశింపజేయును. శ్రవణం, పుష్యమి నక్షత్రములందు ఉదయించి, వీటియందే వక్రించినచో దేశాధి నేతలకు హాని, ఏ దిశయందు కుజగ్రహము ఉదయించునో ఆ దిశయందలి దేశాధి పతులకు హాని కలుగుతుంది.

మఖయందు కుజగ్రహము ఉదయించి, మరల అదే నక్షత్రమునందు వక్రించినచో వర్షము కురియదు. ప్రజలలో యుద్ధభయం, పాండు దేశాధిపతి మరణించును.

మఖ, విశాఖ, రోహిణి ఈ తారలను కుజ గ్రహము భేదించినప్పుడు, కరువు, అంటువ్యాధులు ఏర్పడతాయి.

ఉత్తరాత్రయమునందు, రోహిణి, మూల, శ్రవణము మృగశిర వీటియందు కుజగ్రహము సంచరించు కాలములోను, రోహిణి నక్షత్రమునకు (అల్డీబరాన్) దక్షిణముగా నున్నను, వర్షములు పడవు. కుజగ్రహము నక్షత్రములకు ఉత్తరదిశ గమనము శుభప్రదము, దక్షిణదిశ గమనము అశుభప్రదము. ఏ నక్షత్రమును భేదించిననూ, ప్రజలలో ఆందోళనలు, సమ్మెలు విప్లవములు కలుగుతాయి.

బుధ గ్రహము-ధనిష్ఠ, శ్రవణం, ఉత్తరాషాఢ, మృగశిర, రోహిణీ నక్షత్రములందు సంచరించినపుడు, భేదనము చేయునపుడు వర్షములు కురియవు. ప్రజలకు రోగబాధలు ఎక్కువగా కలుగుతాయి. ఆర్ద్ర నుండి మఖవరకు గల నక్షత్రములలో బుధ సంచారము కలహప్రదము దుర్భిక్షప్రదము హస్తనుండి జ్యేష్ఠవరకు గల నక్షత్రములలో సంచరించునపుడు ప్రజలు ఆరోగ్యముగాను, ఆనందముగాను, సుభిక్షముగాను ఉందురు, పశునాశనం జరుగుతుంది.

ఉత్తరాభాద్ర, ఉత్తర, కృత్తిక, భరణి ఈ నక్షత్రములందు బుధ సంచారము జీవులకు ధాతుక్షయము అనావృష్టి కలుగుతాయి.

అశ్విని, శతభిషం, మూల, రేవతి నక్షత్ర సంచారము, వైద్యులకు గుర్రములకు, వ్యాపారులకు అరిష్టం.

పూర్వాషాఢ, పూర్వాభాద్ర, పూర్వఫల్గుణి, (పూర్వత్రయం) యందు సంచరించుచూ, యోగతారలను భేదించినపుడు, కరువు, యుద్ధము, రోగము, దోపిడీలు జరుగుతాయి.

భరణి, కృత్తిక, రోహిణి, స్వాతి, నక్షత్రములందు బుధ సంచారమును, "ప్రాకృతగతి" అని పిలుస్తారు. ఆర్ద్ర, ఆశ్లేష, మఖ, మృగశిర, వీటియందు సంచారమును మిశ్రగతి అని పిలుస్తారు. పునర్వసు, పుబ్బ, ఉత్తర, పుష్య, నక్షత్ర సంచారమును సంక్షేపగతియని, పూర్వాభాద్ర, ఉత్తరా జ్యేష్ఠ, రేవతి, అశ్విని, వీటియందు సంచారమును తీక్ష్ణగతియని పిలుస్తారు.

పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, మూల ఈ నక్షత్రములందు బుధసంచారము యోగాంతికగతి అని అంటారు. శ్రవణం, చిత్త, ధనిష్ఠ, శతభిషముల యందు సంచారము ఘోరగతి అంటారు.

విశాఖ, అనూరాధ, హస్త నక్షత్ర సంచారము పాగగతి అంటారు.

ప్రాకృత గతియందు 40రోజులు బుధగ్రహం సంచరిస్తుంది. మిశ్రగతియందు 30, సంక్షిప్త గతియందు 22, తీక్ష్ణ గతియందు 20, యోగాంతిక గతియందు 9, ఘోరగతియందు 15, పాపగతియందు 11 రోజులు బుధగ్రహ సంచారము ఉంటుంది.

ప్రాకృతగతి యందు సస్యవృద్ధి, ప్రజలు సుఖ సంతోషముతో ఉంటారు. శుభవర్షములు పడతాయి. మిశ్రగతియందు, సంక్షిప్త గతియందు శుభప్రదం. ఇతర గతులు మంచివి కావు. అశ్విని, కృత్తిక యందు బుధగ్రహము ఉదయించిన కరువు, యుద్ధములు, అగ్నిభయం కలుగుతాయి. వెండి, స్ఫటికమువలె స్వచ్ఛముగా బుధగ్రహము ఉదయించినచో శుభప్రదముగా ఉంటుంది.

గురుగ్రహము కృత్తిక, రోహిణి నక్షత్రములందు సంచరించునపుడు ఆ సంవత్సరమును "కార్తీక వత్సరం" అంటారు. చంద్రుడు పున్నమినాడు ఉండు నక్షత్రమును బట్టి నెలలకు పేరువచ్చినట్టు, గురువత్సరాలు ఏర్పడతాయి.

గురు కార్తీక వత్సరమందు పశుపాలకులు, అగ్నివలన జీవించువారు, కర్షకులు, పుష్పవ్యాపారులు క్లేశములు పొందుతారు, అగ్నిభయం కలుగుతుంది.

గురు మార్గశిరమందు వర్షములు కురియవు. పంటలు పురుగులవల్ల నశిస్తాయి. ప్రజలలో వ్యాధులు, దేశములలో పరస్పర శతృత్వము కలుగుతాయి.

గురు పౌష్యవత్సరమందు ప్రజలకు ఆనందము, ధర్మ కార్యములు చేయుట, దేశములు పరస్పరము ఉపకరించుకొనుట జరుగును.

మాఘవర్షమందు దేశము సుభిక్షముగా ఉంటుంది. ఫాల్గుణవత్సరమందు స్త్రీలకు దు:ఖము, పంటల దిగుబడి తగ్గుతుంది. చైత్రవర్షమందు ధాన్యవృద్ధి, వైశాఖ వర్షమందు సస్యవృద్ధి, ఆనందం, జ్యేష్ఠవర్షమందు అరణ్య నాశనము, శతృభయం, ఆషాఢ వర్షమందు యుద్ధభయం, శ్రావణ వర్షమందు దేవపూజ, సస్యవృద్ధి, భాద్రపద వర్షమందు మధ్యమ వృష్టి, యుద్ధం, ధాన్యవృద్ధి కలుగుతాయి. ఆశ్వియుజ వర్షమందు సంపూర్ణ శుభఫలములు, ప్రజలు సుఖ సంతోషములు పొందుతారు.

కృత్తిక, రోహిణి ఈ రెండూ సంవత్సమునకు శరీరము వంటివి. పూర్వాషాఢ, ఉత్తరాషాఢ నాభి, ఆర్ద్ర హృదయం, మఖ పుష్పం (యోగి).

శరీర నక్షత్రములందు క్రూరగ్రహములు (రవి-కుజ-శని-రాహువులు) సంచరించునపుడు, కరువు అగ్నిభయం, నాభియందు క్రూరగ్రహములు సంచరిస్తే పంటలు నాశనం, హృదయమందు సంచారం వల్ల దరిద్రం, నిరుద్యోగవృద్ధి కలుగుతాయి. శుభగ్రహ సంచారం వల్ల శుభ ఫలితాలు జరుగుతాయి.

## గురుడు మేషాది సంచార ఫలితములు

| | |
|---|---|
| **మేషం** | పశునష్టం, ఈతిబాధలు, సస్యవృద్ధి |
| **వృషభం** | స్త్రీ, బాల, పవునష్టం, యుద్ధం, మధ్యవృష్టి. |
| **మిధునం** | బ్రాహ్మణులకు బాధలు, సస్యవృద్ధి |
| **కర్కాటకం** | పాడివృద్ధి, స్త్రీ సమృద్ధి, సస్యవృద్ధి |
| **సింహం** | బ్రాహ్మణులకు దరిద్రం, వర్షవృద్ధి, గొప్పవారి మృతి |

| | |
|---|---|
| **కన్య** | బ్రాహ్మణులకు సుఖం, వర్షములు, సంతోషము |
| **తుల** | సమృద్ధి మంచి వర్షములు, సుఖము |
| **వృశ్చికం** | యుద్ధములు, కరువులు, ప్రమాదాలు |
| **ధనస్సు** | వర్షములు తక్కువ, దేశములకు ధననష్టం, యుద్ధభయం |
| **మకరం** | స్నేహం, వర్షములు, సస్యవృద్ధి, సుఖము |
| **కుంభం** | ప్రజలు దేవతాసమానులౌతారు. క్షేమం, ఆరోగ్యం |
| **మీనం** | ధాన్యవృద్ధి, నాయకులు న్యాయమార్గ ప్రవర్తకులు |

శుక్ర గ్రహము మఘ మొదలు 5 నక్షత్రములలో సంచరించునపుడు మంచి వర్షములు కురియును. స్వాతి విశాఖ అనూరాధలయందు కూడా శుభప్రదం. బహుళ అష్టమి చతుర్దశి, అమావాస్యలయందు పై యోగములు కలిగినపుడు వరదలు సంభవిస్తాయి.

శుక్ర–గురులు పరస్పరం సమసప్తక రాశులయందున్నపుడు దుర్భిక్షములు, జననష్టం, కలుగుతాయి.

కుజ–బుధ–గురు–శనులు, శుక్రునకు ముందుగా సంచరిస్తే యుద్ధములు, ఝంఝా మారుతములు, అనావృష్టి కలుగతాయి. శుక్రగ్రహముపై నల్లరంగు మచ్చ కనబడితే పశ్చిమ దేశములకు, గ్రీకు దేశమునకు అరిష్టం.

| **ఉత్తర మార్గం** | **మధ్యమ మార్గం** | **దక్షిణమార్గం** |
|---|---|---|
| నాగవీధి | వృషభ వీధి | మృగ వీధి |
| గజవీధి | గౌ వీధి | అజవీధి |
| ఐరావత వీధి | జరద్గవ వీధి | దహన వీధి |

ఆశ్వన్యాది మూడు నక్షత్రములు ఒక వీథి అనబడును. అనంతరం 3 నక్షత్రములు ఒక వీథి అవుతాయి. ఈ విధముగా 9 వీధులు సంజ్ఞగా ఏర్పడతాయి.

మధ్యమ మార్గంలోని 3 వీధులలోనూ, శుక్ర గ్రహము సంచరించునపుడు మధ్యమ ఫలితములు కలుగుతాయి. ఉత్తర మార్గమందలి వీధులలో సంచరించునపుడు అన్న సమృద్ధి, ప్రజలు సుఖ సంతోషములతో కాలం గడుపుతారు. దక్షిణ వీధి సంచారంలో ధరలు అధికం.

శనిగ్రహము స్వాతి, భరణి, ఆర్ద్ర, పుబ్బ, హస్త, శ్రవణం నక్షత్రములలో సంచరించునపుడు ప్రజలు సుఖ సంతోషములు పొందుతారు.

శతభిషం, ఆశ్లేష, జ్యేష్ఠలయందు సంచరించునపుడు కూడా మంచి ఫలితాఏ జరుగుతాయి. మూలయందు యుద్ధము, అనావృష్టి, ఉత్తరాభాద్ర, రేవతియందు సంచారం వల్ల ప్రజలలో భయం, ఉగ్రవాదం ఏర్పడతాయి.

జన్మనక్షత్రం నుంచి శని సంచరించు నక్షత్రమువరకు లెక్కించునపుడు ఆయా ఫలితములు.

| | | |
|---|---|---|
| జన్మనక్షత్రం శిరస్సునందు | 1– | రోగం |
| ముఖమునందు | 3– | లాభం |
| గుదము | 2– | హాని |
| నేత్రములు | 2– | లాభం |
| హృదయము | 5– | సౌఖ్యము |
| ఎడమ చేయి | 4– | బంధనం |
| ఎడమ కాలు | 3– | దుఃఖము |
| కుడికాలు | 3– | మనోవాంఛితయాత్ర |
| కుడిచేయి | 4– | ధనప్రాప్తి |

శనిగ్రహము వక్రించినపుడు చెడుఫలితములు కలుగుతాయి. మధ్యమ గతియందు, మధ్యమ ఫలితములు. శీఘ్రగతియందు శుభఫలితములు ఇస్తాడు.

సంవత్సరంలో 2 గ్రహణాలు తప్పక ఏర్పడతాయి. కల్పాది నుండి 7గురు దేవతలు ఈ గ్రహణములకు అధిపతులు. వీరు బ్రహ్మ–ఇంద్ర– చంద్ర–కుబేర–వరుణ–అగ్ని–యములు.

1) బ్రహ్మసంజ్ఞగల గ్రహణ మేర్పడినపుడు పశువుల పంటల వృద్ధి, బ్రాహ్మణులకు సుఖ సంతోషములు కలుగుతాయి.

| | | |
|---|---|---|
| 2) చంద్ర | – | పండిత పీడ |
| 3) ఇంద్ర | – | పంటలు నాశనం, ప్రజాపీడ |
| 4) కుబేర | – | వ్యాపారులకు హాని |
| 5) వరుణ | – | పాలకులకు నష్టం, ప్రజలకుసుఖం |
| 6) అగ్ని | – | సస్యవృద్ధి |
| 7) యముడు | – | అనావృష్టి |

ఒకే నెలలో సూర్యగ్రహణము, చంద్ర గ్రహణము ఏర్పడితే, దేశముల మధ్య శతృత్వము, అనావృష్టి, సంపూర్ణ గ్రహణ మేర్పడితే కరువు అగ్ని, వాయు ప్రమాదములు కలుగుతాయి.

తోకచుక్కలు (ఉల్కాపాతం) గోచరించునపుడు కొన్ని శుబాశుభ ఫలితములు కలుగుతాయి.

జెండా–అస్త్రము–గోపురం–రధము–చెట్టు–ఏనుగు–శూలము స్థంభం, గద ఈ ఆకారములలో ఆకాశమందు కనబడినపుడు, అంతరిక్ష ఉత్పాతము లంటారు. తోకచుక్క దర్శనం వల్ల తీవ్రచెడు ఫలితములు, ఆకాశమందు వివిధాకారముల వల్ల మధ్యమ ఫలితములు, భూమిపై ఏర్పడు ఉత్పాతముల వల్ల మంద ఫలితములు చెడుగా కలుగుతాయి.

తెల్లటి తోకతో చుక్క కనిపించి, వెంటనే అదృశ్యమైతే శుభఫలితాలు కలుగుతాయి. మంచి వర్షాలు కురుస్తాయి. బూడిదరంగు, ఇంద్రదనస్సు రంగులలోనూ తోకచుక్క గోచరిస్తే దేశారిష్టము కలుగుతుంది.

మంకెన పువ్వువలె ఎర్రగా కనబడితే అగ్ని ప్రమాదములు కలుగతాయి.

నల్లరంగు తోకచుక్కవల్ల జననష్టం మూడు రంగుల తోకచుక్కను "బ్రహ్మదండం" అంటారు. దీని ఫలితం కూడా జననష్టమే.

తెల్లరంగు తోచుక్క ఈశాన్య దిశలో గోచరిస్తే "శుక్రపుత్ర" అంటారు, ఫలితం – అరిష్టం.

బంగారు రంగుతో రెండు శిఖలుగా గలది "శనిపుత్ర" ఫలితం–అరిష్టము, చిన్నది, తెల్లనిది, బుధపుత్ర – దోపిడీలు విశ్వరూపమనే తోకచుక్క, అగ్ని సహన కాంతి గలది, దేశ సౌభాగ్యం కలుగజేస్తుంది. వికచమనే పేరుగల తోకచుక్క 'గురుపుత్ర' ఫలితం అరిష్టం, ఇవేగాక, కంక, కుంకుమ, కబంధ తోకచుక్కవల్ల ప్రజానష్టం, ప్రకృతి వైపరీత్యాలు, పాలకుల మీతి కలుగుతాయి.

కృత్తికా నక్షత్రమందు (ప్లయడిస్) ధూమకేతువు ఉదయిస్తే జననష్టం, పాలకుల మృతి భూకంపాలు కలుగుతాయి.

కాలమును కొలుచుటకు 9 విధములుగా ప్రమాణలున్నవి. 1.బ్రహ్మ, 2. దైవ, 3.మానుష, 4.పిత్రు, 5.సౌర, 6.సావన, 7.చంద్ర 8.నక్షత్ర, 9.గురు మానములు, వీటిలో 5 వ్యావహారికముగా లెక్కించబడుచున్నవి.

గ్రహనములు పౌరమానముచే లెక్కించబడును. విధి విధానం, స్త్రీ గర్భకాలము సావనమానముచే గుణించడును వర్షాకాలము నక్షత్రమానముచే లెక్కించబడును.

యాత్ర వివాహం–వ్రతం–తిథి–పర్వములు, మొదలైనవి చాంద్రమానముచే గుణించబడును.

ప్రభవాది సం॥ర లక్షణములు గురుమానముచే లెక్కించబడును.

సూర్య సంక్రాంతి నుండి సౌరమానము, శుద్ధ పాడ్యమి నుండి చాంద్రమానము లెక్కించబడును.

ప్రభవ నుండి క్షయ వరకు 60సం॥లు. ప్రభవాది 5సం॥లకు యుగము అనిపేరు. ఇటువంటి యుగములు 12 వీటికి వరుసగా 1.విష్ణు 2.బృహస్పతి 3.ఇంద్ర, 4.భౌమ 5.తష్ట్వా 6.అహిర్ బుధ్న్య 7.పిత్రు 8.విశ్వదేవ 9.చంద్ర 10 ఇంద్రాగ్నులు 11.భగ 12. అశ్వినీ కుమారులు అధిదేవతలు.

# ప్రభవాది సంవత్సర ఫలితములు

| | | | |
|---|---|---|---|
| 1. | ప్రభవ | – | ప్రజా సుఖం |
| 2. | విభవ | – | సుఖం, ధనము |
| 3. | శుక్ల | – | భోగ – |
| 4. | ప్రమోదం | – | రోగం |
| 5. | ప్రజాప్రతి | – | ఆనందం |
| 6. | అంగిర | – | అన్నవృద్ధి |
| 7. | శ్రీముఖ | – | పాడివృద్ధి |
| 8. | భావ | – | రాజ్యవృద్ధి |
| 9. | యువ | – | రతిసుఖం |
| 10. | ధాత | – | నిర్భయం |
| 11. | ఈశ్వర | – | సుఖం |
| 12. | బహుధాన్య | – | ధాన్యవృద్ధి |
| 13. | ప్రమాధీ | – | శతృభయం |
| 14. | విక్రమ | – | రాజ్యకాంక్ష |
| 15. | వృష | – | పుష్టి |
| 16. | చిత్రభాను | – | ప్రకృతి శోభ |
| 17. | సుభాను | – | ఫలవృద్ధి |
| 18. | తారణ | – | నౌకావృద్ధి |
| 19. | పార్ధవ | – | వడగళ్ళ వాన |
| 20. | వ్యయ | – | ఖర్చు |
| 21. | సర్వజిత్ | – | గర్వం |
| 22. | సర్వధారి | – | ఆనందం |
| 23. | విరోధి | – | యుద్ధం, వరద |
| 24. | వికృతి | – | దుర్జన గౌరవం |
| 25. | ఖర | – | యుద్ధం |

| | | | |
|---|---|---|---|
| 26. | నందన | – | ధనవృద్ధి |
| 27. | విజయ | – | సస్యవృద్ధి |
| 28. | జయ | – | సమృద్ధి |
| 29. | మన్మథ | – | సుఖం |
| 30. | దుర్ముఖ | – | అగ్నిప్రమాదాలు |
| 31. | హేమలంబ | – | ధరలవృద్ధి–సుఖం |
| 32. | విలంబ | – | రోగములు |
| 33. | వికారి | – | జలవృద్ధి |
| 34. | శార్వరి పంటలు | – | సమృద్ధి |
| 35. | ప్లవ | – | ఉత్సవములు |
| 36. | శుభకృత్ | – | మైత్రి |
| 37. | శోభన | – | సంపదలు |
| 38. | క్రోధి | – | రోగములు |
| 39. | విశ్వావసు | – | లోభిత్వం, చౌర్యము |
| 40. | పరాభవ | – | తిరస్కారం |
| 41. | ప్లవంగ | – | రోగములు |
| 42. | కీలక | – | శతృత్వం |
| 43. | సౌమ్య | – | శీతరోగములు |
| 44. | సాధారణ | – | సుఖము |
| 45. | విరోధకృత్ | – | నాయకుల వైరం |
| 46. | పరిధావి | – | అంటువ్యాధులు |
| 47. | ప్రమాదీ | – | దుఃఖము |
| 48. | ఆనంద | – | సుఖము |
| 49. | రాక్షస | – | యుద్ధం |
| 50. | అనల | – | అగ్ని ప్రమాదాలు |
| 51. | పింగళ | – | మేఘాడంబరము |

| | | | |
|---|---|---|---|
| **52.** | కాళయుక్తి | – | సుఖం |
| **53.** | సిద్ధార్థి | – | సస్యవృద్ధి |
| **54.** | రౌద్ర | – | క్రోధం |
| **55.** | దుర్మతి | – | భయం |
| **56.** | దుందుభి | – | తూర్పుదేశారిష్టం |
| **57.** | రుధిరోద్గారి | – | రోగములు |
| **58.** | రక్తాక్షి | – | సస్యవృద్ధి |
| **59.** | క్రోధన | – | కోపము |
| **60.** | క్షయ | – | సస్యనాశనం |

ఉత్తరాయణమందు ఉపనయములు – వివాహము, గృహప్రవేశము, ప్రతిష్ఠ, యజ్ఞములు మొదలగు శుభకార్యములు ఆచరించాలి. దక్షిణాయనమునందు అశుభ కర్మలు, మాస ప్రధాన కర్మలు ఆచరించాలి.

## తిథులకు అధిపతులు

పాడ్యమి – అగ్ని
విదియ – బ్రహ్మ
తదియ – గౌరి
చవితి – గణపతి
పంచమి – సర్పము
షష్ఠి – స్కంధుడు
సప్తమి – సూర్యుడు
అష్టమి – శివుడు
నవమి – దుర్గ
దశమి – యముడు
ఏకాదశి – విశ్వే దేవతలు
ద్వాదశి – హరి
త్రయోదశి – మన్మథుడు
చతుర్దశి – శర్వుడు

పూర్ణిమకు చంద్రుడధిపతి, అమావాస్యకు పితృదేవతలు అధిపతులు.

పాడ్యమియందు చేయదగినవి చిత్రలేఖనం – వ్యవసాయం – తైలముమర్ధించుట. చెట్లు నరుకుట చేయవచ్చు.

విదియ ఉపనయనము, వివాహం, యాత్ర, ప్రతిష్ఠ, అలంకారం, గృహారంభం, షష్ఠి కర్మలు.

తదియ ఉపనయనం, ప్రతిష్ఠ, శిల్పవిద్య, పశువులు కొనుట, నీటిపై ప్రయాణము.

చవితి, నవమి, చతుర్దశి, సంగీతం, మంత్రోపాసన, ఆయుధ విద్య, మంత్ర ప్రయోగములు.

పంచమి ఉపనయనం, వివాహం, యాత్ర, గ్రహశాంతి, షష్ఠి, పశువులు కొనుట, వాస్తు కర్మ, క్రయ విక్రయములు, అలంకారములు, వ్యవహారములు.

సప్తమి ప్రయాణం, వాహనం, వివాహం, వాస్తు, ఉపనయనం, అష్టమి వ్యవసాయం, వాణిజ్యం, యుద్ధం, శివస్థాపన, జలకర్మ.

దశమి దేవపూజ, ప్రయాణం, శుభకర్మలు

ఏకాదశి ఉపవాసం, శుభకర్మలు, శిల్పకర్మ, విచిత్ర కర్మ

ద్వాదశి దానశాంతులు, పుష్టికర్మ, యాత్ర

త్రయోదశి అగ్నిస్థాపన, శుభకర్మలు, యాత్ర

పూర్ణిమ తైలమర్దనం, స్త్రీ సంగమం, కర్రలు తెచ్చుట, క్షీరం, ఇవితప్ప అన్ని శుభకర్మలూ చేయవచ్చు.

అమావాస్య యందు, పితృకర్మలు తప్ప ఏ పనీ చేయరాదు.

అష్టమి, ద్వాదశి, షష్ఠి, చతుర్థి, చతుర్దశి వీటికి పక్ష రంధ్రములని పేరు, ఇవి మిక్కిలి చెడ్డవి.

ఆదివారం మంగళవారం షష్ఠి, వీటియందు తైలాభ్యంగనం చేయరాదు. దశమినాడు ఉసిరిపప్పుతో స్నానం చేయరాదు. త్రయోదశియందు ధననష్టం.

అమావాస్య రెండు రకములు 1.'సినీవాలీ' ఇందు చంద్రుడు కొద్దిగా కనబడతాడు. 2.'కుహూ' ఇందు కళలన్నియు క్షీణించిపోతాయి.

కృతయుగం – కార్తీక శుక్ల నవమినాడు ప్రారంభం

త్రేతాయుగం – వైశాఖ శుక్ల తదియ

ద్వాపరయుగం – మాఘమాస అమావాస్య

కలియుగం – భాద్రపద బహుళ త్రయోదశి

భాద్రపద బహుళ త్రయోదశినాడు, మఘానక్షత్రమై సూర్యుడు హస్తయందుంటే "గజచ్ఛాయాయోగం" ఇది పితరుల కర్మకు అత్యంత పుణ్యఫలప్రదం.

సూర్యాస్తమయ పర్యంతమూ ఉన్న తిథిని అఖండ తిథి అంటారు.

వారములందు చేయదగినవి

ఆదివారం – ప్రయాణం, ఔషధసేవ, యుద్ధం, ధాన్యకర్మ సోమవారం – స్త్రీల ఆభరణములు, సంగీతం యజ్ఞములు, కృషి, మంగళవారం – రాజీప్రయత్నములు, విద్వేషణ కర్మలు బుధవారం – విద్య, లేఖనం, నాట్యం

గురువారం – వస్త్రములు, ఆభరణములు కొనుట ప్రయాణములు

శుక్రవారం – శృంగార కర్మలు, ఉత్సవములు, సంగీతము, శనివారం – మద్యపానం, గృహప్రవేశం, లోహపనులు

సూర్యుడు – స్థిరుడు

చంద్రుడు – చరుడు

కుజుడు – క్రూరుడు

బుధుడు – సజ్జనుడు

గురుడు – గౌరవ స్వభావి

శుక్రుడు – కోమలుడు

శని – తీక్ష్ణస్వభావి

"పుష్యమి నక్షత్రము ప్రయాణమునకు, యాత్రకు చాలా మంచిది. శుభకర్మలకు కూడా విశేష శుభప్రదం. ఎటువంటి దోషమునైనా "పుష్యమి" నక్షత్రం పోగొడుతుంది. చంద్రాష్టమదోషం కూడా పోగొడుతుంది.

అశ్వన్యాది నక్షత్రములకు, ఆకాశమునందు కొన్ని తారలు సన్నిహితంగా ఏర్పడ్డాయి. ప్రకాశమానంగా ఖగోళములో భచక్రమునందు (ZODIAC) వెలిగే వీటినే "యోగతారలు" అంటారు.

27నక్షత్రములకు, వాటియందు జన్మించిన కొన్ని వృక్షములున్నవి. వాటిని పూజించుట మంచిది, శత్రుసంజ్ఞగల వృక్షములను పీడించవలెను.

| నక్షత్రములు | తారలు | జనిత వృక్షం |
|---|---|---|
| అశ్విని | 3 | బాంసా |
| భరణి | 3 | పనస |
| కృత్తిక | 6 | మేడి |
| రోహిణి | 5 | జామి |
| మృగశిర | 3 | చంద్ర |
| ఆర్ద్ర | 1 | తాంద్ర చెట్టు |
| పునర్వసు | 4 | వెదురు |
| పుష్యమి | 3 | రావి |
| ఆశ్లేష | 5 | నాగవృక్షం |
| మఖ | 5 | మర్రి |
| పుబ్బ | 2 | మోదుగ |
| ఉత్తర | 2 | జువ్వి |
| హస్త | 5 | కుంకుడు |
| చిత్త | 1 | కొబ్బరి |
| స్వాతి | 1 | మద్ది |
| విశాఖ | 4 | పాహికం బాగడ |
| అనూరాధ | 3 | వకుల |
| జ్యేష్ఠ | 3 | దేవదారు |
| మూల | 11 | మద్ది |
| పూర్వాషాఢ | 4 | నీటిప్రబ్బలి |

| నక్షత్రములు | తారలు | జనిత వృక్షం |
|---|---|---|
| ఉత్తరాషాఢ | 4 | పనస |
| శ్రవణం | 3 | జిల్లేడు |
| ధనిష్ట | 4 | జమ్మి |
| శతభిషం | 100 | కడిమి |
| పూర్వాభాద్ర | 2 | మామిడి |
| ఉత్తరాభాద్ర | 5 | నిమ్మ |
| రేవతి | 32 | పిచుమందకం |

# క్రకచ యోగం

ఇది ఒక అశుభకాలం. ఈ యోగమందు ఏవిధమైన శుభకర్మలు, ముహూర్తములు చయరాదు, తిథి – వారములు రెండూ కలిపితే 13సంఖ్య కారాదు. 13సంఖ్య వచ్చిన ఎడల అది క్రకచయోగం. ఉదా: సోమవారం (2) ఏకాదశి (11) ఈ రెండూ కలిస్తే 13 సంఖ్య అవుతుంది. ఇది దేనికీ మంచిది కాదు.

సంవర్తక యోగం. సప్తమి ఆదివారం, పాడ్యమి బుధవారం సంవర్తక యోగం. ఇది కూడా మంచిది కాదు. ఏ విధమైన శుభకర్మలూ చేయరాదు.

# సంక్రాంతి ఫలితములు

సూర్యసంక్రమణము ఏ వారమునందు ఏర్పడునో వాటి ఫలితములు

ఆదివారం – ఘోర – అల్పులకు పరమ సుఖం

సోమవారం–ధ్వాంక్షి–వ్యాపారులకు లాభం

మంగళవారం–మహోదరీ–చీకటివ్యాపారులకు లాభం

బుధవారం–మందాకినీ–రాజకీయవేత్తలకు లాభం

గురువారం–నందా–విద్యావేత్తలకు లాభం

శుక్రవారం–మిశ్రా–జంతుజాతికి వృద్ధి

శనివారం–రాక్షసికా–నీచులకు మంచిది.

# సంక్రాంతుల పేర్లు

విష్ణుపద సంక్రాంతి, వృషభ, సింహ, వృశ్చిక, కుంభ సంక్రమణములు షడశీతిముఖ సంక్రాంతి, మిధున, కన్య, ధను, మీన, సంక్రమణములు.

ఉత్తరాయణ సంక్రాంతి – మకర సంక్రమణం

దక్షిణాయన సంక్రాంతి – కర్కాటక సంక్రమణం

వసంత విషువత్ – మేష సంక్రమణం

శరత్ విషువత్ – తులా సంక్రమణం

# గ్రహ వేధలు

గోచారరీత్యా జన్మరాశి నుండి వివిధ రాశులలో, ఆయా గ్రహములు సంచరించునపుడు వివిధ ఫలితములు కలుగుతాయి. అదే సమయములలో నిర్దిష్ట గ్రహములకు నిర్దిష్ట స్థానములలో మరొక గ్రహమున్నచో, మొదటి గ్రహము వేధింపబడి వ్యతిరేక ఫలితములనిస్తుంది.

**ఉదా:** సూర్యుడు జన్మరాశి నుండి 3–6–10–11 స్థానములందున్న శుభఫలితాలనిస్తాడు. కాని 9–12–5–4, స్థానములందు ఏదేని గ్రహమున్నచో, సూర్యుడు వేధింపబడి, చెడు ఫలితాలనిస్తాడు. 3వ స్థానమునకు 9వ స్థానము వేధా స్థానము 6వ స్థానమునకు 12వ స్థానము వేధా స్థానము ఈ విధముగా క్రమముగానే గ్రహించాలి.

| గ్రహములు | శుభస్థానములు | వేధా స్థానములు |
|---|---|---|
| సూర్యుడు | 3–6–10–11 | 9–12–5–4 |
| చంద్రుడు | 1–3–6–7–10–11 | 5–9–12–4–8 |
| కుజుడు | 3–6–11 | 12–9–5 |
| బుధుడు | 2–4–6–8–10–11 | 5–3–9–1–8–12 |
| గురుడు | 2–5–7–9–11 | 12–4–3–11–8 |
| శుక్రుడు | 1–2–3–4–5–8–9,11,12 | 8–7–1–10–9–5 |
| శని | 3–6–11 | 11–6–5 |
| | | 12–9–2 |

సూర్య, శనులకు, చంద్ర బుధులకు పరస్పర వేధ లేదు.

సూర్యాది గ్రహములు చెడు స్థానములందున్నపుడు, వారి వారి శుభస్థానములలో ఏదేని గ్రహమున్నచో, వీరు వేధింపబడి, శుభఫలితాల నిస్తారు. దీనినే "వామవేధ" అంటారు.

## లగ్నములందు చేయదగ్గ పనులు

| | |
|---|---|
| మేషం | ప్రయాణం, సంధి, యుద్ధం |
| వృషభం | స్థిరమైన పనులు, కృషి వ్యాపారంగ గృహప్రవేశం |
| మిధునం | కళలు, వివాహం, అలంకారములు |
| కటకం | చెరువులు త్రవ్వుట, లేఖనం |
| సింహం | వ్యాపారం, సాహసములు, కృషి, స్థిరమైన పనులు |
| కన్య | విద్య, అలంకారం, వస్త్రములు ధరించుట ఔషధసేవ |
| తుల | వ్యాపారం, వివాహం వ్రతములు శుభకర్మలు |
| వృశ్చికం | ప్రమాణ స్వీకారం, స్థిరమైన పనులు, చౌర్యకర్మలు |
| ధనస్సు | కళలు, ప్రయాణం, వివాహం |
| మకరం | పశుకర్మలు, యాత్ర, సేవలు |
| కుంభం | వ్యాపారం, కళలు, నీటిపై ప్రయాణం – ఆయుధ కర్మ |
| మీనం | కృషి, వ్యాపారం, వివాహం, అలంకారములు |

ఏ పనికైనా ముందు లగ్నబలం చూడాలి. (ముహూర్తాలకు) తరువాత చంద్రబలం చూడాలి.

**'చంద్రస్య బలమాధారం। ఆధేయంచాన్యఖేటజం।**
**ఆధార భూతేనా ధేయం। ధీయతే పరినిష్టితమ్॥**

**తా॥** చంద్రబలము ఆధారము, మిగిలిన గ్రహముల బలములు ఆధేయములు, చంద్రబలమును బట్టే, మిగిలిన గ్రహములు రక్షింపబడుచున్నవి.

వివాహమునందు, వధూవరులిరువురికీ రవి–గురుల బలం బాగుండాలి.

**'గోచరం వా వేధజం చాష్టవర్గ రూపజం బలం।**

**యథో త్తరం బలాధిక్యం స్థూలం గోచరమార్గజం॥**

గోచరము కంటే, వేధబలము బలమైనది. వేధకంటే 'అష్టకవర్గ' బలము గొప్పది. ఇది సూక్ష్మమైనది.

వివాహలగ్న చక్రమందు, చంద్రుడు ఏ గ్రహముతోనూ కలసియుండరాదు. రవితో కలసిన దరిద్రుడగును. కుజునితో కలసిన మరణం లేదా రోగము. బుధునితో కలసిన సంతానము కలుగదు. గురునితో కలసిన దౌర్భాగ్యం, శుక్రునితో కలసిన శత్రుభయం. శనితో కలసిన వైరాగ్యం, రాహువుతో కలసిన కలహం, కేతువుతో కలసిన కష్టములు కలుగుతాయి.

బుధ, గురు, శుక్రులు వీరిలో ఒకరైనా కేంద్ర స్థానమందున్నపుడు సకల దోషములు నశిస్తాయి. బుధుడు శుభయుతుడై యుండాలి.

"గురుర్బలీ త్రికోణస్థః సర్వదోష వినాశకృత్"

గురుడు 5–9 స్థానములందుంటే సర్వదోషములు నివారింపబడతాయి. గురుబలం అంత గొప్పది.

# లగ్నకాలం

ఏ ముహూర్తమునకైనా లగ్నకాలం నిర్ణయం. దాని యందు ఆపనీ ఆచరించడం అదృష్టవంతులకే సాధ్యం లగ్నకాలం అంటే "సరైన ముహూర్తం".

ఆరోగ్యవంతుడైన మనిషి, సుఖంగా కూర్చున్నప్పుడు కనురెప్ప కదలిక సమయాన్ని, 30 భాగములు చేస్తే, దాని "పర" అంటారు.

ఈ "పర"ను 100 భాగములుచేస్తే ఒక దానిని "త్రుటి" అంటారు.

ఈ 'త్రుటి'లో 1000వ వంతు భాగాన్ని లగ్నకాలము అంటారు.

దీన్ని తెలుసుకోవడం దేవతలకే సాధ్యం కాదు. మానవుడనగా ఎంత? ఈ ల్నగకాలమైనా, మరోకాలమైనా, పూర్వకర్మ వశంచేతనే ఆ సమయంలో చేయబడుతుంది.

**జ్యోతిష పండితులు, కేవలం నిమిత్తమాత్రులు, వీరి వల్లనే శుభాశుభములు జరగవు. పూర్వకర్మ ననుసరించి గ్రహ ఫలితాలు సంభవిస్తాయి.** అయితే గురుబలం జాతక చక్రంలో బాగున్నపుడు గ్రహ శాంతులవల్ల కొంత దోషం ఉపశమిస్తుందని శాస్త్రం చెబుతోంది. జపము, దానము, ఔషధములు, రత్నధారణ వీటివల్ల బాధలను కొంత తొలగించవచ్చు. ఇది అనుభవ సిద్ధం.

# వాస్తు

ఏ భవనం నిర్మించినా ముందు క్షేత్ర పరీక్ష చేయాలి. మట్టియొక్క వాసన, రంగు, రుచి, నీరు వీటిని బాగా పరీక్షించాలి.

బారెడు లోతు గోయిత్రవ్వి, సాయంకాలం దాని నిండా నీరుపోసి, మరునాడు ఉదయం చూస్తే, జలం ఉంటే సమృద్ధి, బురదగా ఉంటే సమఫలితం, పీల్చుకుపోయి ఎండినట్లుంటే అధమం అని తెలుసుకోవాలి.

చతురస్ర స్థలమును తూర్పు భాగమును ఎనిమిది సమాన భాగములు చేసి వాటిలో ఉన్న ఉచ్ఛ స్థానములో ద్వారం ఉంచాలి ఆయా భాగాల్లో ఫలితములు.

హాని–దరిద్రం–ధనం–ఉద్యోగం–ధనలాభం–నష్టం కోపం భయం

**ఈశాన్యం** **తూర్పు** **ఆగ్నేయం**

ఇదే దక్షిణ దిశలో ఆగ్నేయం నుంచి 1) మరణం, 2) బంధనం 3) భయం, 4) ధనలాభం, 5) వృద్ధి, 6) ఆరోగ్యం 7) వ్యాధి 8) దరిద్రం ఇదే పశ్చిమ దిశలో అయితే నైఋతి నుంచి వాయవ్యానికి 1)పుత్రహాని 2) శతృవృద్ధి, 3) ధనప్రాప్తి 4) ధనప్రాప్తి 5)సౌభాగ్యం, 6) అతి సౌభాగ్యం 7) దుఃఖం 8) శోకం.

ఇదే ఉత్తరదిశలో అయితే వాయవ్యం నుంచి ఈశాన్యానికి 1) స్త్రీహాని 2) దరిద్రం 3) హాని 4) ధాన్యం 5) ధనలాభం 6) సంపత్ వృద్ధి 7) మహాభయం 8) రోగం

# ఏకాశీతి పదవాస్తు

ఇంటికి ఏకాశీతి పదవాస్తు అన్వయం చేయాలి. ఏకాశీతి అంటే 81 అని అర్థం. వాస్తుయందు 81మంది దేవతలున్నారు. ఈ 81పదములు ఈవిధంగా ఉంటాయి.

తూ

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| 32 | 1 | | | | | | 2 | 10 |
| 33 | | | | | | | | 11 |
| 30 | | | బ్ర | బ్ర | బ్ర | | | 12 |
| 29 | | | బ్ర | బ్ర | బ్ర | | | 13 |
| 28 | | | బ్ర | బ్ర | బ్ర | | | 14 |
| 27 | | | | | | | | 15 |
| 26 | 4 | | | | | | 3 | 16 |
| 25 | 24 | 23 | 22 | 21 | 20 | 19 | 18 | 17 |

వీటియందు మధ్యనున్న 9పదములు బ్రహ్మ స్థానములు ఇవి చాలా చెడ్డ స్థానములు, 1-9-17-25 సమీప స్థానములు పిశాచ స్థానములు కాన, ఈ ప్రదేశమందు శంకుస్థాపన చేయరాదు. ఆ విధముగా చేసినచో దుఖము, శోకము, భయము కలుగును. మిగిలిన శుభస్థానములందు పుత్ర-పౌత్ర-ధన-సంతోషములు కలుగును.

కోణ భాగములును (ఈశాన్యం, ఆగ్నేయం, నైరుతి వాయవ్యం) మర్మసంధులు అంటారు.

ఈశాన్య కోణం నుంచి-నైఋతి కోణానికి దీర్ఘ మరియు హ్రస్వ కర్ణములు (రేఖలు) గీయాలి, అదే విధంగా ఆగ్నేయకోణం నుంచి వాయవ్య కోణానికి రేఖలు గీయాలి. ఇవి ఖండించుకొను స్థానములు మహామర్మ సంధులు, ఉపమర్మములు అంటారు. ఇవి వేధా స్థానములు కావున ఇచ్చుట, గోడ, కిటికీ మరియు స్థంభం (పిల్లర్) వంటి ఏ నిర్మాణం జరిగినా వాస్తు పురుషుని అవయవలోపం జరిగినట్లే, యజమానికి కూడా, ఇదే అవయవమందు దుష్పరిణామాలు కలుగుతాయి.

మార్గశిర, మాఘ, ఫాల్గుణ, వైశాఖ, శ్రావణకార్తీక మాసములు గృహనిర్మాణము నకు శ్రేష్టమైనవి, ఇందు పుత్ర ఆరోగ్య-ధనవృద్ధి లాభములు కలుగుతాయి.

తూర్పు మొదలుగా అకారాది వర్గులు ఈ విధంగా ఏర్పడతాయి.

| | | |
|---|---|---|
| తూర్పు | అవర్గు | గరుడ |
| ఆగ్నేయం | కవర్గు | మార్జార |
| దక్షిణం | చవరు | సింహ |
| నైఋతి | టవర్గు | శ్వాన |
| పడమర | తవర్గు | సర్పి |
| వాయువ్యం | పవర్గు | మూషిక |
| ఉత్తరం | యవర్గు | గజ |
| ఈశాన్యం | శవర్గు | సూకర |

యజమాని ప్రధమ నామాక్షర వర్గుకు 5వ వర్గు వత్రువర్గు కావున ఆదిశయందు గృహనిర్మాణము చేయరాదు.

ఉదా:- **"సంపత్‌కుమార్"** ఈ యజమానికి పేరులో ప్రధమాక్షరం "స" ఇది శవర్గులో ఉంది కనుక ఈశాన్య సింహద్వారం ఇల్లు బాగా యోగిస్తుంది. దీనికి 5వది శ్వానవర్గు నైరుతి సింహద్వారం ఇల్లు శత్రువర్గు కావున ఇది మంచిది కాదు.

ఇంటి పొడవు వెడల్పులను, పరస్పరం గుణించి, 8చే భాగిస్తే శేషము ఆయము అవుతుంది. 1-అయితే ధ్వజాయము, 2-ధూమాయము, 3-సింహాయము,

4–శ్వానాయుము, 5–వృషభాయుము 6–ఖరాయుము, 7–గజాయుం, 8–ఖ్వాంక్షాయము.

బ్రాహ్మణులకు ధ్వజాయము మంచిది. క్షత్రియులకు సింహాయము, వైశ్యులకు వృషభాయము, అన్ని వర్ణముల వారికి గజాయము మంచిది.

ధ్వజాయమునకు కీర్తి, ధూమమాయమునకు శోకం, సింహాయమునకు జయము, శ్వానాయమునకు శతృత్వము, వృషభాయమునకు ధనము, ఖరాయమునకు దరిద్రము, గజాయమునకు సుఖము, ధ్వాంక్షాయమునకు రోగము, ఫలితములు ఏర్పడతాయి.

ఏకశాల (వసారా) గృహమును ధృవము అంటారు. రెండు శాలల గృమమును ధాన్యము అంటారు. 3.జయం, 4.నంద, 5.ఖర, 6.కాంత 7.మనోరమ, 8.సుముఖ, 9.దుర్ముఖ, 10.క్రూర, 11.శతృపద, 12.స్వర్ణప్రద, 13.క్షయప్రద, 14.ఆక్రంద, 15.విపుల, 16.విజయ, ఈ విధంగా 16రకముల గృహములు, తిరిగిప్రస్తార భేదం చేత 96 రకములు ఏర్పడతాయి.

## వాస్తుపూజ

గృహ ప్రవేశ సమయమున వాస్తుపూజ చేయాలి. బారెడు, పొడవు, వెడల్పులతో చతురస్రం వేదినిర్మించి, పైన బియ్యంపోసి ఏకాశీతి పదవాస్తువలె 31 అడుగులు విభజించాలి. ఇందులో 49మంది అంతర్దేవతలు, 32మంది బహిర్దేవతలు, వీరిని పూజించాలి.

ఈశాన్య భాగమందుండు 32 దేవతలపేర్లు 1.అగ్ని, 2.పర్జన్య, 3.జయంత, 4.పాకశాసన, 5.సూర్య, 6.సత్య, 7. భృశ 8.ఆకాశ, 9.వాయు, 10.పూష, 11.నైరుతి, 12.దండధర, 13. గాంధర్వ 14.మృగరాజక, 15.మృగ 16. పితృ గణాధీశ 17. దౌవారికి, 18.సుగ్రీవ, 19.పుష్పదంత, 20.జలాధీశ, 21.అసుర, 22.శేష, 23.పాప, 24.రోగ, 25.భోగి, 26.ముఖ్య 27. నిశాకర, 28.సోమ, 29.సూర్య, 30.అదితి, 31. దితి, 32.గృహబుక్ష.

మధ్యగడియందు బ్రహ్మాది 9 దేవతలను పూజించాలి. షోడశోపచార పూజచేయాలి.

**'వాస్తు పురుష నమస్తేస్తు, భూశయ్యా, భరిత ప్రభో**
**మద్ గృహం ధనధాన్యది సమృద్ధిం కురుసర్వదా॥**

అని ప్రార్థించాలి.

దేవతామూర్తులు నీళ్ళు స్రవిస్తాయి. ఏడుస్తాయి చెమట పొందుతాయి. నవ్వుతాయి, ముఖము దిశ మారుస్తాయి. పొగ, నూని, అగ్ని, రక్తము, పాలు స్రవిస్తాయి.

ఈ విధమైన వికారములు దేవతామూర్తులు ప్రకటించినపుడు, పగలు, నక్షత్రములు కనపించినపుడు, తారలు రాలినపుడు, రాత్రియందు ఇంద్రధనస్సు కనిపించినపుడు, ఆవు, ఏనుగు, ఒంటి, గుర్రము, వీటి శరీరము నుండి అగ్ని కణములు రాలినపుడు 2 లేక 3 శిరస్సుల బాలుడు జన్మించినపుడు, ఒక జాతియోని నుండి వేరొక జాతి ప్రాణి, జంతువు జన్మించినపుడు ఈ ఉత్పాతములన్నీ జననష్టమును, అరిష్టాన్ని సూచిస్తాయి.

# ఉల్కాపాతములు

ఆకాశము నుండి పడే ఉల్కాపాతములు 5 విధములు

1)ధిష్ణ్యా, 2) ఉల్క , 3) విద్యుత్, 4) అశని, 5) తార

వీటిలో ధిష్ణ్యా, ఉల్క, అశని ఈ పేరుగల ఉల్కలవల్ల 45రోజులలో ఫలితాలు కలుగుతాయి. విద్యుత్ 6 రోజులలోను, ఫలితాలిస్తాయి.

రెండు బారల పొడుగుఉండే తోకచుక్క పేరే ధిష్ణ్యా, దీనిఫలితం మానవులపైన జంతువులపైన ఉంటుంది.

అశని అంటే "పిడుగు" ఇది మిక్కిలి భయంకరమైన శబ్దంచేస్తూ భూమిలోనికి పోతుంది.

సూర్యచంద్రుల మండలముల చుట్టూ అనేక రంగులతో "పరివేషములు" ఏర్పడతాయి. వీటివల్ల వర్షములు బాగా కురుస్తాయి. మిశ్రవర్ణములతో ఇవి ఏర్పడితే ప్రజాపాలకులకు నాశనం, రెండు మండలముల పరివేషములవల్ల సేనాధిపతికి (కమాండర్ చీఫ్) మూడింటివల్ల దేశాధినేతకు అకాల మృత్యుభయం, ఇవి పంచమి, నవమి, చతుర్దశి, తిధులలో ఏర్పడకూడదు. త్రయోదశి పూర్ణిమలలో రాజులకు అశుభం.

సూర్యతేజస్సువల్ల మేఘములలో మరొక సూర్యబింబం గోచరిస్తుంది. దీనినే ప్రతి సూర్యుడంటారు. ఈ బింబం వైఢూర్య మణివలె స్వచ్ఛమైన ధవళవర్ణముతో ఉంటే దేశం సుభిక్షంగా ఉంటుంది. పసుపురంగు రోగములు, నలుపు వల్ల జననష్టం కలుగుతాయి.

ఈ బింబం ఉత్తరదిశలో గోచరిస్తే మంచి వర్షములు కలుగుతాయి. దక్షిణదిశలో గాలులు, సూర్యునిపైన ప్రతి సూర్యుడు ఏర్పడితే పాలక మృతి, క్రింద ఏర్పడితే జననష్టం కలుగుతాయి.

**శివార్పణమస్తు**